# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వజ్రాయుధం

రచన: వి. యస్. రావ్

## ప్రమాదకరమైన డ్రగ్

రచన: వసుంధర

## విమాన దోపిడి

రచన: భీమవరపు పురుషోత్తం

ఎడారి కోయిల — ఐదవభాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—169
జనవరి, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1,

# వజ్రాయుధం

## వి. యస్. రావ్

క్కారాగింది.

యూనిఫామ్‌లో వున్న డ్రైవర్ ఆదరాబాదరా కిందికి దిగాడు. వెనుక డోర్ తెరిచి వినయంగా నిలబడ్డాడు.

గంటల తరబడీ, తాపీగా పాలిష్ చేసినట్టున్న నల్లబూటు కిందికి పాగింది. ఒకే కదలికలో కార్లోంచీ ఇవతలికి జరిగి, అతను నిటారుగా నిలబడ్డాడు. పొడుగాటి బలిష్టమైన శరీరం. చెవుల్ని కప్పేస్తూ కిందికి దిగిన క్రాపు. మీసాలు లేని మొహం ఆరోగ్యంతో మెరుస్తోంది. గుబురుగా వున్న కనుబొమల కిందున్న కళ్ళని గోల్డురిమ్డ్ గ్లాసులు లోతాన్నుంచీ దాచేశాయి. హోల్డర్‌లోకి దోపబడిన జాన్ ప్లేయర్స్ స్పెషల్ సిగరెట్ ఏటవాలుగా పాగి, పొగల్ని చిమ్ముతోంది....

అతని ఎడమచెయ్యి కదిలింది; చిన్న చప్పుడుతో డోర్ మూసుకుంది. కుడిచేత్తో హోల్డర్ని పట్టుకుని, సిగ

రెట్‌ని ఇవతలికి తీశాడతను. చిరునవ్వులో డ్రైవర్ని చూశాడు. అతని పళ్ళు తళుక్కుమన్నాయి.

"గోపాల్, కార్ని పార్కింగ్ లాట్‌కి తీసుకెళ్ళి సరిగ్గా గంట తర్వాత ఇక్కడికిరా" అతని కంఠం ఖంగు మంది.

"యస్సర్!" డ్రైవర్ కుడిచేత్తో టోపీని తాకుతూ అన్నాడు.

అతను వెనక్కి తిరిగాడు. బ్రౌన్ కలర్ సూట్‌లో వున్న అతని శరీరం హుందాగా కదుల్తోంది. నీలంరంగు టైలో గాలి ఆడుకుంటోంది. అతను కారుకి అటువైపున ఆగాడు. కిందికి వొంగి డోర్ని తెరిచాడు.

"స్టెపౌట్, డార్లింగ్!" అన్నాడు నవ్వుతూ.

ఆమె కదిలింది. పాలరాతి శిల్పం కాళ్ళల్లా అవుపిస్తూ మెరుస్తున్న ఆమె కాళ్ళని అతను చిరునవ్వులో చూశాడు. మెలికలు తిరుగుతూ కిందికి దిగి, ఆమె అతని దగ్గరగా నిలబడింది.

ఆమె సన్నగా పొడుగ్గా అతని భుజాలదాకా వుంది. వైలెట్ కలర్ బ్లౌజూ, మినీ స్కర్టూ ఆమె వొంటి రంగుని వెయ్యింతలు హెచ్చుచేసి చూపిస్తున్నాయి. వెండితో తయారుచేసిన సన్నటి దారాల్లా వున్న ఆమె బాబ్ హెయిర్ భుజాలమీద గమ్మత్తుగా కదుల్తోంది. తెల్లటి, వెడల్పాటి ఫ్రేమున్న నల్ల కళ్ళద్దాలు ఆమె మొహంలో దాదాపు మూడోవంతుని దాచిపెట్టాయి.

అతను ఆమెవైపే చూస్తూ కారు డోర్ని మూశాడు. కారు కదిలింది. ఆమె గిర్రున తిరుగుతూ పరిసరాల్ని వుపాయగా గమనించింది. అతనివైపు చూసి నవ్వింది. రక్తం పులిమినట్టున్న ఆమె పెదాలు విచ్చుకున్నాయి. తెల్లటి

పళ్ళు తళుక్కుమన్నాయి.

"అరవింద్ డార్లింగ్, ఐ లైక్ ఇండియా! ఐ లవ్ టూ లివ్ హియర్, ఫరెవర్!" అందామె ఉద్రేకంతో.

ఎనిమిది అంకె ఆకారంలో కళ్ళు చెదిరేలా వున్న ఆమెని అరవింద్ నవ్వుతూ చూశాడు.

"డార్లింగ్, యూనో ఇట్స్ నాట్ పాసిబుల్. ఇండియాలో నాకు అంత సులభంగా ఉద్యోగం దొరకదు...."

"ఓహ్.... డార్లింగ్!" ఆమె నిరాశతో అరిచింది.

ఎనిమిది అంకె మధ్యభాగంమీద చెయ్యేసి అతను ఆమెని దగ్గరగా లాక్కున్నాడు. ఆమె తల అతని మొహంవైపు పైకి లేచింది. తన నల్ల కళ్ళద్దాలగుండా, ఆమె నల్ల కళ్ళద్దాల్లోకి ప్రేమతో ఆవేశంతో చూశాడు.

"నేను రిటైరయ్యాక, ఈ కంట్రీలో సెటిల్ అవుదాం...."

"రియలీ?" ఆమె అడ్డు తగిలింది.

"ప్రామిస్!"

"ఇన్ దిస్ కంట్రీ, ఇన్ దిస్ బ్యూటిఫుల్ సిటీ! ఓకే?" ఆమె కంఠం ఆవేశంగా ధ్వనించింది.

"అఫ్కోర్స్....కమాన్.... మొదట ఇండియా నగలు పెట్టుకుందాం, తరవాత ఇండియాలో ఇల్లుకట్టుకుందాం!" అరవింద్ నవ్వుతూ అన్నాడు ఆంగ్లంలో. ఆమె కిలకిల నవ్వింది. ఆమె అందం, చాలామట్టుకు దుస్తుల్లో దాగని ఆమె అందం, ఆమె నవ్వూ పేవ్‌మెంట్ మీద ఆగి చూస్తున్న వ్యక్తులకి మతులు పోగొట్టేస్తోందని అతనికి తెలుసు!

అరవింద్ ఆమెని రెండు చేతుల్తో కుడివైపుకి

తిప్పాడు. ఎదురుగా, కొంచెం దూరంలో వున్న నగల దుకాణంవేపు ఉషారుగా చేతో చూపించాడు.

“నోనా హనీ, లెట్స్ గోటూ జూబారీస్: ఫేమస్ జూయలర్స్ ఇన్ ఇండియా!” అరవింద్ నవ్వుతూ అన్నాడు.

నోనా కదిలింది, నదురూ బెదురూ లేకుండా హుందాగా, స్వేచ్ఛగా నడుస్తున్న ఆమె అందం ట్రాఫిక్‌నీ, మనుషుల్నీ లెక్కచేయకుండా యథేచ్ఛగా కదిలిపోతున్న జెర్సీ ఆవుపెయ్య అందంలా వుంది. అరవింద్ ఆమె కందిరీగ నడుంచుట్టూ తనచేతిని సగర్వంగా చుట్టాడు. ‘అమెరికానుంచీ ఎలాంటి అందాన్ని తెచ్చుకున్నానో చూడు!’ అని తన దేశానికి ఎగతాళిగా చెప్తున్నట్టుంది అతని వాలకం. నోనా ధరించిన హైహీల్స్ పేవ్‌మెంట్ మీద గమ్మత్తుగా, నిర్లక్ష్యంగా చప్పుడు చేస్తున్నాయి.

‘జూబారీస్’ ముందు నించున్న యూనిఫామ్డ్ డోర్‌మన్ తలవాల్చి, గ్లాస్ డోర్ని తెరిచాడు. అరవింద్ నోనా నడుంమీద చేతిని అలాగే వుంచి ఆమెని లోపలికి నడిపించాడు. సిగరెట్‌ని దులిపేసి, అతను లోపలికి జరగ్గానే డోర్ మూసుకుంది.

ఎయిర్ కండిషన్‌డ్ షో రూమ్‌ని రెడ్ కలర్ తివాచీ మెత్తగా కప్పేసింది. షో రూమ్ లైట్ల కాంతి రిఫ్లెక్షన్‌తో ధగధగ మెరిసిపోతోంది. అరవింద్ చుట్టూ పరకాయించాడు. కౌంటర్లముందు ఆడా, మగా చాలామంది నగల సెలక్షన్‌లో, బేరంలో మునిగిపోయి వున్నారు.

“ఓహ్! వండర్‌ఫుల్! ఫాంటాస్టిక్!” నోనా కళ్ళద్దాలు తీసేస్తూ ఉద్రేకంతో అరిచింది. చాలా తలలు

ఆమెవైపు తిరిగాయి. చాలామంది మగాళ్ళు తమ ఆడవాళ్ళనీ, నగల్నీ మరిచిపోయి నోనాని చూస్తూ ఉండిపోయారు.

"వెల్‌కమ్! మే ఐ హెల్ప్‌యూ సర్?" వైట్ సూట్‌లో వున్న యాభైయ్యేళ్ళ వ్యక్తి మర్యాద ఉట్టిపడే కంఠంతో అన్నాడు.

అరవింద్ అతన్ని ఎగాదిగా చూశాడు. "సహాయపడగలరనే అనుకుంటున్నా. ఐ వాంట్ టూ సీ మిస్టర్ కుబేర్‌దాస్ జౌహారీ...."

"లోపలికి రండి...." అంటూ అతను కదిలాడు.

అరవింద్ నోనా చేతిని పట్టుకుని అతన్ని వెంబడించాడు. వైలెట్ కలర్ వెల్వెట్‌లో సగంపైగా అవుపించేలా పెట్టిన ఖరీదైన నగని చూస్తున్న వాళ్ళలా షాపులోని మగాళ్ళు గుడ్లు పెకలించుకుని నోనాని చూస్తూ ఉండిపోయారు. నోనా మూలంగా చాలామంది మగాళ్ళకి వాళ్ళ పెళ్ళాల మోచేతులపోట్లు తప్పవనుకుంటూ లోపల్లోపల నవ్వుకున్నాడు అరవింద్.

షాపతను వాళ్ళని ఒక కౌంటర్ ముందుకి తీసుకెళ్ళాడు. గోల్డురిమ్డ్ అద్దాలు వేసుకున్న అడంగి యువకుడు వాళ్ళని చూడగానే కౌంటర్ వెనక లేచినిలబడ్డాడు. నోనావైపు చూడకుండా వుంటానికి అతను విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

"ఏం కావాలి, సార్?" సన్నటి కంఠంతో అతను ప్రశ్నించాడు.

"మిస్టర్ జౌహారీ...." అరవింద్ క్లుప్తంగా అన్నాడు.

"ఫాదర్ బిజీగా వున్నారు....నగలు కావాలంటే సెలక్టు చేయండి...."

"నా వైఫ్‌కి ఇండియా నగలు కొనాలని అమెరికా నుంచీ వచ్చాం. పూజారీగారి అడ్వైజ్ కావాలి వాటి. అదరవైసీ...." అరవింద్ ఆగాడు.

"ఒక్క క్షణం!" యువకుడు ఆదరాబాదరా ముందున్న టెలిఫోన్ని అందుకున్నాడు. అరవింద్‌కి పూర్తిగా అర్థంకాని భాషలో యేదో గొణిగాడు. అతను జెట్ స్పీడులో పలికిన 'అమ్రికా' అన్న అక్షరాలకి అర్థం అమెరికా అని అరవింద్ చివరికి అర్థం చేసుకున్నాడు. రిసీవర్ పెట్టేసి ఆ యువకుడు వైట్ సూట్ వ్యక్తి వేపు తలాడించాడు.

"దయచేయండి!" అంటూ అతను ఎదురుగా వున్న ఫుల్ సైజ్ మిరర్ వైపు కదిలాడు. అరవింద్, నోనా యువకుడి వైపు నవ్వుతూ కదిలారు.

ఎదురుగా వున్న అద్దంలో వైట్ సూట్ వ్యక్తి ప్రతిబింబం తటాలున వెనక్కి జరిగింది. పక్కకి జరిగి, లోపలికి వెళ్ళమన్నట్టు అతను సైగచేశాడు. అరవింద్, నోనా లోపలికి జరిగారు. కన్సీల్డు లైటింగ్ డిమ్‌గా వుంది. రెడ్ కార్పెట్ కప్పిన వెడల్పాటి మెట్లమ్మట వాళ్ళిద్దరూ కిందికి దిగారు.

చతురస్రాకారంలో వున్న బేస్‌మెంట్ హాలు మధ్య వెడల్పాటి నగిషీ టేబుల్ వెనక వినాయకుడి విగ్రహంలా కూచున్న కుబేర్‌దాస్ పూజారి మెల్లిగా పైకి లేచి గున్న ఏనుగులా నిలబడ్డాడు. పామేడ్ దట్టించి బాగా నున్నగా అణగదువ్విన క్రాపు. రిమ్‌లెస్ అద్దాలు. వెడల్పాటి మొహం. ఖరీదైన సిల్కు జుబ్బా. మెడలో పులిగోరున్న బంగారు గొలుసు. పాన్ నములడంతో ఎరుపెక్కిన పెదాల్ని తెరిచి, బంగారు పళ్ళు చూపిస్తూ

అతను నవ్వాడు.

"మిష్టర్ జాబారీ, అయామ్ అరవింద్. ఇండియాలో పుట్టి, ఇండియాలో, అమెరికాలో చదూకుని, అమెరికాలో స్థిరపడ్డాను...."

"గ్లాడ్ టూ నోయూ మిస్టర్ అరవింద్!" జాబారీ ముందుకి వొంగి, అరవింద్ చేతిని పట్టుకున్నాడు.

"దిసీజ్ మై వైఫ్ నోనా...." అరవింద్ సగర్వంగా పరిచయం చేశాడు.

జాబారీ మొహం చూయింగ్ గమ్‌లా సాగింది. మళ్ళీ అతను పళ్ళికిలించాడు. నోనా టేబుల్ వారగా జరిగి బాగా కిందికి వొంగి అతనివైపు తన చేతిని చాచింది. కంగారుని చిటికెలో సర్దుకుని జాబారీ ఏనుగు తొండం లాంటి చేతిని చాచాడు. కాడల్లాంటి నోనా వేళ్ళు అతని వేళ్ళని చుట్టేశాయి.

"హౌడీ మిష్టర్ జాబ్రరీ!" నోనో యాసగా అంది.

పిగిలిపోడానికి సిద్ధపడుతున్నటున్న ఆమె బ్లౌజ్ మీంచీ అతి ప్రయత్నంమీద చూపుల్ని ఆమె మొహం మీదికి జరిపాడతను.

"వెల్‌కమ్ టూ ఇండియా, వెల్‌కమ్ టూ జాబారీస్ మిసెస్ నోనాజీ!" జాబారీ ఉత్సాహంగా అన్నాడు. "ప్లీస్....ప్లీస్ టేక్ యువర్ సీట్స్. ఫీల్ అట్ హోమ్. షాప్ ఈజ్ యువర్స్! ఏం కావాలో చెప్పండి!"

"నా భార్యకి ఇండియా నగలంటే విపరీతమైన మోజు ఏర్పడింది. హై క్లాస్ నగలు, ముఖ్యంగా హై క్లాస్ నెక్లెస్ కావాలి...." అరవింద్ ప్రారంభించాడు.

"జరూర్! వెరీ గుడ్. నోనాజీకి భారత్ నగలు నచ్చాయి. మా దగ్గర...."

"ఒక్క క్షణం!" అరవింద్ అడ్డు తగిలాడు. "అమెరికన్ మ్యాగజైన్స్ 'రొమాన్స్', 'యంగ్ లేడీ' 'బ్యూటీ' వగైరాల్లో మీ ప్రకటనలు చూశాం. జూబారీస్‌లో నగలు కొండానికే ప్రత్యేకంగా ఈ ట్రిప్ ప్లాన్ చేశాం. మాకు ఆర్డినరీ సరుకు చూపకండి. గివజ్ క్లాస్ స్టఫ్!"

"షూర్!" జూబారీ అరిచాడు. అమెరికన్ పత్రికల్లో తను ఏర్పాటు చేసిన ప్రకటనలు ఇన్నాళ్ళకి ఒక మంచి గిరాకీని లాక్కొచ్చినట్టున్నాయి! అతను ఇంటర్‌కమ్ స్విచ్ నొక్కి కొడుకుని మించిన వేగంతో యెవరికో ఏదో చెప్పాడు.

అరవింద్ కోటు జేబులోంచి జాన్ ప్లేయర్స్ స్పెషల్ పాకెట్ తీశాడు. హోల్డర్‌లోకి సిగరెట్ దోపి వెలిగించి, సోనాకి అందించాడు. జూబారీ కళ్ళు విశాలంగాచేసి సోనాని చూశాడు. హోల్డర్ని ఎర్రటి పెదాలమధ్య ఇరికించి సానో పొడుగ్గా దమ్ములాగింది. ఆమె బ్లౌజ్ పైకి ఉబికింది. జంట బొంగరాలమీద అడ్డదిడ్డంగా పడున్న సన్నటి తాడులా వున్న ముత్యాలదండ సోనా బ్లౌజ్ మీద గమ్మత్తుగా కదుల్తోంది. ముందుకు వొంగి ఆ ముత్యాల దండని తిన్నగా సర్దాలన్న కోరికని బలవంతంమీద ఆపుకున్నాడు కుబేర్ దాస్ జూబారీ.

తనొక సిగరెట్ వెలిగించి అరవింద్ పాకెట్‌ని అతనివైపు విసిరాడు. జూబారీ క్షణకాలం తటపటాయించాడు. తను సిగరెట్లు మానేసి చాలాకాలమైంది. అయితే సోనా—ఆడది—సిగరెట్ కాలుస్తూ తనలోని పౌరుషాన్ని రెచ్చగొడుతోంది. జూబారీ సిగరెట్ పెదాల మధ్య ఇరికించాడు. అరవింద్ లైటర్ని అతని ముందుకి

తోశాడు. జాబారీ సిగరెట్ వెలిగించి, పిడికిలి బిగించి
కాలిమిత్తిలా చప్పుడుచేస్తూ దమ్ములాగాడు. సోనా
అతన్ని నవ్వుతూ చూసింది.

తలుపు దగ్గర చప్పుడైంది. నలుగురు అసిస్టెంట్లు రెండు
డజన్ల స్లైడ్స్ కేసుల్ని టేబుల్ మీద పెట్టి దూరంగా
జరిగారు. జాబారీ ఆవేశంతో 'స్లైడ్ వర్ణన' ప్రారం
భించాడు.

పదిహేను నిమిషాలు గడిచాయి. ఇరవై నాలుగో
స్లైడ్ అరవింద్ చేత్తో దూరంగా తోశాడు. జాబారీ
ఇద్దర్నీ ఆశ్చర్యంగా చూశాడు.

"నో యూజ్! ఉయ్ వాంట్ క్లాస్ స్టఫ్!" అర
వింద్ నవ్వుతూ అన్నాడు.

"ఇదంతా క్లాస్ సరుకే! ఒక్కొక్కటి అయిదు లక్షలు
దాటుతుంది. ఫెలాక్స్! మీ డాలర్లలో...."

"నెవర్ మైండ్! మిస్టర్ జాబారీ, అలెగ్జాండర్
సోక్రటీస్ ఒనాసిస్ జాక్విలిన్‌కి అరడజను నెక్లెస్‌లు
ప్రెజెంటు చేశాడు. అలాంటి సరుకు....మరెక్కడా,
ఎక్కడా చిక్కని అద్భుతమైన సరుకు వుంటే
చూపండి...."

జాబారీ నమ్మలేనట్టు చూశాడు. అమెరికావాళ్ళ
ఆలోచనలు ఆకాశాన్ని అంటుతూ వుంటాయా?
ఒనాసిస్ అంత ధనికుడు తన ముందున్నాడా? అసంభవం.

"నెక్లెస్ మీద మీరు ఎంత పెట్టగలరో చెప్తే...."
ఓరకంట చూస్తూ ఆగాడతను.

"స్కై ఈజ్ ది లిమిట్! ఎంతైనా ఫరవాలేదు.
అయితే, మాకు అపూర్వమైన సరుకు కావాలి!" అర
వింద్ నవ్వుతూ అన్నాడు. "ఉయ్ కెన్ ఇవ్ బెస్ట్ ఎ

షార్ప్యాన్!"

"అయితే పదిలక్షల్లో.... డైమండ్ నెక్లెస్...."

"ఒక్క క్షణం...." అరవింద్ అద్దురగిలి వోరగా ఇంకా నిలబడే వున్న అసిస్టెంట్లని చూశాడు. చూపుల్ని జాబారీవైపు సాభిప్రాయంగా చూశాడు.

జావారి శిష్యులకి కళ్ళతో సైగ చేశాడు. క్షాస్సేపట్లో నలుగురూ నెక్లెస్ బాక్సుల్ని తీసుకుని నిష్క్రమించారు' జాబారీ చెప్పమన్నట్టు అరవింద్ వైపు చూశాడు.

"మిష్టర్ జాబారీ, అమెరికాలో ఫేషన్ల ట్రెండ్ మారింది. నగలు ఎంత పాతవైతే వాటికంత గిరాకీవుంది. పాతనగల్ని, ముఖ్యంగా చరిత్రలో పేరుపొందిన వ్యక్తులు ధరించినవాట్ని జనం వేలం వెర్రిగా ఎగబడి కొంటారు! పాతికేళ్ళ క్రితం ఎవరో సినిమాతార వాడిన సిల్క్ జేబురుమాలు దొరికితే పాతికవేల డాలర్లు గిరాటేసి, కొనేస్తారు! ఇంక నగలైతే చెప్పక్కర్లేదు! మీకు అర్థమౌందనుకుంటాను...." అరవింద్ ఆగి, ఉత్సాహంగా చూశాడు.

జాబారి తలాడిస్తూ వుండిపోయాడు.అరవింద్ చిన్నగా నవ్వాడు.

"ఇంకా విడమరచి చెప్తాను: పాతకాలం నాటివి అంటే హిస్టారికల్ ఇంపార్టెన్స్—చారిత్రక విలువ—వుండే నగలు వుంటే మాకు ఇవ్వండి!"

"యా! హిస్టారికల్ ఇంపార్టెన్స్! ఐ లవ్ సచ్ థింగ్స్! ఐయామ్ డైయింగ్ టు వోన్ యాన్ అర్నమెంట్ ఆఫ్ ఏ లేట్ ప్రిన్సెస్!" నోనా అరిచింది.

జాబారి కళ్ళు చిట్లిస్తూ చూశాడు. నోనా అతన్ని ఆవేశంతో చూసింది. "హౌవ్ యూ గాట్ సచ్ థింగ్?

ఐ విల్ గివ్ మై లైఫ్...."

"మిస్టర్ జాబారీ రాజవంశాలకి సంబంధించిన వాళ్ళ-వారసులు...దివాలాతీస్తూ తమ పూర్వీకుల నగల్ని అమ్మేస్తూ వుంటారు....అలాంటి వాళ్ళు మీకెవరేనా తెలుసా?" అరవింద్ ప్రశ్నించాడు.

"చెప్పలేను...." జాబారీ అనుమానిస్తూ అన్నాడు. మెల్లిగా కుర్చీలోంచి లేచాడు. "క్షణంలో వస్తా...." అంటూ వెనకున్న గుమ్మంవైపు బరువుగా కదిలాడు.

అరవింద్ మరో సిగిరెట్ వెలిగించాడు.

మూడువైపు గోడల ముందు ఐరన్ సేఫ్స్ పేర్చబడిన స్ట్రాంగ్ రూమ్‌లో పెద్ద అద్దం ముందు కుబేర్ దాస్ జాబారీ నిలబడి, తన ప్రతిబింబాన్ని సాలోచనగా చూశాడు. ఆలోచన అతని రెప్పల్ని కదలకుండా చేసేసింది. అరవింద్ మాటలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి....

హిస్టారికల్ ఇంపార్టెన్స్ వున్న నగలు..అమెరికాలో వుండే వాళ్ళందరికీ రోజుల్లో కొత్త వైత్యం పట్టుకుంటూ వుంటుంది. 'పాత సరుకు' అంటే చాలు....విలువ గురించి పట్టించుకోరు వాళ్ళు. నత్తగుల్లల్ని దండగా గుచ్చి వంద రూపాయాలంటే తడుముకోకుండా పారేస్తారు. నోనా అరవింద్‌ని బ్రహ్మాండంగా కంట్రోల్ చేయగలదని స్పష్టంగా అర్థమవుతోంది....

ధైర్యంగా వ్యవహరించి బేరం చేయగలిగితే తనకి 'ఆ సరుకు' రెండింతలు లాభం ఆర్జించి పెడుతుంది. పైగా, ఆ సరుకు ఇండియాలో కనిపించడం ప్రమాదం.. తన దగ్గరున్నా సరే! ఆ సరుకుని అమ్మేసి డబ్బుచేసుకుని, ధైర్యంగా వుండమని అద్దంలో ప్రతిబింబం అతనితో

చెప్తోంది. తనలోంచీ మరెవరో వద్దంటున్నారు. పోతే అలాంటిది మళ్ళీ దొరకదు!

'ఊన్నా, దానివల్ల ఉపయోగం సున్నా. అలా బాక్సులో వుళ్ళుతూ వుండాల్సిందే! నీ భార్యో, కూతురో వేసుకుని తిరగలేరు! అది బైటపడిన మరుక్షణం తన పని అయిపోతుంది!'—ప్రతిబింబం నవ్వింది.

దాన్ని మంచి ధరకి అమ్మగలిగితే తను కోటీశ్వరుడై పోతాడు. గుండెల్లో కుంపటిలా దాన్ని దాచుకుని, భయపడుతూ రోజులు గడిపే యాతన తప్పుతుంది.

కుబేర్ దాస్ జాబారీ సాలోచనగా పక్కనే టేబుల్ మీదున్న పాన్ దాన్ లోంచీ బీడాతీసి నోట్లో దోపుకున్నాడు. ఎడమచేత్తో యెడమ కనుబొమని మీసం దువ్వుకున్నట్టు దువ్వసాగాడు.

తటాలున అద్దంలో ప్రతిబింబం చిరునవ్వు నవ్వింది. ఆ సరుకుని అమెరికన్ దంపతులకి అమ్మడానికి అతను నిశ్చయించుకున్నాడు. అయితే తను జాగ్రత్తగా అరవింద్ గురించి కనిపెట్టాలి. వాళ్ళు అమెరికానుంచీ వచ్చారని ఖచ్చితంగా తేలిసేదాకా, తిరిగీ అమెరికాకే వెళ్తారని తెలిసేదాకా, తను తేలిపోకూడదు.

కుబేర్ దాస్ జాబారీ తలపంకించుకుంటూ ముందు గదిలోకి నడిచాడు. తలుపుముందు తటాలున ఆగాడు. అరవింద్, నోనాల మొహాలు మెల్లిగా దూరంగా జరిగాయి. అరవింద్ కూచున్న కుర్చీ చేతిమీంచీ లేచి, నోనా తన కుర్చీలోకి సరఫరా అయ్యింది. అరవింద్ జేబురుమాల్తో పెదవులు తుడుచుకుని చిరునవ్వు నవ్వాడు.

"వెల్, గాట్ సమ్థింగ్ ?"

జాబారీ మాట్లాడకుండా తన కుర్చీలో కూచున్నాడు.

సీరియస్‌గా అరవింద్‌ని చూశాడు. "మిస్టర్ అరవింద్, మీకు కావాల్సిందాన్ని అరేంజ్ చేయగలను. అయితే మీ ట్రూ ఐడెంటిటీనీ, మీరు అమెరికానుంచే వచ్చారన్న విషయాన్నీ, అమెరికాకే తిరిగి వెళ్తారన్న విషయాన్నీ మీరు నిరూపించాల్సి వుంటుంది...."

"దేనికి?" అరవింద్ కళ్లు చిట్లిస్తూ అడిగాడు.

జాబారీ క్షణకాలం మౌనంగా వుండిపోయాడు. కిందికి జారుతున్న బీడారసాన్ని చప్పుడుచేస్తూ లోపలికి లాగాడు.

"వివరాలన్నీ మీకు చెప్పడానికి నాకు పర్మిషన్ లేదు. హిస్టారికల్ ఇంపార్టెన్స్ వున్న అర్నమెంట్సు కావాలన్నారు. అలాంటివి కావాలంటే మీరు కొన్ని షరతుల్ని అంగీకరించాలి...."

"ఏమిటవి?"

"మీరు నిజంగా అమెరికాకి లేదా మరో విదేశానికి-చెందినవారై వుండాలి. అక్కణ్నుంచీ వచ్చినట్టూ అక్కడికే వెళుతున్నట్టూ మీరు నిరూపించుకోవాలి.."

"ఎందుకు?" అరవింద్ రెట్టించి అడిగాడు.

"మీకోసం నేను ఏర్పాటు చేయాలనుకుంటున్న 'స్పెషల్ సరుకు' మళ్ళీ ఇండియాలో అవుపించకూడదు. అమాటకొస్తే ఆసియాలోనే వుంటానికి వీల్లేదు!"

"ఐసీ....అర్థమైంది...." అంటూ అరవింద్ ఆగి తదేకంగా జాబారీ ఏనుగు కళ్ళలోకి చూశాడు. "మిస్టర్ జాబారీ, అది దొంగసొత్తా?"

జాబారీ ఉలిక్కిపడ్డాడు. సర్దుకుని గొల్లున నవ్వాడు. "మిస్టర్ అరవింద్, యూ అర్ అఫెండింగ్ జాబారీస్! జాబారీస్ స్టోలెన్ అర్నమెంట్సు డీల్ చేయరు! అయామ్

సారీ...."

"అయితే, అన్ని కండిషన్లెందుకు?" అరవింద్ ప్రశ్నించాడు.

"కొంచెం వివరిస్తాను. నేను మీకోసం సెలెక్ట్ చేస్తున్న నగ ఒక రాజవంశానికి చెందింది. తరతరాలుగా ఎన్నో చేతులు మారుతూ వచ్చి, ఇప్పుడొక స్త్రీ అధీనంలో వుంది. దానికోసం వారసులుగా చెప్పుకుంటున్న కొంతమంది స్వార్థపరులు నిర్విరామంగా తాప త్రయపడుతున్నారు. వాళ్ళకి అందకుండా పాపం ఆమె దాన్ని ఎలాగో కాపాడుకుంటూ వస్తోంది. దాన్ని అమెరికన్స్‌కి అమ్మేయమని నేను ఆమెకి సలహా ఇచ్చాను. భవిష్యత్తులో అది ఇండియాలో అవుపడ్డం చాలా ప్రమాదం....ఇంతే నేను చెప్పగలను!"

అరవింద్ అర్థమైనట్టు చిరునవ్వు నవ్వాడు. మెల్లిగా తలతిప్పి నోనావైపు చూశాడు.

"డార్లింగ్, షో హిమ్ యువర్ పాస్‌పోర్టు!"

నోనా మొసలి చర్మంతో చేసిన హాండ్ బ్యాగ్‌లోంచీ పాస్‌పోర్టు తీసి టేబుల్ మీద పడేసింది. అరవింద్ దాన్ని జౌహారీకి అందిచ్చాడు. జౌహారీ తాపీగ్గా దాన్ని పరిశీలించి అరవింద్ వైపు చూశాడు.

"మరి....మీది?" అన్నాడతను.

"నా గదిలో వుంది. హోటల్ కాంటినెంటల్, టూ డబుల్ జీరో టూ. మీరు మానిటీరాలంటే వెళ్ళి పట్టావాలి...."

"మిస్టర్ అరవింద్, అయామ్ సారీ.... ...చూడాలి; జాగ్రత్తకోసం!" జౌహారీ నవ్వుతూ అన్నాడు.

అరవింద్ నిట్టూర్చి, వాచీ చూసుకున్నాడు. "మరో

గంటలో 'ఇండియా టుమారో' పత్రిక మమ్మల్నిద్దర్నీ ఇంటర్వ్యూ చేయబోతోంది. రేపు ఆదివారం మీరు తెరిచే వుంటారా?"

"సన్ డే హాలిడే. అయినా మీరొస్తానంటే నేను రెడీగా వుంటాను. ఎటొచ్చీ మనకీ షాపుతో పని లేదుగా?" జాబారీ నవ్వుతూ అన్నాడు.

"ఆల్ రైట్, రేపు సాయంత్రం ఆరింటికి వస్తాం. పొద్దుట సైట్ సీయింగ్ ఫిక్స్ చేసుకున్నాం...." అంటూ అరవింద్ లేచాడు.

"అర్వింద్ డార్లింగ్....వాటబౌట్ ద ఆర్నమెంట్? ఐ వాంటూ వేరిట్ ఫర్ ది ఇంటర్వ్యూ!" నోనా ఉద్రేకంతో అంది.

అరవింద్ ఆమెని నవ్వుతూ చూశాడు. "నోనా డియర్, ఉయ్ హావ్ టూ వెయిట్! టుమారో...."

"ఐ హర్డ్ జాబ్రీస్ ఈజే బిగ్ ఫర్మ్...." నోనా నిరాశగా అంది.

"యస్! ఆవర్స్ ఈజే బిగ్ ఫర్మ్. టుమారో యూవిల్ సీ ఇట్" జాబారీ ఉల్లాసంగా అన్నాడు.

"ఓకే. థాంక్యూ సోమచ్. సో లాంగ్" అరవింద్ చెయ్యి చాచాడు.

"జస్ట్ మోమెంట్....టీతాగి వెళుదురుగానీ" అంటూ జాబారీ ఇంటర్ కామ్ ద్వారా ఏదో చెప్పాడు. ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు.

"మిస్టర్ అరవింద్, ముందే చెప్తున్నా. ఇండియాలో వున్నంతకాలం మీరు దాన్ని ధరించకూడదు!"

"ఇందాకా చెప్పకనే చెప్పారుగా?" అరవింద్

నవ్వుతూ అన్నాడు.

"రేపు సాయంత్రం ఆరింటికి ఒక ప్రైవేటు టాక్సీ మీకోసం హోటల్ కాంటినెంటల్ కి వస్తుంది. అందులో యెక్కండి. షాపు మూసివుంటుంది గనక, మరో దారి గుండా అతను మిమ్మల్ని ఇక్కడికి తీసుకొస్తాడు...." జాబారీ వివరించాడు.

"నైస్! థాంక్స్!"

"మిస్టర్ అరవింద్, మీ బేరం కుదురుతుందో లేదో నాకు తెలీదు. ప్లీస్ పేది టాక్సీ ఫేర్!"

"ష్యూర్!" అరవింద్ నవ్వాడు.

టీ కప్పులున్న ట్రేతో అసిస్టెంటు ప్రత్యక్షమయ్యాడు.

## 2

అరవింద్ పాస్ పోర్ట్ ని పరిశీలనగా చూసి, కుబేర్ దాస్ జాబారీ తృప్తికరంగా తలపంకించాడు.

అరవింద్, నోవా ఇద్దరూ అమెరికా కాత్తీలే. అంత వరకూ ఫర్వాలేదు. కాస్ట్లీ హోటల్ 'కాంటినెంట'ల్లో వున్న మాట నిజమే అని తను తేల్చుకున్నాడు. ఖరీదైన నగను ముఖ్యంగా చారిత్రక విలువవుందే నగను కొనే 'అమెరికన్' అనగానే తనలో కొన్ని సందేహాలు తలెత్తాయి. ఎవరో తనతో నాటకం ఆడ్డంలేదని తను తేల్చుకోవాలి. మనుషుల వివరాల్ని రహస్యంగా కని పెట్టడంలో ఎక్స్ పర్ట్ అయిన సిద్ధూరాంని తను నియమించాడు. అరవింద్ తన గురించి చెప్పిన విషయాలన్నీ నిజాలే; ఇండియాకి సంబంధించినంతవరకూ....

అన్నవిధంగానే అతను 'ఇండియా టు మార్కో' ఆఫీసుకి వెళ్ళాడు. అరవింద్ నీ, నోవానీ ఇంటర్వ్యూ

చేయడంకూడా నిజమే అని సిద్ధారాం కనిపెట్టాడు. అన్నీ తృప్తికరంగా వున్నాయి. అయితే ఆ నగని కొనగలిగినంత పైకం అరవింద్ దగ్గరుందా? ఉంటేగానీ తను ఆ అపురూపమైన నగని చూపించడం దండగకాదు. పైసా లేనివాడికి పట్టుచీర చూపించడం దండగ!

ఆలోచనల్లోంచీ దిగి జాబారీ అరవింద్‌ని నవ్వుతూ చూశాడు.

"మిస్టర్ అరవింద్, అమెరికాలో మీరు వుంటోంది ఎక్కడ?"

"పాస్‌పోర్ట్ చూశారుగా?" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

"చూశాను. ఆ పేర్లు గుర్తుండవు....అందుకని...." జాబారీ నసిగాడు.

"పిట్స్బర్గ్."

"పిట్స్బర్గ్....అక్కడ బాలాజీ...."

"యస్. అక్కడ లార్డ్ వెంకటేశ్వరా టెంపుల్ వుంది....ఆ టెంపుల్లోనే మా పెళ్ళి జరిగింది!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

"యా! అవర్ వెడ్డింగ్ టుక్ ప్లేస్ ఇన్‌ది ప్రెజెన్స్ ఆఫ్ వెంకటేశ్వరా!" నోనా ఉషారుగా అంది. "అర్వింద్ డియర్, యూ ప్రామిస్డ్ టూ టేక్ మీటూ తిరూపాతీ!"

"ష్యూర్!" అంటూ అరవింద్ జాబారీవైపు చూశాడు.

"మిస్టర్ అరవింద్, అక్కడ మీ వుద్యోగమేమిటి?" జాబారీ ప్రశ్నించాడు.

అరవింద్ నవ్వుతూ చూశాడు. "మీ ప్రశ్నకి మీరు కోరే సమాధానం మరొకటని నాకు తెలుసు.

ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్, మిస్టర్ జూబారీ, ఆడమ్ అండ్ ఈవ్ సింథటిక్స్‌లో మేనేజింగ్ డైరెక్టర్ 2గా పనిచేస్తున్నా. ఇంక మీ ప్రశ్నకి జవాబు: ఏడాదికి నాకు దాదాపు తొంభైవేల డాలర్లు జీతంకింద వస్తుంది. బోనస్‌లూ అవీ వేరే వున్నాయి. ఈ దేశంలో ఉద్యోగాలకి గవర్నమెంటు లీవ్ ట్రావెల్ కన్‌సెషన్ ఇచ్చే విధంగా నా కంపెనీ నాకూ ఇస్తుంది. దానిమీదే ఇద్దరం ఇప్పుడు ఇండియాకి వచ్చాం!"

జూబారీ పళ్ళు ఇకిలిస్తూ తలాడించాడు. "తొంభైవేల డాలర్లు.... పెద్ద మొత్తమే! అయితే ఖర్చుకూడా విపరీతంగా వుంటుందనుకుంటా...."

అరవింద్ తటాలున కుర్చీలోంచి లేచాడు. తీక్షణంగా జూబారీవైపు చూశాడు.

"మిస్టర్ జూబారీ, పర్సులో డబ్బులేకుండా బంగారం కొనడానికి వచ్చానేమో అని మీరనుకుంటున్నారు! మీ ప్రవర్తన నన్ను అఫెండ్ చేస్తోంది. అయాం సారీ. మీతో బేరం సాగేలాలేదు. గుడ్ బై!" అంటూ అతను నోనావైపు తిరిగాడు. "నోనా, కమాన్. లెట్సు గెటౌటాఫ్ హియర్! టుమారో ఉయ్ విల్ గో టూ ధీరజ్‌మల్!"

నోనా చివాల్న లేచింది. అరవింద్ చెయ్యి ఆమె భుజమ్మీద పడింది. జూబారీ కంగారుగా చూశాడు. ఆదరాబాదరా పైకిలేచాడు.

"నోనోనోనో.... ...ప్లీజ్! తొందరపడకండి. నా ఉద్దేశం...."

"మీ ఉద్దేశం నాకు తెలుసు. తీరా నగ చూపించి రేటు చెప్పాక బెంబేలుపడి వెళ్ళిపోతానేమో అన్న

భయం మీలో వుంది. ఒకవేళ మేం కొనుగోలు మానేసి భయపడి పారిపోతే మీకేమిటి నష్టం? మీ సరుకు మీ దగ్గరే వుంటుందిగా?" అరవింద్ తీక్షణంగా అన్నాడు.

"అది నిజమే. కొనలేని వాళ్ళకి 'దాన్ని' చూపించడం నాకిష్టంలేదు...." జొహారీ మెల్లిగా అన్నాడు.

"మేం కొనలేని వాళ్ళమని మీకెందుకు అనిపించింది?" అరవింద్ విసుగ్గా ప్రశ్నించాడు.

"మీ స్తోమతెంతో నాకు తెలీదు....అందుకని..."

"అమెరికాలో వున్న నా స్తోమతని మీరు అంచనా వేయలేరు! అనుకుంటే అరేళ్ళలో మీ షాపుని హోల్‌సేల్‌గా కొనేయగలను! ఆల్‌రైట్....మీరు 'స్పెషల్' సరుకు ధర ఎంతో చెప్పండి. శక్తివుంటే చూస్తాను; కొంటాను. లేకుంటే నాలుక కరుచుకుంటూ చకటలా వెళ్ళిపోతాను! ఓకే?" అరవింద్ గంభీరంగా అన్నాడు.

జొహారీ ఒకసారి గుటకలు మింగాడు. "మీరు ఆవేశపడుతున్నారు. ఆల్‌రైటు సొంతదారుకి ట్వెంటీ లాక్స్ ఇవ్వాలి. బేరం కుదిర్చినందుకు జొహారీస్‌కి కమిషన్...."

"మొత్తం ఎంత?"

"అంతా కలిపి ఇరవై రెండు దాటుతుంది "

అరవింద్ మాట్లాడకుండా జాన్ ప్లేయర్స్ సిగరేటు వెలిగించాడు. తటాలున కుర్చీలో కూచున్నాడు. జొహారి కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు.

"అరగంటనుంచీ మీరు నసుగుతూవుంటే అరకోటి అవుతుందేమో అనుకున్నా! మిస్టర్ జొహారీ, మీ 'స్పెషల్ నగని' నిర్భయంగా నాకు చూపించొచ్చు!"

జొహారీ నమ్మలేనట్టు చూశాడు. అరకోటి! తను తొందరపడి ఇరవై రెండు అనేశాడా? అమెరికావాళ్ళకి

ఆర్థిక శాస్త్రం తెలీదా? అయినా తనకి నష్టంలేదు....

అతను నవ్వుతూ చూశాడు. ఇంకా నుంచునేవున్న నోనా తటాలున తన భర్త వైపు వొంగింది. ఉద్రేకంతో అతని బుగ్గమీద చప్పుడు చేస్తూ ముద్దెట్టుకుంది. జాబారి గుడ్లు పైకి ఉబికాయి. ఆ నెక్లెస్ మెడలో తగిలిస్తే నోనా తన భర్తని ఏం చేసేస్తుందో! ఇండియాలో పుట్టినా, అరవింద్ అదృష్టవంతుడు!

"రండి, కళ్ళకి విందు చేసుకోండి!" అన్నాడతను.

నోనా పైకి లేచింది. అరవింద్ సిగరెట్ని యాష్ ట్రేలో నొక్కి లేచాడు. నోనా అతనివైపు నవ్వుతూ చూసింది. పల్చటి తెల్లటి గౌన్లో ఆమె ఏంజెల్ లావుంది. అరవింద్ కోటుకి గుచ్చిన ఎర్రగులాబీని తీసుకుందామె. నవ్వుతూ దాన్ని ముక్కు దగ్గరగా వుంచుకుని ఆఘ్రాణించసాగింది. ఎర్రగులాబీని వెక్కిరిస్తున్న ఆమె పెదవులు జాబారి గుండెను మెలికలు తిప్పుతున్నాయి.

అతిప్రయత్నంమీద కదిలి అతను వెనకున్న గుమ్మం వైపు అడుగులేశాడు. అరవింద్ అతన్ని వెంబడించాడు. జాబారీ బేస్మెంటులో ఇంకా ఎన్ని గదులున్నాయి? నవ్వుకుంటూ, అతను తనని రాసుకుని నడుస్తున్న నోనా భుజం చుట్టూ చెయ్యివేశాడు.

చిన్న గదిలో వున్న సోఫాలో ఇద్దర్నీ కూచోబెట్టి కుబేర్దాస్ జాబారి మరో తలుపు తోసుకుని ఇంకా లోపలికెళ్ళాడు. అరవింద్ నవ్వుతూ నోనావైపు చూశాడు. గదిలోంచీ చిన్నగా శబ్దం వినిపిస్తోంది. జాబారి స్పెషల్ నగకోసం స్పెషల్ విరవ్ సేఫ్ని తెరుస్తున్నట్టున్నాడు.

రెండు నిమిషాల్లో జాబారి గుమ్మంలో ప్రత్యక్ష

మయ్యాడు. అతని వెనకే నీడలా కదులుతున్న మరో వ్యక్తిని అరవింద్ ఆశ్చర్యంతో చూశాడు. నీలంరంగు టైటు పాంటులోకి స్లీవ్ లెస్ వైట్ బనియన్ టక్ చేశాడతను. వెడల్పాటి తోలు బెల్టు. అతని బట్టతల లైట్ల కాంతిని అద్దంలా చూపిస్తోంది. పొడుగాటి సైడ్ బర్న్స్. అంగుళం వెడల్పులో జుట్టు గుర్రం నాడా ఆకారంలో అతని చెవుల వెనకనుంచీ వెనక్కి సాగింది.

కండలు తిరిగిన అతని శరీరం నల్లగా మెరుస్తోంది. కింగ్ కాంగ్ తమ్ముడిలా వున్నాడతను. అతను ఎక్కణ్నుంచీ వచ్చాడు? అరవింద్ కళ్ళు చిట్లిస్తూ చూశాడు. అల్లావుద్దీన్ అద్భుతదీపం జాబారి దగ్గరుందా!

జాబారి సోఫాముందు ఆగి, నవ్వుతూ చూసాడు. అతని చేతులు ఖాళీగా వున్నాయ్.

"మిస్టర్ అరవింద్, క్షమించాలి. పెద్ద ఎత్తున బేరం జరిగి. పెద్ద సరుకూ, పెద్ద మొత్తం చేతులు మారేటప్పుడు నానక్ పహిల్వాన్ నా పక్కనే వుంటాడు. యూనో.. రోజులు మునుపట్లా లేవు...." అంటూ జాబారి తన అంగరక్షకుణ్ని అదోలా చూసాడు.

నానక్ పహిల్వాన్ అరవింద్ దగ్గరగా ఆగాడు. గంటల తరబడీ పరుగుతీసి చెమటలు కక్కుతున్న గుర్రం నుంచీ చిమ్మే వాసనలా, ఏదో వాసన అతని శరీరం నుండీ అరవింద్ వైపు పాకుతోంది.

"ప్లీస్ స్టాండప్!" నానక్ పహిల్వాన్ కంఠం అతని శరీరానికి సరిపడేలా లేదు. గజల్ పాడుతున్న తలత్ మహమ్మద్ కంఠంలా కొద్దిగా వణికింది అతని కంఠం.

సోనా అర్థంకానట్టు చూస్తోంది.

"వాటీస్ దిస్?" అరవింద్ లేవకుండా అరిచాడు.

"ప్లీజ్....నానక్ పహిల్వాన్‌తో సహకరించండి!" జాశారి మెల్లిగా, సౌమ్యంగా అన్నాడు.

అరవింద్ మెల్లిగా నిలబడ్డాడు. నానక్ పహిల్వాన్ చేతులు ఏనుగు తొండాల్లా కదిలాయి. అరవింద్ కోటు జేబుల్నీ, పాంటు జేబుల్నీ, నడుము ప్రాంతాన్నీ వెనుంచే జాగ్రత్తగా తడిమాయి. రెండుసార్లు అలా పరీక్షించాక అతను గారపళ్ళని అరవింద్‌కి చూపిస్తూ నవ్వాడు. "సారీ ..."

అరవింద్ అతన్నే చూస్తూ కూచున్నాడు. నానక్ పహిల్వాన్ నోనా దగ్గరగా జరిగాడు.

"మేమ్‌సాబ్....సారీ.... మేడమ్..." అన్నాడతను.

"నో!" నోనా కంగారుగా అరిచింది; సోఫాకి అతుక్కుపోతూ.

నానక్ పహిల్వాన్ బుట్టతల రుబ్బురోలులా అటూ ఇటూ కదిలింది. "యువర్ బ్యాగ్, మేడం."

నోనా కంగారుగా బ్యాగ్‌ని సోఫా అంచున పడేసి, అరవింద్ దగ్గరగా జరిగింది. నానక్ పహిల్వాన్ బాగ్ జిప్ లాగి, పరిశీలించి జిప్ మూసి సోఫామీద మర్యాదగా పెట్టాడు. నవ్వుతూ తన యజమానివైపు తిరిగాడు. "ఠీక్ హై, మాలిక్."

"ఇబ్బందిని క్షమించండి!" అంటూ జాశారీ శిష్యుడి వైపు చెయ్యి చాచాడు. నానక్ పహిల్వాన్ కుడిచెయ్యి కొండచిలువలా మెలితిరిగి, అతని వెనకవైపుకి జరిగింది. వెంటనే వెడల్పాటి బాక్స్‌తో ప్రత్యక్షమైంది. జాశారి బాక్స్ తెరిచాడు. నవ్వుతూ అరవింద్ వైపు చూశాడు. నానక్ పహిల్వాన్ చెయ్యి మళ్ళీ వెనక్కి మళ్ళింది. ఈసారి రివాల్వర్ అతని చేతిలో ప్రత్యక్షమైంది. అతని

చిన్న చిన్న కళ్ళు అరవింద్ వైపు అద్దంబిళ్ళలా తళుక్కు మన్నాయి.

అరవింద్ కళ్ళు జిగేల్‌మన్నాయి. జూబారి వేళ్ళ మధ్యనుంచీ వేళ్ళాడుతున్న డైమండ్ నెక్లెస్‌ని అతను ఆశ్చర్యంగా చూశాడు. ఉన్నట్టుండి నోనా వుద్రేకంతో కెవ్వుమంది. నానక్ పహిల్వాన్ ఉలిక్కిపడి, ఆమెని చూశాడు.

"ఫాన్‌టాస్టిక్!" నోనా రాగయుక్తంగా అరిచింది.

నెక్లెస్ పనితనం చూడగానే తెలిసిపోతోంది. అర్ధరూపాయిబిళ్ళ సైజులో, గుండ్రటి ఆకారంతో మధ్యలో డైమండ్ మెరుస్తోంది. దానికి రెండువైపులా నక్షత్రాకారంతో అరేసి వజ్రాలు ధగధగమంటువున్నాయి. మధ్యలో వున్న డైమండ్‌మీద ఏదో డిజైన్ అందంగా, లీలగా అవుపిస్తోంది.

"ది ప్రైడ్ ఆఫ్ జూబారిస్! క్వీన్ నెక్లెస్!" జూబారి సగర్వంగా అన్నాడు.

అరవింద్ మాట్లాడలేదు. మంత్రముగ్ధుళ్ళా చూస్తూ వుండిపోయాడు.

"ఐ వాంట్ ప్రిన్సెస్ నెక్లెస్!" నోనా కీచుగా అంది.

"ఇది రాణి ధరించిన నెక్లెస్ అని కాదు నా అర్థం; రాణీలాంటి నెక్లెస్!" జూబారి నవ్వుతూ అన్నాడు.

అరవింద్ వోరగా నానక్ పహిల్వాన్‌ని చూశాడు.

"నెక్లెస్‌ని ముట్టుకోవచ్చా?" జూబారిని అడిగాడతను.

"నిరభ్యంతరంగా!" అంటూ జూబారి నెక్లెస్‌ను అందించాడు. నెక్లెస్‌ని క్షణకాలం చూసి, అరవింద్ చేతిని జూబారివైపు చాచాడు.

"లెన్స్ ఇలా ఇవ్వండి...."

జౌహారి అతన్ని ఆశ్చర్యంగా చూశాడు. భుజాలు ఎగరేసి, జుబ్బాజేబులోంచీ లెన్స్ తీసి అందించాడు.

లెన్స్ కంటికి ఆతికించి, అరవింద్ ఒకొక్క వజ్రాన్ని తీసుకుంటూ, నిదానంగా పరీక్షించి తృప్తికరంగా తల పంకిస్తూ లెన్స్‌ని జౌహారీకీ, నెక్లెస్‌ని సోనాకీ అందించాడు. నానక్ పహిల్వాన్ అప్రయత్నంగా సోనా దగ్గరగా కదిలాడు.

సోనా అటూ ఇటూ చూసి, లేచి బీరువావైపు హంసలా నడిచింది. నెక్లెస్‌ని కంఠంముందు వుంచుకుని అద్దంలోకి అదేపనిగా చూస్తూ వుండిపోయింది. యువరాణీ దగ్గర కొజ్జా బానిసలా నానక్ పహిల్వాన్ ఆమె వెనకనే నిలబడ్డాడు.

"అర్వింద్ డార్లింగ్, కమాన్! సీ!" అరిచింది సోనా.

అరవింద్ లేచి, జౌహారివైపు నవ్వుతూ ఆమె దగ్గరగా నడిచాడు. నానక్ పహిల్వాన్ కొంచెం దూరంగా జరిగి, అలర్టుగా నిలబడ్డాడు. ప్రతిబింబంలో మెరుస్తున్న వజ్రాల్నీ, వజ్రాల్లా మెరుస్తున్న సోనా కళ్ళనీ అరవింద్ చిరునవ్వుతో చూశాడు.

"సే సంథింగ్!" సోనా ఉల్లాసంగా అంది.

"నీ మెడలో వాలాక, దాని అందం ఇరవై రెండు అక్షలరెట్లు పెరిగింది; డార్లింగ్!" అరవింద్ నవ్వుతూ అన్నాడు. అప్పుడే దగ్గరగా వచ్చిన జౌహారి గొల్లున నవ్వాడు.

సోనా చివరికి, అయిష్టంగా నెక్లెస్‌ని అరవింద్‌కి అందించింది. మరోసారి వజ్రాల్ని నిదానించి చూసి,

అరవింద్ జుబారికి ఇచ్చేశాడు. బాక్స్‌లో భద్రపరచి, జుబారి దాన్ని నానక్ పహిల్వాన్ వైపు చాచాడు. వెనక బెల్టుకింద దాన్ని ఇరికించి, నానక్ పహిల్వాన్, రంగం లోకి వచ్చాక మొదటిసారిగా రిలాక్స్ అయ్యాడు.

"నానక్, షర్బత్" జుబారి ఆజ్ఞాపించాడు. నానక్ పహిల్వాన్ పిల్లిలా కదిలాడు.

"మిష్టర్ అర్‌విండ్, సరుకు చూసారు ..." జుబారి ఆగాడు.

"యస్ ...." అరవింద్ సిగరెట్ ముట్టించాడు.

"మీకు వజ్రపరీక్ష తెలుసా?" జుబారి వున్నట్టుండి ప్రశ్నించాడు.

"మిష్టర్ జుబారీ. అమెరికా వెళ్ళేముందు, ఆఫ్రికాలో కిలమాంజిరోలో డైమండ్ ఎక్స్‌పర్టుగా మూడేళ్ళు పని చేసాను!" అరవింద్ సగర్వంగా అన్నాడు.

రెప్పలు పైకెత్తి జుబారి తలపంకించాడు. "మీ వుద్దేశం చెప్పండి!"

"డైమండ్స్ చాలా చాకచక్యంగా కట్ చేయబడ్డాయి. అయితే మీ రేటు రీజనబుల్ కాదు!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

"డైమండ్స్ నాణ్యతా, కటింగ్‌లో విశిష్టతా, ముఖ్యంగా నెక్లెస్‌కి వున్న ప్రాచీనతా—ఇన్నీ దాని రేటుని పెంచేశాయి. కాలం గడిచేకొద్దీ ఇంకా పెంచుతాయి!" జుబారి నవ్వాడు.

"ఆల్‌రైట్. సరుకు నచ్చింది. రేటు నచ్చలేదు. చెప్పండి!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

"చెప్పాను. ఇంక చెప్పలేను!"

"రేటు చెప్పారు; బేరం చెప్పలేదు. గుర్రం

దిగండి!"

"సరుకు నాది కాదు. మీరిచ్చే కమీషన్ మాత్రం నాకు మిగులుతుంది. చాలాకాలంగా ఆ అద్భుతమైన ఆభరణాన్ని కాపాడినందుకు అని చాలా చాలా తక్కువ ప్రతిఫలం!"

"అదంతా నాకు చెప్పకండి. ఒకప్పుడు వజ్రాల గనుల్లో ఎక్స్‌పర్టుగా పనిచేసిన వ్యక్తితో మీరు మాట్లాడుతున్నారు. నన్నడిగితే, ఆ వజ్రాల నాణ్యత నాకు తెలిసినంతగా మీకు తెలీదు! ఎంత అమెరికావాళ్ళయినా, అంత వెర్రిగా డబ్బు వెదజల్లరు...."

"ఆల్‌రైట్ కమీషన్ వదులుకుంటాను. అవతల పార్టీ యేదైనా ఇస్తే చెయ్యి చాపుతాను. అంతే!" జుబారి త్యాగం చేస్తున్నట్టు అన్నాడు.

అరవింద్ నవ్వాడు. "మిస్టర్ జుబారీ, నగ పార్టీ మీరే అని నాకు తెలుసు!"

"వాట్?" జుబారి అరిచాడు.

"అంత పెద్ద నగని యెవరో ఆడది కళ్ళు మూసుకుని మీ చేతుల్లో పెట్టివుండదు. నిష్కారణంగా మీరు దాన్ని రక్షిస్తూ రిస్కు తీసుకోరు! నా అంచనాప్రకారం సగానికి సగం మీరు లాభం లెక్కపెట్టి రేటు చెప్పారు. నా ఆఫర్ పదిహేను, ఆపైన మీ ఇష్టం!"

"అరకోటికి సిద్ధపడిన మీరు బేరాలాడ్డం విచిత్రంగా వుంది! అమెరికాలో ఉన్నా కూడా, మీరు ఇండియనులా గోకుతున్నారు! ఇకపై యివ్వడం ఇష్టంలేకపోతే, నెక్లెస్‌ని మరిచిపోండి!" జుబారి నిష్కర్షగా అన్నాడు.

అరవింద్ తటపటాయించాడు. నోనా అతని భుజమ్మీద తన చేతిని వేసింది.

"అరవింద్ డియర్ ఐ కెన్ సీ దట్ ది బార్గెయిన్ ఈజ్ నాట్ సెటిల్డు! వాటీస్ ది ట్రబుల్?" ఆత్రుత ఆమె కంఠంలో ధ్వనించింది.

"హీ వాంట్స్ ట్వెంటీ లాక్ రుపీస్....ఇన్ అదర్ డాలర్స్...."

"నెవర్ మైండ్ డాలర్స్! ఐ వాంట్ ఇట్!" నోనా పసిపిల్లలా అంది.

"ఓ.కే. యూ గాటిట్!" అంటూ అరవింద్ జుబారీ వైపు తిరిగాడు. "మిస్టర్ జుబారీ, నోనా మీ పార్టీలో చేరిపోయింది. ఇరవై లక్షలు! రుపీస్‌లో కావాలా, డాలర్స్ ఫర్వాలేదా?"

జుబారి ఉలిక్కిపడుతూ చూసాడు. "రుపీస్ అవుతే మంచిది...."

అరవింద్ చేతిని ముందుకు చాచాడు. జుబారి చేతిని గట్టిగా పట్టుకున్నాడు. "ఇటీస్ ఏ డీల్!"

"యస్, యూ ఆర్ లక్కీ. ఎంతో కాలంనుంచీ దాక్కున్న నెక్లెస్ రాణి మిమ్మల్ని వరించింది. డబ్బు.... రెడీగా వుందా?" జుబారి ఆత్రంగా అడిగాడు.

"ఒక సందేహాన్ని మీరు నివృత్తి చేయాలి. ఇండియన్ సాయిల్ మీద దాన్ని వెలికి తీయకూడదని మీరన్నారు. చేతికి వచ్చాక దాన్ని ధరించకుండా నోనాని ఆపడం బ్రహ్మకైరంకాదు! ఇంకా పధ్నాలుగు రోజులు మేం ఈ కంట్రీలోనే ఉంటాం. అన్ని రోజులూ దాన్ని జాగర్తగా దాచివుంచలేం. ఏం చేయమంటారు? గివ్ మీ యువర్ ఎడ్వైజ్!"

"బాంక్ లాకర్లో ఉంచేస్తారా?" జుబారి సాలోచనగా అన్నాడు.

అరవింద్ తల నిరుత్సాహంగా అడ్డంగా ఊగించి. "ఈమధ్య ఇండియన్ బ్యాంక్స్‌లో రాబరీస్ ఎక్కువయ్యాయి. ఆ రిస్క్ తీసుకోవడం నాకిష్టంలేదు...."

జాబారి సాలోచనగా కనుబొమని మెలిపెట్టడం ప్రారంభించాడు.

"మిస్టర్ జాబారీ, మా కోసం నెక్లెస్‌ని మీరే ఎందుకు జాగ్రత్త చేయకూడదు?" అరవింద్ తనే అన్నాడు.

జాబారి వేళ్ళు అతని కనుబొమను వేగంగా దువ్వడం ప్రారంభించాడు. రెండు పెదవుల్నీ విడదీసి పళ్ళు చూపించాడతను. "చేయొచ్చు.... కానీ...."

"మిస్టర్ జాబారీ, ఆ పనిచేస్తే మనిద్దరికీ లాభిస్తుంది, అతిరహస్యంగా మీరు అమ్మిన నగ ఇండియా సూర్యుడి కంటపడదు. ఎంతో మొత్తం చెల్లించి నేను కొన్న ఆ నగ మా టూర్ సమయంలో ఎక్కడో పోతుందన్న భయం మాకుండదు! ఏమంటారు?" అరవింద్ హుషారుగా అన్నాడు.

"యూ ఆర్ కరెక్ట్! పెద్ద మొత్తంలో కొన్న నగని మీరు నా దగ్గరే అట్టేపెట్టడానికి సిద్ధపడితే నాకేం అభ్యంతరంలేదు" జాబారి నవ్వుతూ అన్నాడు.

అరవింద్ చిన్నగా నవ్వాడు. "అమెరికావాళ్ళు అందర్నీ అనుమానించరు!"

"మీ ఇష్టం!"

"పైగా ఇరవై లక్షలూ నేను మీకు ఈ క్షణంలో చెల్లించను. ఎంతో కొంత—సే వన్ లాక్—అడ్వాన్స్‌గా ఇస్తాను. టూర్ అయిపోయి, ఫ్లయిట్ ఎక్కేముందు తతిమ్మా మొత్తం మీకు చెల్లించి, నగను పట్టుకు

పోతాను. దట్ వే, బోత్ విల్ బీ సేఫ్!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

జాబారి అనుమానిస్తూ చూశాడు. మెల్లిగా వెనకున్న సోఫాలో కూలబడ్డాడు. "మిస్టర్ అరవింద్.... ఇరవై లక్షలకి ఒక లక్ష...."

"అది అడ్వాన్స్ మాత్రమే. మన డీల్ ని సీల్ చేయడానికి ఆ మొత్తం చాలు. సరిగ్గా పధ్నాలుగో రోజు నేను కతిమ్మా మొత్తం చెల్లించలేదనుకోండి, అడ్వాన్స్ మీకే చెందుతుంది. ఆ మరుసటిరోజు వచ్చినా మీరు కావాలనుకుంటే డీల్ ని క్యాన్సిల్ చేయొచ్చు...."

"బట్...."

"నో బట్స్; నో ఇఫ్స్! అరగంట వేరంచేసి. నెక్లెస్ మాకు చూపించి, నోనాని చూస్తూ కూచున్నందుకు మీకు లక్ష ఫ్రీగా వస్తుంది!"

జాబారి కిలకిల నవ్వుతూ నోనాని చూశాడు. ముత్యాల దండని నోనా ఎడంచెయ్యి సర్దుతోంది. ఎర్రటి పొడుగాటి ఆమె గోళ్ళు జుబారి లోపల ఎక్కడో, దేన్నో, ఎందుకో కెలికాయి.

"ఆల్ రైట్! అడ్వాన్స్ పే చేయండి!" జాబారి చివరికి అన్నాడు. అరవింద్ నోనావైపు తిరిగాడు.

"మిస్టర్ అర్ వింద్...."

అరవింద్ ప్రశ్నార్థకంగా జాబారిని చూశాడు.

"నెక్లెస్ ఎవరికంటా పడకుండా అమెరికా చేరాలి! అది ఎలా చేస్తారు? మనం జాగర్తగా ఉండటం ఎంతేనా అవసరం...."

"భయపడకండి. కస్టమ్స్ కళ్ళు కప్పడం చాలా తేలిక. నేను ఆఫ్రికా వజ్రాల గనుల్లో పనిచేసిన సంగతి

మీరు మరిచిపోతున్నారు! మేం వెళుతున్న ఫ్లయిట్‌లో నోనా క్లాస్‌మేట్ ఎయిర్ హోస్టెస్‌గా వుంటుంది. ఆమె తలుచుకుంటే నోనాని కూడా ఎవరికంటా పడకుండా తీసికెళుతుంది!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

"యా! జేనెట్ ఈజ్ వండర్‌ఫుల్!" ఎయిర్ హోస్టెస్ అనగానే సంగతి గ్రహించిన నోనా ఉత్సాహంతో అంది.

"వెరిగుడ్! అడ్వాన్స్ ఇస్తారా?" జౌహారి మళ్ళీ అన్నాడు.

అతనిలోని అనుమానాలన్నీ పటాపంచలయ్యాయి.

అరవింద్ ఇంద్రజాలికుడిలా కోటుజేబుల్లోంచీ పది వందరూపాయల నోట్లకట్టల్ని తీసి, జౌహారికి అందించాడు. సరికొత్త నోట్లని జౌహారి సంతృప్తికరంగా చూశాడు.

"మిస్టర్ జౌహారి, అడ్వాన్స్ లక్షా ముట్టినట్టు రిసీట్ ఇవ్వండి" అరవింద్ కంఠం విని జౌహారీ ఉలిక్కి పడి చూశాడు.

"అవసరం లేదనుకుంటా...." అన్నాడు మెల్లిగా!

"అవసరం వుంది! నగా, నగమూ మీ దగ్గరే వున్నాయి. చిన్న కాగితం ముక్క నా దగ్గరుండటం మంచిది. అది పద్ధతి కూడా! అందులో నగలకి అడ్వాన్స్ అని మాత్రం రాయండి. నెక్లెస్ గురించి రాయనవసరం లేదు!" అరవింద్ సూచించాడు.

"అయితే ఫర్వాలేదు!" అంటూ జౌహారి బీరువావైపు వెళ్ళాడు.

సమయం కోసం కాచుకున్న వ్యక్తిలా నానక్ పహిల్వాన్ షర్బత్ లోటాలున్న ట్రేతో ప్రవేశించాడు. జౌహారి ఒక రసీదుని అరవిందుకి అందించాడు. అరవిందు

కోటు జేబులోంచి లెదర్ పర్స్ తీసాడు. పర్సు చుట్టూ గోల్డు లైనింగ్ ఉంది. మధ్యలో 'ఎ' అన్న ఇంగ్లీషు అక్షరం ఆర్టిస్టిక్‌గా లెదర్‌లోకి పోతపోయబడినట్టుంది. బంగారు లైనింగ్‌నీ, అక్షరాన్నీ, అంచులు పిగిలిపోయేలా ఉన్న పర్సులోని నోట్ల బొత్తినీ జబారి మెరిసే కళ్ళతో చూస్తున్నాడు.

అరవింద్ పర్సు ఫోల్డింగ్‌లో వున్న సన్నని గోల్డు పెన్సిల్‌ని ఇవతలికి లాగాడు. రసీదుని పర్సుమీద బోర్లించి, పదమూడు రోజులు లెక్కించి ఆ తేదీని రాశాడు. జబారి తలవాల్చి తేదీనీ, గోల్డు పెన్సిల్‌నీ చూస్తూ ఉండిపోయాడు.

"ఈ తేదీన సరుకు డెలివరీ తీసుకుంటాను. ప్లీజ్ బీ అవైలబుల్!" అరవింద్ జబారితో అన్నాడు. రసీదుని మడిచి, పర్స్ కంపార్టుమెంట్‌లో దోపాడు. పెన్సిల్‌ని దాని స్థానంలో ఇరికించబోయాడు.

"అది....ఆ పెన్సిల్....రియల్ గోల్డా?" జబారి కుతూహలంగా అడిగాడు.

అరవిందతన్ని నవ్వుతూ చూసాడు. "మీ నగ సెలెక్ట్ చేసినప్పుడే నా టేస్టుని మీరు తెలుసుకోవాలి! నేను నకిలీ వస్తువుల్ని తాకను మిస్టర్ జబారీ!" సగర్వంగా అన్నాడు.

జబారి పళ్ళికిలిస్తూ, సిగ్గుపడుతూ నవ్వాడు. పెన్సిల్ని అలాగే చేతిలో ఉంచుకుని అరవిందతన్ని చిరునవ్వుతో చూసాడు.

"ఈ గోల్డు పెన్సిల్ మీద మనసవుతోందా?"

లేదంటూ చెప్పబోయి జబారి కొత్తరకంగా

నవ్వాడు. చేతిలోని వస్తువుల్ని అమెరికన్లు ఇతర దేశాలకి వచ్చినప్పుడు వాళ్ళకి వీళ్ళకీ పారేసి పోతారని అతను చాలాసార్లు విన్నాడు. ఆ 'తిక్క' అరవిందుకు పట్టి వుండొచ్చు!

"కమాన్! తీసుకోండి, గిఫ్ట్‌గా!" అరవింద్ పెన్సిల్‌ని అతనివైపు చాచాడు.

"అహాహ...." జాబారి చేతిని ముందుకు చాపుతూ, నోటితో మెహమాట పడ్డాడు.

"మిస్టర్ జాబ్రీ, టేకిట్! అర్వింద్ గాట్ హాఫ్ డజన్ బ్యాక్ హోం!" నోనా ఉషారుగా అంది.

"ఓహ్....థాంక్యూ థాంక్యూ థాంక్యూ!" పాట పాడుతూ జాబారి పెన్సిల్ని అందుకున్నాడు. "ఇది ఉన్నంతకాలం మిమ్మల్ని గుర్తుంచుకుంటాను!" అన్నాడు నవ్వుతూ.

"మిస్టర్ జాబారీ, బంగారాన్ని మీరు అంత తేలిగ్గా పోగొట్టుకోరు. మీ కొడుకూ, మనవడూ, మునిమనవడూ, అతని మునిమనవడూ—ఇలా యెన్నో తరాలకి అది సంక్రమిస్తుంది!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

"షర్బత్ తీసుకోండి!" జాబారీ ఉషారుగా అన్నాడు ఎంతో ఖరీదైన ఇంపోర్టెడ్ విస్కీని ఆఫర్ చేస్తున్న వాడిలా.

షర్బత్ తాగేసి ముగ్గురూ ఖాళీ గ్లాసుల్ని నానక్ పహిల్వాన్ పట్టుకున్న ట్రేలో పెట్టేశారు.

"ఓకే, మిష్టర్ అర్‌విండ్........సీయూ అన్...." జాబారి వీడ్కోలు ప్రారంభించాడు.

"జస్ట్ మోమెంట్!" అరవిందడ్డు తగిలాడు. "ఒక సారి సెక్లెన్‌ని ఇవ్వండి...."

జుబారి అర్థంకానట్లు కళ్ళు చిట్లించాడు. "దేనికి? చూశారుగా? ఎన్నిసార్లు మానినా అంతే!"

అరవిందతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు.

"మిస్టర్ జుబారీ, చూడ్డానికాక్కాదు!"

జుబారి కనుబొమలు గొంగళిపురుగుల్లా మధ్యలో కలుసుకున్నాయి. "మరి? ఏమిటి మీ అర్థం?"

మాట విని ఆగి, అలర్టుగా నిలబడి వోరగా చూస్తున్న నానక్ పహిల్వాన్ని వోరగా చూస్తూ అరవిందు సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ, కళ్ళు చిట్లించి జుబారిని చూశాడు. గోల్డు పెన్సిల్ సంపాదించిన ఆనందం ఇప్పుడు అతని మొహంమీద లేదు.

"అడ్వాన్సు పే చేసి నేను వెళ్ళిపోతున్నా. నేను తిరిగివచ్చేసరికి ఆ డైమండ్స్ 'ఆ డైమండ్స్'గానే వుండాలి!" అరవిందు గంభీరంగా అన్నాడు.

జుబారి మొహం గాలి యెక్కువగా కొట్టేసిన ఎర్రటి బెలూన్లా అయ్యింది. కళ్ళు గుర్రుగా చూసాయి. "మీరు జుబారీన్తో బేరం చేస్తున్నారు, జులాయిల్తో కాదు, మిస్టర్ అర్వింద్!"

అతను చిన్నగా నవ్వాడు. "అక్షలు చేతులు మారేటప్పుడు ఎంత నూటిగా వెళ్లేమనిషయినా జులాయిగా ప్రవర్తించే అవకాశం వుంది, మిస్టర్ జుబారీ!"

"మిస్టర్ అర్వింద్ ..."

"నో అఫెన్స్! ఫారినర్స్ అని వాసనపట్టగానే, బీచిలో నత్తగుల్లల దండలమ్మేవాడు యాభై పైసల దండకి యాభై రూపాయలు అడుగుతారు! మోసపోడం నాకు ఇష్టంలేదు!"

"మిమ్మల్నెవరూ మోసం చేయరు!" జుబారీ అగ్ర

హంతో అన్నాడు. నానక్ పహిల్వాన్ వెనక్కి తిరిగాడు.

"ఒప్పుకుంటాను. అలాంటప్పుడు నెక్లెస్‌ని ఒకసారి ఇస్తే పోయేదేమిటి?" అరవింద్ నవ్వుతూ అడిగాడు.

"నా స్థానంలో మిమ్మల్ని ఊహించుకోండి. మీకా అనుమానం వేస్తుందో, లేదో కలకత్తా కాళిమీద ఒట్టు పెట్టుకుని చెప్పండి!"

జుబారి బరువుగా నిట్టూర్చాడు. "ఆల్ రైట్! ఇస్తాను. ఏం చేస్తారు?" ఎగతాళిగా అడిగాడతను.

"ఆనవాళ్ళు పెడతాను" తేలిగ్గా అన్నాడు.

"ఎట్లా? వజ్రాలమీద చాకుతో మీ ఇనిషియల్ చెక్కుతారా?" జుబారి కంఠంలో ఎగతాళి ప్రతిధ్వనించింది.

అరవిందు చిన్నగా నవ్వాడు. "చాకుతో కాదు, నా వేలితో చెక్కుతాను. నిజం చెప్పాలంటే వేలితో నొక్కుతాను!"

జుబారి విసుగ్గా చూసాడు. "ఏమిటో మీ వరస నాకేం అర్థంకావడంలేదు. యూ ఆర్ వేస్టింగ్ టైమ్ ..."

"మిస్టర్ జుబారీ, పదమూడు వజ్రాలమీదా నా వేలిముద్రలు వదుల్తాను. ఆ తరువాత దాన్ని నేనే బాక్స్‌లో పెడతాను. బాక్స్‌ని మీరు భద్రంగా దాచిపెడతారు. ఆ తరువాత క్షణంనుంచీ, నేను తిరిగివచ్చేదాకా ఆ నెక్లెస్‌లోని వజ్రాల్ని మీరు ముట్టుకోలేరు!" సగర్వంగా అన్నాడు.

జుబారి కనుగుడ్లు గాజుపేపర్ వెయిట్లలా అయ్యాయి.

"మిస్టర్ అర్....వింద్ ...."

"ఒకే ఒక వజ్రంమీద నాది కాకుండా మరే వేలి

ముద్ర వున్నా, లేదా నా వేలిముద్ర చెరిగిపోయినా, మీ నెక్లెస్ మీ దగ్గరే వుంటుంది! నా అడ్వాన్స్ని రెండింతలు చేసి మీరు చెల్లిస్తారు! వేలిముద్రల నిపుణుల్ని ప్రెయినప్ చేసే సైపుణ్యం నాకుంది!" అరవిందడ్గొస్తూ అన్నాడు. అతని కళ్ళు సానపెట్టిన వజ్రాల్లా వున్నాయి.

"వాట్!" జుబారి నిశ్చేష్ట పోతూ కీచుగా అరిచాడు.

"యస్! ఒకే ఒక వేలిముద్ర చెరిగిపోతే-లేకపోతే, రెండు లక్షలూ ప్లస్ గోల్డు పెన్సిల్ మీరు నాకు సమర్పించేస్తారు. లేకపోతే రహస్యంగా మీ దగ్గరున్న నెక్లెస్ గురించి నేను ఇండియాలో, అమెరికాలో, గల్ఫ్ కంట్రీస్‌లో, చివరికి ఆఫ్రికాలో అక్షరాల్తో దండోరా వేస్తాను!" అన్నాడు.

"ఇది అన్యాయం!" జుబారి అరిచాడు. తెల్లగా పాలిపోతున్న జుబారి చేట మొహాన్ని అతడు చిరునవ్వుతో చూసాడు.

"మిస్టర్ జుబారీ, మీరు వజ్రాల్ని మార్చరుగా?" ప్రశ్నించాడతను.

"ఎందుకు మారుస్తాను?" జుబారీ జవాబుగా హుంకరించాడు.

"మార్చే ఉద్దేశం మీకు లేనప్పుడు మీరు భయపడ్డం దేనికి? నన్ను వేలిముద్రలు వేయనివ్వొచ్చుగా!" అరవిందు నవ్వుతూ అన్నాడు.

జుబారి లోపల్లోపలే నాలుక కొరుక్కున్నాడు. "ఆల్ రైట్ .... వేసుకోండి!" అంటూ శిష్యుడివైపు నిరుత్సాహంగా చూసాడు.

"నానక్ ....లావ్!" అన్నాడు విరక్తిగా.

నానక్ పహిల్వాన్ సర్కస్‌లోంచీ మళ్ళీ కటకటా ల్లోకి వెళుతున్న ఎలుగుబంటిలా కదిలాడు.

పనిముగించి, అరవిందు జాగ్రత్తగా సెక్లెన్‌ని కేస్‌లో పెట్టేసాడు. మూత మూసేసాడు. వజ్రాల్ని మొదట జేబురుమాల్తో శుభ్రంగా తుడిచి, వేలిముద్రలు ప్రింట్ చేస్తున్నంతసేపూ జాబారి విగ్రహంలా నిలబడ్డాడు. రివా ల్వర్ని ధరించిన నానక్ పహిల్వాన్ తుపాకి పేల్చుకోడం మానేసాడు.

"దట్సాల్! ఇంక దాచిపెట్టండి!" అరవింద్ నవ్వుతూ అన్నాడు. దెబ్బతిన్నట్టున్న మొహాన్ని జాబారి శిష్యుడి వైపు తిప్పాడు. నానక్ పహిల్వాన్ మొహంమీద, అతని యజమాని లోపల రగుల్తున్న కోపం ప్రతిబింబి స్తోంది.

"మిస్టర్ అరవింద్ ...మీ జాగ్రత్తని నేను మెచ్చు కుంటాను. అయినా, మీరు నన్ను, వరల్డ్ ఫేమస్ జాబారిస్‌ని అవమానించారు...."

అరవింద్ చిన్నగా నవ్వాడు. "మీరు నా దగ్గర అడ్వాన్స్ బుకింగు చేశారు. తద్వారా మీరు నన్ను అవ మానించారా?"

"అడ్వాన్స్ తీసుకోడం అవమానించడం కాదు!" జాబారి చురుగ్గా అన్నాడు.

"కరెక్ట్! మీలాగే నేను గ్యారంటీకోసం, అడ్వాన్స్ ఇచ్చి రిజర్వ్ చేసుకున్న నగని గుర్తుంచుకోడానికి కొన్ని గుర్తులు పెట్టాను. అదికూడా అవమానించడం కాదు.."

"ఏమైనా " జాబారి అర్థుతగిలాడు.

"నన్నూ, నా మాటనూ నమ్మలేక మీరు అడ్వాన్స్ బుకింగు చేసారు, మిమ్మల్ని, మీ మాటనూ నమ్మలేక

కేను వేలిముద్రలు వేసాను. అంతే! నో అఫెన్స్!" అరవింద్ నవ్వుతూ అన్నాడు.

ఏం చెప్పాలో తోచక జూబారి గుడ్లు మిటకరించాడు.

"ఓకే. వెళ్దాం. తరవాత, ఆ రోజు వస్తాం!" అరవింద్ నవ్వుతూ అన్నాడు. జూబారి తలుపువైపు చూసాడు.

## 3

డార్క్ బ్లూ కలర్ సూటు. వైట్ షర్టు. రెడ్ టై. తలమీద ఫెల్ట్ హాట్, బ్రౌన్ షూస్ మీద పాలిష్ మెరుస్తోంది. అతని ఎడం చేతిలో బ్లాక్ కలర్ బ్రీఫ్ కేసుంది. బ్రయర్ పైపు అతని పళ్ళమధ్య ఇరుక్కుని కిందికి వేళ్ళాడుతోంది. అతని బూట్లు లయబద్ధంగా పేవ్ మెంట్ మీద చప్పుడు చేస్తున్నాయి.

కండలు తిరిగిన పొడుగాటి ఆకారం. అతని నడకలో యేదో ప్రత్యేకత వుంది. కవాతు చేస్తున్న సైనికుడి నడకలోని ప్రత్యేకత అది. శెలవుమీద ఇంటికి వచ్చి, ఏదో పనిమీద యెక్కడికో వెళుతున్న మిలటరీ ఆఫీసర్లా వున్నాడతను. అతని పొడుగాటి కాళ్ళు పేవ్ మెంట్ మీంచీ సన్నటి వీధిలోకి తిరిగాయి.

పది నిమిషాలపాటు నడిచి, ఒక చిన్న ఇంటి గేటు ముందు ఆగాడతను. గేటుకీ, ఇంటికీ మధ్య చిన్న తోట. మధ్యలో ఎర్రటి రిబ్బన్‌లా ఎర్ర ఇటుకలు పరిచిన బాట. అటూ, ఇటూ చూసి అతను గేటు తోసుకుని రెడ్ కార్పెట్‌లా వున్న బాటమీదికి అడుగుపెట్టాడు.

తనకి కావాల్సిన వ్యక్తి నిస్సందేహంగా ఇంట్లో ఉంటాడు. కాని, అతను ఏయే సమయంలో యెక్కడెక్కడ వుంటాడో, ఏయే పనులు చేస్తూవుంటాడో

తనకి చక్కగా తెలుసు. మిలిటరీ ట్రెయినింగూ, రక్తంలో జీర్ణించుకుపోయిన మిలిటరీ జీవన విధానం అతన్ని అలా తయారుచేశాయి. ఒక విధంగా మిలిటరీ క్రమశిక్షణ మనిషిని కాలానికీ, ఒకేవిధమైన అలవాట్లకీ బానిసగా చేసేస్తుంది! అతను నవ్వుకుంటూ గుమ్మం ముందుకు నడిచి ఆగాడు. అతని చెయ్యి తలుపుమీద చిన్నగా చప్పుడు చేసింది.

తను సంపాయించిన వివరాల ప్రకారం, అతను ఇప్పు డిప్పుడే టిఫిన్ ముగించి, టీ తాగుతూ వుండాలి.... తలుపు వెనక అడుగుల శబ్దం యెవరి రాకనో దండోరా వేస్తోంది. గొళ్ళెం లాగబడింది. తలుపు తెరుచుకుంది. వైట్ డ్రిల్ నిక్కర్లోకి చేతుల్లేని బనియన్ని దోపుకున్న అతని శరీరం దృఢంగా అవుపిస్తోంది. గుండ్రటి భుజాలు లావుపాటి మెడ. గుండ్రటి మోహం. మెలితిరిగిన మీసాలు. పొట్టిగా కత్తిరించిన క్రాపు....

"ఎవరు?" తలుపు తెరిచిన వ్యక్తి ప్రశ్నార్థకంగా చూశాడు.

అతను పళ్ళ మధ్యనుంచీ పైపుని ఇవతలికి లాగాడు.

"మిస్టర్ సపన్ సిన్హా...." అతని కంఠం గంభీరంగా వుంది.

"నేనే. మీరు....?"

"అడిషనల్ కమీషనర్, సిఐడి—పేరు శివానంద్"

పైపుని మళ్ళీ పళ్ళమధ్య ఇరికించి అతను కోటుజేబులోంచీ ఐడెంటిటీ కార్డుతీసి, సపన్ సిన్హా చూసేలా పట్టు కున్నాడు.

సపన్ సిన్హా కళ్ళల్లో చిటికలో మార్పొచ్చింది. నిటారుగా బిగుసుకపోయి అతను శల్యూట్ చేసాడు.

తలుపుని బార్లా తెరిచాడు.

"దయచేసి లోపలికి రండి!" నవ్వు మొహంతో ఆహ్వానించా డతను.

శివానంద్ తలకొద్దిగా వంచి, లోపలికి కదిలాడు. సపన్ సిన్హా ఎడమచేతిలోని టీ కప్పుని పక్కనే వున్న టేబుల్ మీద పెట్టాడు. హాలు చివర, కిటికీ దగ్గరగా వున్న మరో టేబుల్ ముందున్న కుర్చీవైపు చెయ్యి చాచాడు.

"ప్లీజ్ సిడౌన్ సర్!" అన్నాడతను వినయంగా.

శివానంద్ కుర్చీలో కూచుని, బ్రీఫ్‌కేసుని టేబెల్ మీద ఉంచుకున్నాడు. తలెత్తి నవ్వుతూ, ఇంకా నిలబడే ఉన్న సపన్ సిన్హాని చూశాడు.

"సిడౌన్!"

"ఒక్కక్షణం....డ్రెస్ మార్చుకుని వస్తాను...." సిన్హా సిగ్గుపడుతూ అన్నాడు.

"డోంట్ బాదర్. యూ లుక్ స్మార్టు ఇన్ దట్ డ్రెస్!" శివానంద్ నవ్వుతూ అన్నాడు.

"థాంక్స్, సర్...." అంటూ సిన్హా టేబుల్‌కి అటువైపు వున్న కుర్చీలో కూచున్నాడు. ఏదో గుర్తొచ్చిన వాడిలా మళ్ళీ లేచాడు.

"టీ తీసుకోండి...." అన్నాడతను మర్యాదగా.

"తరవాత...." అంటూ శివానంద్ ముందుకి వంగాడు. సిన్హా కూచుని ప్రశ్నార్థకంగా చూసాడు.

"మిష్టర్ సిన్హా, సిబిఐ నన్నొక ప్రత్యేకమైన, ముఖ్యమైన పనిమీద పంపించింది...." శివానందాగి పైపులోకి పొగాకు కూరడం ప్రారంభించాడు.

సిన్హా కుతూహలంగా చూసాడు. సిబిఐ కమీష

నర్ తన దగ్గరకు యెందుకు వచ్చాడు? శివానంద్ పైపు వెలిగించాడు.

"నేను చెప్పబోయేది మీరు తప్ప మరొకరు వినకూడదు...."

"ఇంట్లో ప్రస్తుతం ఒక్కర్నే వున్నాను. చెప్పండి" సిన్హా కంఠంలో ఆశ్చర్యం ధ్వనించింది.

"మీరు విన్నాక, మీనుంచీ కూడా మరెవ్వరూ వినకూడదు; టాప్ సీక్రెట్!" నవ్వుతూ అన్నాడు.

సిన్హా కళ్ళు వెడల్పుగా సాగాయి. "ఏమిటో.... చెప్పండి...."

"డిపార్టుమెంట్ నాకు అప్పగించిన పని గురించి పూర్తిగా మీతో చెప్పలేను; ఇప్పుడప్పుడే. ఆ పని నేను ఒక్కడ్నే చేయగలిగింది కాదు. మరో నలుగురి అసిస్టెన్స్ కావాలి. డిపార్టుమెంట్‌నుంచీ కాకుండా ఆర్మ్‌డ్ ఫోర్సెస్ నుంచీ డిస్‌ఛార్జి అయిన, విశ్వాసపాత్రులైన మీలాంటి డీసెంట్ పర్సన్స్‌ని సెలెక్టు చేసుకోడానికి నాకు అధికారం లభించింది. పనినిబట్టీ, అవసరాన్నిబట్టీ నేను ఇలా వ్యక్తుల్ని ఎన్నుకుని పీస్ రేటుమీద, వాళ్ళ సేవల్ని ప్రభుత్వంకోసం ఉపయోగించుకుంటాను...." శివానందాగి, ఆరిపోయిన పైపుని వెలిగించాడు.

తను చేయాల్సిన 'సేవ' ఏమిటో బొత్తిగా తెలీక పోయినా సపన్ సిన్హా మొహంమీద ఆనందం నాట్యం చేయడం ప్రారంభించింది. అంతా అర్థమైపోయినట్టు ఆవేశంతో బుర్ర ఊగించాడతను.

"రేపు ఈ నగరంలో నేను ఒక పని నిర్వర్తించబోతున్నా. తెలుసుకోవాల్సిన క్షణం వచ్చేదాకా, ఆ పని గురించి మీకు వివరించడానికి నాకు అనుమతిలేదు.

సిబిఐ పద్ధతులు మీకు తెలిసే వుండాలి ..."

"ఔనౌను!" సిబిఐ పద్ధతులు తెలీకపోయినా కూడా సపన్ సిన్హా ఉద్రేకంతో అన్నాడు.

"మిస్టర్ సిన్హా, మీ పేరూ, అడ్రసూ నాకెలా తెలిశాయని మీరు అడగలేదు! ఆర్నెల్ల క్రితం నన్ను 'ఈ' కార్యంమీద నియమించినప్పుడు నేను మేజర్ జనరల్ ధర్మకాంత్‌ని కల్సుకున్నాను. నాకు, అంటే నా పనికి అవసరమయ్యే అర్హతలు — కమిట్‌మెంట్, ధైర్యం, చొరవా, త్యాగబుద్ధీ వుండే చాకుల్లాంటి ఎక్స్ సర్వీస్ వ్యక్తుల వివరాల్ని సప్లై చేయమని ఆయన్ని కోరాను. తన సబార్డినేట్సుద్వారా నెలపాటు ఫైల్స్ స్టడీచేసి ఆయన నాకో లిస్టు ఇచ్చారు. ఆ లిస్టులో మీ పేరుంది!"

సపన్ సిన్హా మొహం చేటంతైంది. తన యోగ్యతనీ, శక్తిసామర్థ్యాలనీ కంపెనీ మరిచిపోలేదు! అతను ఉద్రేకంతో శివానంద్ని చూశాడు.

"అయామ్ గ్లాడ్! నన్ను సెలెక్టు చేసినందుకు మేజర్ జనరల్ గారికి కృతజ్ఞతలు తెలుపుకుంటాను!"

"ఆ పని మాత్రం చేయకండి! సిబిఐ అలాంటి సెంటిమెంటుని ఒప్పుకోదు. మీరు చేసేపని గురించి ముందుగా మీకు తెలుసుకోకూడదు. పూర్తిచేశాక పనిగురించి గుర్తుంచుకోకూడదు! మేజర్ గారికి మీనుంచి ఉత్తరం వెళ్ళిన మరుక్షణం లిస్టులోంచీ మీ పేరు తొలగించబడుతుంది!"

"ఐసీ...."

"ముందు ముందు మా కార్యకలాపాల్లో పాల్గొని, పారితోషికం పొందే అవకాశం మీకు ఉండదు!"

"అరమైంది.... ఇంతకీ...." సపన్ సిన్హా సందేహిస్తూ ఆగాడు.

"మీరేం చేయాలో చెప్తాను. రేపు మధ్యాహ్నం ఒంటిగంటన్నరకి నేను నిర్ణయించే ప్రదేశంలో మీరు నన్ను కల్సుకోవాలి. మీకు కొన్ని వస్తువులిస్తాను. అందులో ఒకటి మిమ్మల్ని 'సిబిఐ ఆఫీసర్'గా చూపించే ఐడెంటిఫికేషన్ కార్డు...."

"వాట్?" సిన్హా అడ్డొస్తూ అరిచాడు.

"యస్. మీ పేరుకి అలాట్ చేయబడే నంబరు— మీరు ప్రత్యేకమైన 'ఒక' పనిమీద తాత్కాలికంగా నియమించబడిన ఉద్యోగిగా గౌరవభృతి తీసుకుని సిబిఐ తరఫున పనిచేసే పౌరుడిగా సూచిస్తుంది. ఆ నంబరు లేకపోతే మీ ఐడెంటిఫికేషన్ కార్డు 'అసలు' కార్డే అవుతోంది!"

"ఐసీ...." సిన్హా గొణిగాడు.

"సాధారణంగా ఒక్కొక్కసారి నిర్వర్తించే పని ఒకే ఒకరోజులో, ఇంకా చెప్పాలంటే ఒకే ఒక గంటలో పూర్తవుతుంది. అందుకుగాను, మీకు వెయ్యి రూపాయలు మాత్రం పారితోషికం ఇవ్వబడుతుంది. కన్వేయన్సూ, భోజనం వగైరా అన్నీ అందులోనే...."

గంటపనికి వెయ్యిరూపాయలు! సపన్ సిన్హా ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. తనకి సిబిఐలో ఉద్యోగం దొరికితే బావుండేది....

"నెలకి ఇలాంటి అపాయింట్ మెంట్స్ అరడజనేనా వుంటాయా?" సిన్హా ఆశగా అడిగాడు.

శివానంద్ నవ్వాడు "చెప్పలేం. రెండో ఛాన్సు వుంటుందనీ నేను ప్రామిస్ చేయలేను. అయితే ఎబిలిటీని

మరో క్వాలటీని బట్టి నేను ఎన్నిసార్తైనా, ఏ వ్యక్తి నైనా సెలెక్టు చేసుకోవచ్చు!"

"మరో క్వాలిటీ అంటే?" సిన్హా ప్రశ్నించాడు.

"చేయబోయే పని గురించి చెప్పకుండా వుండటం; చేసినపని గురించి చెప్పుకోకుండా వుండటం! మెయింటనెన్స్ ఆఫ్ టాప్ సీక్రసీ!" శివానంద్ నవ్వుతూ అన్నాడు.

"ఐసీ...."

"మిస్టర్ సిన్హా, మీరు ఈమధ్య తీయించుకున్న పాస్‌పోర్టుసైజ్ ఫోటో కావాలి...."

"ఎందుకో అడగొచ్చా?" సిన్హా మర్యాదగా అడిగాడు.

"మీ ఐడెంటిఫికేషన్ కార్డుకి. తరవాత, రేపు బాగా క్లీన్ చేసి, పర్ఫెక్టుగా డ్రెస్ చేసిన సూట్ వేసుకు రావాలి. పని పూర్తయిన పావుగంటలో మీ పారితోషికం చెల్లించబడుతుంది. ఐడెంటిటీ కార్డు వాపసు తీసుకోబడుతుంది...."

"కమీషనర్ సాబ్....ఏం చేయాలో చూచాయగా చెప్పకూడదా?" సిన్హా మెల్లిగా అడిగాడు.

"అసంభవం!" శివానంద్ నవ్వుతూ అన్నాడు. "ఒక్కటి మాత్రం చెప్పగలను. మీరు చేయబోయే పని బొత్తిగా ప్రమాదంతో కూడింది కాదు. నోరు కూడా తెరవాల్సిన అవసరం వుండదు మీకు! మీ క్షేమానికి భంగంరాదు!"

"థాంక్స్....అన్నట్టు....నలుగురు కావాలన్నారు.... తతిమ్మా ముగ్గురూ...."

"మిస్టర్ సిన్హా, మీకు యెంత తెలియజేయాలో

అంతా తెలియజేశాను. ప్రశ్నలు అడక్కండి. తతిమ్మా ముగ్గుర్నీ నేను ఇదివరకే సెలెక్టు చేసి వుండకపోవచ్చు; సెలెక్టు చేసి వుండొచ్చు. నలుగురు వద్దు; ఒక్కరే, మీరొక్కరే చాలు అనికూడా ఆ క్షణంలో నేను నిర్ణయించుకోవచ్చు? అంచేత ...."

"అడగను; క్షమించండి. రేపు ఎక్కడికి రావాలి?" సిన్‌హా నవ్వుతూ అన్నాడు.

శివానంద్ చిన్నగా నవ్వాడు. "మొట్టమొదట మీ ఫోటో ఇవ్వండి. తరవాత 'టీ' అన్నారు; ఇవ్వండి. వెళ్ళేముందు రావాల్సిన ప్రదేశం గురించి చెప్తాను!"

# 4

ఎయిర్ కండిషన్‌డ్ కార్లోంచి అతను కిందికిదిగాడు. డోర్ని మూశాడు. పేవ్‌మెంట్ మీద నిలబడి రిస్టువాచీ చూసుకున్నాడు. తనకి ఇంకా ఒక నిమిషం వ్యవధివుంది.

చేతిలో వున్న బ్రీఫ్‌కేసుని కాళ్ళ దగ్గర వుంచుకుని అతను కళ్ళద్దాల్ని తీశాడు. ఓపిగ్గా పాలిష్ చేసి, ఒకసారి 'శాంపుల్ చూపు' చూసి అద్దాల్ని తగిలించాడు.

రిస్టువాచీ చూసుకుని చకచకా ఎదురుగా వున్న షాపువేపు అడుగులేశాడు. అతనికోసం గ్లాస్ డోర్ తెరవబడింది. అతను లోపల దూరాడు. డోర్ దగ్గరే నిలబడి షాపుని పరకాయించి చూసాడు. షాపులో అట్టే జనంలేరు. నాలుగు జతలకళ్ళు అతనివేపే చూస్తున్నాయి. నాలుగు జతల కాళ్ళు అతనివేపు కదిలాయి. కనిపించీ, కనిపించకుండా అతను చిరునవ్వు నవ్వాడు.

ఆ నలుగుర్నీ నాలుగుచోట్ల, నాలుగు సమయాల్లో కలుసుకున్నాడతను. నలుగుర్నీ నాలుగు సమయాల్లో, నాలుగైదు నిమిషాల తేడాతో ఆ షాపుకి చేరుకో

మన్నాడు. విడివిడిగా కలుసుకుని, విడివిగా సూచనలు ఇవ్వడం మూలంగా, ఈ క్షణందాకా తాము నలుగురూ ఒకేపనిమీద అక్కడికి చేరుకున్నట్టు నలుగురికీ తెలీదు! తన ప్లానుకి సగర్వంగా తనని అభినందించుకుంటూ అతను ఇద్దర్ని ప్రత్యేకంగా చూసి, డోర్ వైపు బ్రీఫ్‌కేస్ చూపించాడు.

ఇద్దరు పొడుగాటి వ్యక్తులు డోర్ దగ్గరగా ఆగారు. అతను తివిగా క్యాష్ కౌంటర్ ముందుకి నడిచాడు. కౌంటర్ వెనక బొజ్జనిండా కుడుములు తిన్న వినాయకుడిలా కూచున్న కుబేర్ దాస్ జుబారి పళ్ళికిలిస్తూ ఆహ్వాన సూచకంగా చూశాడు.

"మిస్టర్ కుబేర్ దాస్ జుబారీ, అయామ్ శివానంద్, అడిషనల్ కమీషనర్; సిబిఐ—సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్," అంటూ అతను కోటుజేబులోంచీ నీలంరంగు ఫోల్డర్‌లో వున్న ఐడెంటిఫికేషన్ కార్డు చూపించాడు.

కుబేర్ దాస్ జుబారి అర్థంకానట్టు చూసాడు. రెండు క్షణాల్లో శివానంద్ పరిచయాన్ని అపార్థం చేసుకుని ముందరి పళ్ళన్నీ చూపించాడు.

"వెల్‌కమ్ టూ జుబారీస్! వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ సర్?" అన్నాడు మర్యాద ఉట్టిపడే కంఠంతో.

శివానంద్ నవ్వలేదు. "యూ కెన్ డూ సర్టెన్ థింగ్స్ ఫర్ మీ: టెలిఫోన్స్ అన్నింటినీ హుక్స్‌మీంచీ తీసి కింద పెట్టించండి. రెండు: క్లోస్డ్ సర్క్యూట్ టీవీ కెమరాల్ని మూసేయండి. మూడు: సేల్స్ స్టాప్ చేయండి. నాలుగు...."

"వాట్???" కుబేర్ దాస్ జుబారి నివ్వెరపోతూ

అరిచాడు.

శివానంద్ చెయ్యి కోటుజేబులోంచీ యివతలికి వచ్చింది. చేతిని విదిల్చి, మడత విడదీసిన కాగితాన్ని జూబారిముందు పట్టుకున్నాడతను. సిబిఐ ఢిల్లీ జారీచేసిన 'సెర్చ్ అండ్ సీజ్' వారెంట్ ని జూబారి నమ్మలేనట్టు చూశాడు. మెల్లిగా తలెత్తి, పాలిపోతున్న మొహాన్ని శివానంద్కి చూపించాడు.

"ఆఫీసర్ .... వాటీస్ దిస్?" అతని కంఠం వణికింది.

"పబ్లిక్ కంప్లెయింట్స్—ప్రజల ఫిర్యాదులు. సిబిఐ ఉత్తర్వు. మీ షాపుని—మొత్తం—వెతకాలి. అనుమానం కలిగించే నగల్ని స్వాధీనంలోకి తీసుకోవాలి. 'సెర్చ్ అండ్ సీజ్' వారెంట్ ఇది!" శివానంద్ గంభీరమైన కంఠంతో వివరించాడు.

"మా షాపుమీద ఇంతవరకూ...." జూబారి ప్రారంభించాడు.

"సిబిఐ దాడి జరగలేదు; మాకు తెలుసు. ఇప్పుడు జరుగుతోంది; మీరు తెలుసుకోండి. అన్నట్టు రక్షణ కోసం వుంచుకున్న ఆయుధాల్ని మొదట—తక్షణం సరండర్ చేయండి. బీ క్విక్ అండ్ లెటస్ డూ అవర్ డ్యూటీ క్విక్!" అంటూ శివానంద్ డోర్ దగ్గరున్న ఇద్దరివేపూ తిరిగాడు.

"కమలాకాంత్, నువ్వు ఇక్కడికిరా. కౌంటర్స్‌లో వున్న నగదుని అంతసీ చకచకా లెక్కపెట్టి, కవర్లో పడేయ్. ఎంతో కవరుమీద రాయి. కమాన్. అకౌంట్సె మొత్తం ఎంతో చూడు! క్విక్!"

కమలాకాంత్ వేగంగా కౌంటర్ వైపు పరుగెత్తాడు. శివానంద్ తన దగ్గరే నుంచున్న ఇద్దర్నీ చూసాడు.

"మీరిద్దరూ షో కేసుల్లోని నగల్ని చెక్ చేసి లిస్టు రాయండి!"

"యస్సర్!"

శివానంద్ జూబారివైపు తిరిగాడు. జూబారి నోరు ఖాళీగా వున్న ముంత మూతిలా తెరుచుకునే వుంది.

"మిస్టర్ జూబారీ, ఆయుధాలు!" శివానంద్ తీక్షణంగా అన్నాడు. కాస్సేపట్లో రెండు రివాల్వర్లు కౌంటర్ మీద ప్రత్యక్షమయ్యాయి. శివానంద్ రివాల్వర్లని పక్కనే వున్న సపన్ సిన్హాకి అందించాడు. అతను వాటిని కోటుజేబుల్లో పడేసుకున్నాడు.

"మిస్టర్ జూబారీ, మీ భూగృహంలోకి వెళ్దాం!" జూబారిని సూటిగా చూస్తూ అన్నాడు.

జూబారి నమ్మలేనట్టు చూశాడు. "అక్కడ.... స్టాకు లేదు...."

"ఫర్వాలేదు. ఇక్కడ మా వాళ్ళకి సహకరించమని మీ వర్కర్స్‌కి చెప్పండి. తిక్కవేషాలువేస్తే రివాల్వర్ ఉపయోగించడానికి మాకు ఆర్డర్సున్నాయి!" శివానంద్ హెచ్చరించాడు.

గుడ్లప్పగించి, బిక్కమొహాలేసుకు చూస్తున్న తన సిబ్బందికి వణికే కంఠంతో, మాతృభాషలో జూబారి సూచనలిచ్చాడు. విసురుగా శివానంద్ వైపు చూసాడు.

"కమీషనర్, కాషూ, కాష్ రిజిష్టర్లూ, షో కేసుల్లో నగలూ—అన్నీ మీరు ధారాళంగా చెక్ చేసుకోవచ్చు. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఒక సంస్థను, గౌరవంగా, న్యాయంగా, చట్టబద్ధంగా వ్యాపారం చేసే ఒక స్వదేశీ సంస్థను దేశానికి గర్వకారణమైన సంస్థను మీరు పెర్చి

చేస్తూ అవమానిస్తున్నారు! అది గుర్తుంచుకోండి!"

శివానంద్ తో గంభీరంగా అతన్ని నవ్వుతూ చూశాడు.

"సెర్చి చేస్తున్నాం; అవమానించడం లేదు! ఆ పని చేస్తోంది నేను కాదు; సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా! మీ స్వదేశం; మిమ్మల్ని పుంచుకుని గర్విస్తున్న దేశం!"

"ఆల్ రైట్! చూసుకోండి! మాకు భయం లేదు! ఇంక మీరన్నట్టు భూములూ—గృహాలూ ఏమీ లేవు!"

"భూములూ, గృహాలూ కాదు; బేస్ మెంట్ అపార్టు మెంట్స్! మీ షాపు లే అవుట్ పూర్తిగా మాకు తెలుసు. బేస్ మెంట్ లో ఎన్ని గదులున్నాయో, ఏయే గదిలో ఎన్నెన్ని బీరువాలున్నాయో—అన్నీ సిబిఐ ఫైల్స్ లో స్పష్టంగా వున్నాయ్! లెట్స్ గో! సిన్హా, కమాన్!" అంటూ శివానందద్దం బిగించిన డోర్ వైపు తీవిగా నిర్లక్ష్యంగా నడిచాడు.

ఏదో గుర్తొచ్చినవాడిలా శివానంద్ వెనక్కి తిరిగాడు. కౌంటర్ల ముందు నిలబడి గుసగుసలాడుకుంటున్న అరడజనుమంది కస్టమర్స్ ని నవ్వుతూ చూశాడు.

"అఫిషియల్ బిజినెస్! మీకు కాసేపు ఇబ్బంది కలుగుతుంది. దయచేసి సహకరించండి. మేం వెళ్ళి పోగానే మీ వ్యాపారం మీరు చూసుకోవచ్చు. సారీ ఫర్ ది ఇన్ కన్వీనియన్స్!" అంటూ వెనక్కి తిరిగాడు.

వెనక్కి తిరిగి తీవిగా నడుస్తున్న శివానంద్ని, నిప్పులు కక్కుతూ జుబారి వెంబడించాడు....

"సిన్హా, ఈ గదిలోని బీరువాల్లో ఏమున్నాయో చెకప్ చేసి చూడు. మిస్టర్ జుబారీ తాళాలిస్తారు.

ఆఫీసర్స్ ఈ బీరువాల్లో అగ్రిమెంట్స్ వుండవు....” అంటూ శివానంద్ జుబారీవైపు తీక్షణంగా చూశాడు. జుబారి ఎర్రబారిన మొహంతో టేబుల్ సొరుగులో వున్న తాళంచెవుల గుత్తిని సిన్హాకి అందించాడు.

“మిస్టర్ జుబారీ గర్భగుడిలోకి వెళ్దాం!” శివానంద్ వెంటనే, తరుముతూన్నట్టు అన్నాడు.

జుబారి గిరుక్కున అతనివైపు తిరిగాడు. “ఇంక గదుల్లేవు; వ్యాపారానికి సంబంధించి. అవన్నీ పర్సనల్ క్వార్టర్స్!”

“అయినా ఫరవాలేదు. లెట్స్ గో!” అతను నవ్వుతూ అన్నాడు.

తిరగబడి యేదో చెప్పబోయిన జుబారి తమాయించుకున్నాడు. తను తటపటాయించేకొద్దీ వాళ్ళకి అనుమానం పెరుగుతుంది. అతను నిట్టూర్చి మరో గుమ్మంవైపు కదిలాడు. అతని వెనకే పెంపుడుకుక్కలా కదులుతున్న అతని మేనేజర్ని శివానంద్ భుజంమీద తట్టాడు.

“మీరు ఇక్కడే వుండండి. అతనిక సహాయపడండి!” అన్నాడు. మేనేజర్ రాతిబొమ్మలా నిలబడిపోయాడు.

శివానంద్ జుబారిని వెంబడించాడు. వాళ్ళ వెనకే తలుపు మూసుకుంది. జుబారి నేరుగా బీరువాలవైపు వెళ్ళాడు. రెండు బీరువాల్ని తెరిచాడు. స్టేషనరీనీ, రసీదు బుక్కుల్నీ చూపిస్తూ ఎగతాళిగా నవ్వాడు.

“ఇక్కడకూడా మీకు ఏమీ దొరకదు, కమీషనర్! మీరు ఊరికే అనుమానిస్తున్నారు. మా స్టాకు పూర్తిగా షో రూమ్లోనే వుంటుంది. దొంగచాటుగా దాచి, దొంగచాటుగా బేరం చేయాల్సిన అవసరం, ఖర్మా జుబారీస్కి పట్టలేదు!” అన్నాడు సగర్వంగా.

శివానంద్ చిరునవ్వుతో తలాడించాడు. అతని చెయ్యి తటాలున కత్తిలా ఎదురుగా సాగింది. గోడలోకి ఇనప్పెట్టె డోర్‌లా డిజైన్ చేయబడిన డోర్ని చూపించింది.

"ఆ సీక్రెట్ కంపార్టుమెంట్‌లోకి వెళ్ళండి. ఏముందో చూద్దాం!" జూబారి ఉలిక్కిపడి తమాయించుకున్నాడు. "వాట్....ఇంక....కంపార్టుమెంట్స్ లేవు.. మీరు....ఊరికే...."

శివానంద్ అతని కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. "మిస్టర్ జూబారీ, మీ అరచేతిలో గీతలు మీకు ఎలా తెలుసో మీ అంతఃపురం గురించి నాకు—అంటే సిబిఐకి అలా తెలుసు! మళ్ళీ చెప్తున్నా! టైమ్ వృథా చేయకండి!"

"ఆల్ రైట్! అది కాష్ కంపార్టుమెంట్. లెక్కల్లోకి ఎక్కిన నగదు మాత్రం అక్కడుంటుంది. దాన్నంతా యెంచడానికి మీకూ మీ అసిస్టెంట్సుకీ రెండు రోజులు పడుతుంది!" జూబారి ఎగతాళిగా అన్నాడు.

శివానంద్ అతన్ని చిరునవ్వుతో చూశాడు. "మీ ఖజానాని లెక్కించడానికి మాకు ఎన్ని రోజులు పడుతుందో నాకు తెలీదుగానీ, ఆ కంపార్టుమెంట్ సోదా చేస్తే మీరు చాలా ఏళ్ళు కటకటాల్ని లెక్కిస్తూ కూచోవాల్సి వస్తుందని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను!"

"వాడ్డూయూ మీన్?" జూబారి హుంకరించాడు.

"లెక్కల్లోకి ఎక్కని లెక్కలేనంత మొత్తానికి ప్రతిరూపం ఆ గదిలో దాక్కుంది, మిస్టర్ జూబారీ!"

జూబారి మొహం కుంకం పూసినట్టు ఎర్రబడింది. "మీరు కమీషనర్‌గా ఏమోగానీ, కథా రచయితగా బాగా

రాణిస్తారు! అన్ అకౌంటెడ్ గా అక్కడేం లేదు! మీ కలలో నేనంటే గిట్టనివాళ్ళు అబద్ధాలు చెప్పారు!"

"అబద్ధం కాదు; వజ్రంలాంటి కఠిన సత్యం ఆ గదిలో వుంది!" శివానంద్ గంభీరంగా అన్నాడు.

"వాడ్డూయూ మీన్?" జూబారి మళ్ళీ అరిచాడు.

"మిస్టర్ జూబారీ, ఆ గదిలోకి వెళ్ళండి. పదమూడు డైమండ్స్‌తో, తయారైన అద్వితీయమైన నెక్లెస్‌ని మీ చేత్తోటే తీసుకురండి!" శివానంద్ గంభీరంగా అన్నాడు.

జూబారి ఉలిక్కిపడి, రెప్పపాటులో సర్దుకున్నాడు. తెల్లబారుతున్న మొహంలోకి ప్రయత్నించి రక్తం ఎక్కించాడు. "మీ మాటలు—మీ ఆరోపణలు నాకు అర్థంకావడంలేదు!"

శివానంద్ మాట్లాడకుండా కోటు జేబులోంచీ ఒక చిన్న కాయితాన్ని తీశాడు. దాన్ని జూబారి మొహం వైపు చాచాడు. "నా ఆరోపణకి వ్యాఖ్యానం ఇందులో వుంది. చదువుకోండి. అర్థమవుతుంది!" అన్నాడు నవ్వుతూ.

జూబారి కళ్ళు ఒక్కసారి చెదిరినట్టయ్యాయి. రెండు రోజులక్రితం అరవింద్ అనే అమెరికా వ్యక్తికి తను ఇచ్చిన రసీదు ఫోటో కాపీని అతను అయోమయంగా చూశాడు. అతని మొహంలోంచీ రక్తం ఎక్కడికో మాయమైపోయింది. శివానంద్ అతని మొహంలోకి చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"మీరిచ్చిన ఒరిజినల్ రిసీట్ మా ఆఫీసులో సేఫ్ కస్టడీలో వుంది. ఎందుకేనా మంచిదని జిరాక్స్ కాపీలు తీశాం!"

"ఇంకా తీసి ఫ్రేములు కట్టించి పెట్టుకోండి! ఐ డోంట్ కేర్! అరవింద్ అనే వ్యక్తి యేవో నగలు ఆర్డరిచ్చాడు. అడ్వాన్సు పే చేశాడు. రసీదిచ్చాం. అది నేరం కాదని సి బి ఐ లో పనిచేయకపోయినా నాకు తెలుసు!" అప్పటికే షాక్ నుండీ కోలుకున్న జౌహారి గర్జించాడు; సమయస్ఫూర్తితో.

"ఏవో నగలు కాదు! రాజవంశానికి చెందిన ఎవరో స్త్రీ ఆ నెక్లెస్‌ని—అమ్మిపెట్టమని మీ దగ్గరుంచింది. దాన్ని ఇరవై లక్షలకి మీరు అతనికి అమ్మేశారు. అతను లక్ష అడ్వాన్స్ యిచ్చాడు. దాన్ని ఎవరో స్త్రీ కోసం, కమీషన్ తీసుకుని అమ్ముతున్నారన్నది మీ బుకాయింపు మాత్రమే! అది దొంగసొత్తు అని మాకు తెలుసు!" శివానంద్ తీక్షణంగా అన్నాడు.

జౌహారి దవడలు అదరడం ప్రారంభించాయి. "నో.. అవన్నీ మీరు అల్లుతున్న కథలు. అలాంటి నెక్లెస్...."

శివానంద్ విసుగ్గా చెయ్యెత్తి అతన్ని వారించాడు. "ఆ నెక్లెస్ పుట్టు పూర్వోత్తరాల గురించి, చూచాయగా మీరు అరవింద్‌కీ, అతని భార్య నోనాకీ వివరించారు. వాళ్ళ పాస్‌పోర్టులు పరిశీలించారు! రెండు లక్షలు కమీషన్ అడిగారు. యిరవైకి లొంగిపోయారు. అతని గోల్డు పెన్సిల్‌ని గిఫ్ట్‌గా కొట్టేశారు. వీటన్నింటినీ మేం నిరూపిస్తాం!"

"నిరూపించలేరు! ఏవో నగల కోసం అడ్వాన్స్ తీసుకున్నాం. అది నేరమని సిబిఐ కాదు, మరేదీ కూడా నిరూపించలేదు!"

శివానంద్ నవ్వుతూ బ్రీఫ్ కేస్ తెరిచాడు. అందులోంచీ ఒక పాకెట్ షేవరికార్డర్ని, క్యాసెట్‌నీ

తీశాడు. ఎగతాళిగా జాబారివైపు చూశాడు.

"మీ సంభాషణ పూర్తిగా వింటారా? మీ అంగరక్షకుడు నానక్ పహిల్వాన్ పలికిన రెండు ముక్కలు కూడా ఇందులో వున్నాయి!"

జాబారి కంగారుగా టేపరికార్డర్ని, శివానంద్ నీ మార్చి చూశాడు. అతని పెదవులు వణికాయి. అరవింద్ నోనా.... సిబిఐ.... శివానంద్ __ అరవింద్ సిబిఐ మనిషా కొంపతీసి? గుడ్ గాడ్!

"మిస్టర్ జుబారీ, ఆ నెక్లెస్ మీద అరవింద్ వేలి ముద్రలు వదిలాడు. అతని వేలిముద్రల్ని మేం తీసుకున్నాం. మీక్కావాలంటే వాటిని పోల్చి చూపుతాం!" శివానంద్ రికార్డలో కేసెట్ ఇరికిస్తూ అన్నాడు. అతని వేలు బటన్ని నొక్కింది.

"మిస్టర్ అరవింద్, అమెరికాలో మీరు ఉంటోంది ఎక్కడ....?"

టేప్ రికార్డర్లోంచీ స్వచ్ఛంగా, స్పష్టంగా వినిపించిన తన కంఠాన్ని విని జాబారి ఉలిక్కిపడ్డాడు. శోషవచ్చి పడిపోయే వాడిలా చూశాడు. అతని దవడలూ రెండుగా అవుపిస్తున్న గడ్డం వణకడం ప్రారంభించాయి. టేప్ రికార్డర్ సంభాషణ సాగుతోంది. అది జాబారి ముఖం మీద చకచకా వేస్తున్న భావాల రంగుల పెయింటింగ్ ని శివానంద్ సగర్వంగా చూస్తూ వుండిపోయాడు.

"స్టాపిట్!" జాబారీ బొంగురుగా అరిచాడు.

నవ్వుతూ శివానంద్ రికార్డర్ నోరు నొక్కాడు.

"ఇప్పుడైనా నెక్లెస్ సరెండర్ చేస్తారా? మమ్మల్నే తీసుకొమ్మంటారా?"

జాబారి ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతని పెద

వులు మెల్లిగా కదిలాయి. "కమీషనర్ .... గారూ .... ఒక విషయం చెప్పండి....అరవిం దెవరు? మీ సిబివి మనిషా?"

శివానంద్ తలమీది హాట్ నితీసి బల్లమీద పెట్టాడు. నవ్వుతూ టేప్ రికార్డర్ని బ్రీఫ్ కేసులో పడేశాడు. రెండు చేతుల్ని కోటుజేబుల్లో వుంచుకున్నాడు. చిరునవ్వుతో సూటిగా జాబారి కళ్ళల్లోకి చూశాడు.

"మిస్టర్ జుబారీ, నా క్రాఫుని చెవుల్ని కప్పేదాకా కిందికి లాగండి, మీ కళ్ళతో. నా పెదాలమీదున్న సన్నటి మీసాల్ని మీ కళ్ళతో తొలగించండి. మీ అరవింద్ కనిపిస్తాడేమో చూడండి!" అతని కంఠం గంభీరంగా అంది.

జాబారి అదిరిపడ్డాడు. అతని కళ్ళు గోలీల్లా అయి పోయాయి. అప్రయత్నంగా రెండు చేతుల్తో కణతల్ని నొక్కుకున్నాడతను. తూలిపడబోతూ బల్లని ఆనుకున్నాడు. మెల్లిగా తేరుకుని, నమ్మలేనట్టు కమీషనర్ శివానంద్ మొహంలోకి, ముఖ్యంగా కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయాడు. అరవింద్ యస్....అరవింద్ కళ్ళే అలాగే గర్వంగా, నిర్లక్ష్యంగా నవ్వాయి....!

"గుడ్ ....గాడ్ ...." అసంకల్పితంగా అతను గొణిగాడు.

"గాడ్ ఈజ్ గుడ్. బీ యువర్ సెల్ఫ్ గుడ్! మీకు మూడునిమిషాలు టైమిస్తున్నా. ఆ గదిలోని సేఫ్ లోని సరుకంతనీ మా చేతుల్తో సరండర్ చేయండి! లేకపోతే మేం లాక్ చేసి సీల్ చేస్తాం. అరగంటలో మొత్తం సేఫ్ కాన్ఫిస్కేట్ ...."

"అవసరంలేదు! ఆ సేఫ్‌లో 'అది' తప్ప మరో సగ

లేదు. మీరు చూసుకోవచ్చు; తీసుకోవచ్చు!" మూసిన గదిలో ఇరుక్కున్న పిల్లిలా తెగించిన జాబారి మొండి ధైర్యంతో నిర్లక్ష్యంగా అన్నాడు.

"కానీ మిస్టర్ కమీషనర్, ఒక సంగతి గుర్తుంచుకోండి! నా పలుకుబడినీ, దేశంలో నా స్థానాన్నీ మీరు ఎరుగరు. తలుచుకుంటే మీ మూడు అక్షరాల సంస్థని గడగడలాడిస్తాను. గ్యారంటీగా తెలుసుకోండి! నిజంగానే తలుచుకుంటాను!"

శివానంద్ భుజాలు ఎగరేశాడు. "భారతదేశానికి చెందిన చారిత్రక విలువవున్న ఒక ప్రాచీన కళాఖండాన్ని మరో నేలమీదికి దొంగచాటుగా సరఫరా చేయడానికి మీరు సిగ్గూ, సంశయం లేకుండా ప్రయత్నించారు! దేశంలో మీ స్థానం ఎలాంటిదో మీ మాటలు మీ కంఠంలో—ఈ క్యాసెట్‌లో ప్రతిధ్వనిస్తున్నాయి. అది మరిచిపోకండి! ఇంక రెండున్నర నిమిషాలే వున్నాయ్!"

జాబారి ఏదో అరవబోయి, మానుకుని తటపటతూ కదిలాడు. డోర్ని తెరిచి, చిన్న గుహలోకి వెళ్ళబోయాడు.

"మిస్టర్ జాబారీ...."

శివానంద్ కంఠం అతన్ని ఆపింది. జాబారి వెనక్కి తిరగలేదు.

"మిస్టర్ జాబారీ, ఇలా తిరిగి చూడండి!"

కోపంగా వెనక్కి తిరిగాడతను. కమీషనర్ చేతిలో రివాల్వర్ మెరుస్తోంది; అతని పెదవుల మీద చిరునవ్వులా.

"గదిలోకి వొంటరిగా వెళుతున్నారు; వొంటరిగానే

రండి! మీ దగ్గరున్న 'అల్లావుద్దీన్ అద్భుత దీపాన్ని రుద్ది నానక్ పహిల్వాన్‌ని తోడుగా రప్పించుకోకండి! షూట్ ఎట్ సైట్‌కి' చాలా దగ్గరైన ఆర్డర్సు ఈ రివాల్వర్ని పట్టుకున్న గురితప్పని చేతికి వున్నాయి!"

పళ్ళు కొరుక్కుంటూ జాబారి లోపల దూరాడు. శివానంద్ మెల్లిగా గుమ్మం దగ్గరికి నడిచాడు. అతనికి జాబారి వీపు అవుపిస్తోంది. రెండు క్షణాల తర్వాత జాబారి పైకి లేచి తిరిగాడు. నిస్సహాయంగా శివానంద్‌ని వైపు అడుగులేశాడు.

కమీషనర్ శివానంద్ వణుకుతున్న అతని చేతిలోంచీ నెక్లెస్ బాక్సుని లాక్కున్నాడు. తెరిచాడు. తళతళ లాడుతున్న పదమూడు వజ్రాల ప్రాచీన ఆభరణాన్ని తృప్తిగా చూశాడు.

"గుడ్. మిస్టర్ జాబారీ, ఉయ్ విల్ గివ్ యూ ప్రాపర్ రిసీట్...." అంటూ నెక్లెస్ బాక్సుని మూసి బ్రీఫ్‌కేస్‌లో పడేశాడు.

జాబారి మొదటిసారిగా రెండో భార్యని పోగొట్టు కున్న వాడిలా ఏడుపు మొహంతో అతన్ని చూశాడు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. చెమట జుబ్బాని అతని పసుపుపచ్చ శరీరానికి అతికించేసింది. అతను ప్రాధేయ పూర్వకంగా శివానంద్‌ని చూశాడు.

"కమీషనర్ గారూ.....నోనా.....నోనా ఎవరు?" అతని కంఠం వణికింది.

శివానంద్ చిరునవ్వు నవ్వాడు. "అవసరాన్నిబట్టి నోనాల్ని, లీనాల్ని మా 'సిబిఐ' ఉపయోగించుకుంటూ వుంటుంది. భారతదేశానికి చెందిన విలువైన నగ మీ అధీనంలో వున్నట్టు మా నోటీసుకి వచ్చింది. సిబిఐ ఎలా

ప్లాన్ చేస్తుందో, చేసిందో మీరు స్వయంగా చూశారు!" అంటూ సన్నగా విజిల్ వేశాడు.

మరుక్షణం తలుపు తెరుచుకుంది. సపన్ సిన్హా లోపలికి ప్రవేశించాడు. కవాతు చేస్తున్న సిపాయిలా నడుస్తూ శివానంద్ ముందు అటెన్షన్లో నిలబడ్డాడు.

"సిన్హా, ఆ గదిలో ఐరన్ సేఫ్ వుంది. జాబారి కాంబినేషన్ చెప్తారు. ఓపన్ అండ్ చెక్. ఇన్వెంటరీ చేయి. క్విక్!" శివానంద్ కంఠంలో అధికారం ధ్వనించింది.

"యస్సర్!" సిన్హా జాబారివైపు తిరిగాడు.

"సేఫ్ తెరిచే వుంది, అందులో ఏమీ లేదు!" జాబారి చిరాకుగా అన్నాడు.

సిన్హా మౌనంగా లోపలికెళ్ళి రెండు నిమిషాల్లో తిరిగొచ్చాడు. "సేఫ్ ఈజ్ ఎంప్టీ సర్!" అన్నాడతను.

"వెరీగుడ్. మిస్టర్ జాబారి ఈజ్ లక్కీ! అక్కడ అంతా పూర్తయిందా?" శివానంద్ ప్రశ్నించాడు.

"అయింది సర్. స్టాకూ, నగదూ—అంతా పర్ఫెక్ట్‌గా వుంది సర్. క్వాలిటీ గురించి అనుమానంలేదని కర్నల్ పిచ్చారావ్ అన్నాడు సర్..." సిన్హా వినయంగా అన్నాడు.

శివానంద్ తలపంకించాడు. మెల్లిగా జాబారివైపు తిరిగాడు. "కొండ చేతిలో వున్నప్పుడు, బండరాళ్ళతో జాబారిన్కి పని వుండదు! ఆల్ రైట్, అలాంటప్పుడు దీన్ని సీజ్ చేయకండి. నగదు ఇక్కడే వదిలేయండి. గో అండ్ డూ ఇట్. అయిదు నిముషాల్లో మనం వెళుతున్నాం...."

సిన్హా బూట్లు ఢీకించి, ఎబౌట్ టర్న్ చేసి వుసా

రగా వెళ్ళిపోయాడు. శివానంద్ జుబారి వైపు చూశాడు.

"మిస్టర్ జుబారీ, మీరు ఇంకా రెండు వస్తువులు మాకు సరండర్ చేయాలి...."

"వాట్!" జుబారి అరిచాడు.

"అమెరికా అరవిందశతారంలో నేను మీకు వందనోట్లకట్టలు పడిచ్చాను. వాటిని స్టేట్ బ్యాంకు నుంచీ డ్రా చేసి 'ఏసిబి' ప్రాసెస్ చేసింది. వాటిమీద మనిద్దరి ఫింగర్ ప్రింట్స్ వుంటాయి. ఆ నోట్ల నంబర్లు మా దగ్గర ఏసీబీ దగ్గరా వున్నాయి...."

"నో!" జుబారీ అరిచాడు; నమ్మలేనట్టు.

"యస్, మిస్టర్ జుబారీ. అవి మీ దగ్గర వుండటం చాలా ప్రమాదం. యాంటీకరప్షన్ బ్యూరో సంగతి...."

జుబారి ఇంక వినలేక వెనక్కి తిరిగాడు. కాన్సేపట్లో అతనిచ్చిన పదినోట్లకట్టలు శివానంద్ బ్రీఫ్ కేసులోకి వెళ్లాయి. గోల్డు పెన్సిల్‌ని కోటుజేబులో పారేసుకున్నాడతను.

"మిస్టర్ కమీషనర్ .... కాంట్ యూ .... హెల్ప్ మీ? ఇది ...ఇదే.... నా మొట్ట మొదటి ... పొరపాటు. ప్లీస్ ...." జుబారి కంఠం బోదురుకప్ప కంఠంలా అస్పష్టంగా ధ్వనించింది.

"మొట్ట మొదటిసారి ముట్టుకున్నా నిప్పు కాలుస్తుంది, మిస్టర్ జుబారీ! పైగా ఇది సిబిఐ నిప్పు!" శివానంద్ నవ్వుతూ అన్నాడు.

"ప్లీ....స్ ...."

"ఒక సాయం చేస్తాను. మీరు డిస్ప్లే చేసిన నగ లన్నీ ఒరిజినల్ వే అనీ, క్వాలిటీలో దోషంలేదనీ మా

ఎక్స్‌పర్టు అన్నాడు. ఉత్తర్వు ప్రకారం శాంపిల్స్ తీసుకుని ప్రభుత్వ సంస్థ 'రిసెర్చి అండ్ అనాలిసిస్ వింగ్'—ఆర్ ఏ డబ్ల్యూ—కి పంపాలి నేను. అయితే ఈ నెక్లెస్ తప్ప మరో 'పొరపాటు' ఐటమ్ మీ దగ్గర లేని కారణంగా అనాలిసిస్ అనవసరంలేదని నేను మా డిపార్టుమెంటుకి రాస్తాను. ఆ మూలంగా మీ గురించి పబ్లిసిటీ వుండదు. కొంతవరకు మీ రెప్యుటేషన్ సేఫ్‌గా వుంటుంది...."

"థాంక్స్...." జాబారీ ఏడుస్తూ అన్నాడు.

"సాయంత్రంలోగా మా అసిస్టెంట్ మిమ్మల్ని కలుసుకుంటాడు. దీనికి రసీట్ పంపిస్తాడు. ముట్టినట్టు మీరు రసీదు ఇచ్చి మా రసీదుని తీసుకోండి. తరవాత ఏం జరిగేదీ మీకు అఫీషియల్‌గా తెలుస్తుంది" శివానంద్ నోప్పిగ్గా వివరించాడు.

జుబారి దిక్కుతోచనివాడిలా చూశాడు.

శివానంద్ బ్రీఫ్‌కేసు అందుకుని, గుమ్మంవైపు నడిచాడు. తలుపు ముందు ఆగి, వెనక్కి తిరిగి రాతివిగ్రహంలా నిలబడి వడగళ్ళ కళ్ళతో చూస్తున్న జుబారిని నవ్వుతూ చూశాడు.

"మిస్టర్ జుబారీ, అయిదు నిమిషాల్లో మేం వెళ్ళిపోతాం. ఏమీ జరగనట్టే మీరు మీ వ్యాపారం సాగించుకోవచ్చు!" అన్నాడు హామీ యిస్తూ.

జుబారి వెర్రివాడిలా చూశాడు.

శివానంద్‌ని మాయం చేస్తూ తలుపు మూసుకుంది.

మూసుకున్న తలుపుని జుబారి వెర్రివాడిలా చూస్తూనే వుండిపోయాడు....

# 5

గదిలో అతను నిర్విరామంగా పచార్లు చేస్తున్నాడు.

అతని తల కొద్దిగా కిందికి వాలి వుంది. పెదాలమధ్య వెలుగుతున్న సిగరెట్ పొగ చిమ్ముతోంది. ఆమె మంచం మీంచీ అతన్ని ఏదో అడిగింది. ఆమె ప్రశ్న అతనున్న లోకంలోకి చొచ్చుకుపోలేదు. అతని చెవులకి వినిపించలేదు.

అతను సాలోచనగా గోడవారగా కదిలాడు. కర్టెన్ని పక్కకి లాగి, కిటికీగుండా చూస్తూ కాసేపు స్తంభంలా నిలబడిపోయాడు. అతని బుర్రలో ఏదో ఆలోచన తెగిన పాములా గిలగిల కొట్టుకుంటోంది. సిగరెట్ పీకని కిటికీగుండా విసుగ్గా అవతలికి రువ్వాడతను.

మెల్లిగా వెనక్కి తిరిగి అలాగే నిలబడ్డాడు. ఆలోచన అతని నుదుర్ని గీతలుగా మార్చేస్తోంది. ఒకసారి రెప్పల్ని కళ్ళమీదికి దించాడతను. నుదుర్ని అరచేత్తో రుద్దుకున్నాడు. ఆమె అతన్ని విడ్డూరంగా చూస్తోంది.

కటాలున అతను కళ్ళు తెరిచాడు. అతని నుదురుమీద గీతల్ని ఏదో అదృశ్యం హస్తం చిటికలో తుడిచేసింది. అతని కళ్ళు మెరవడం ప్రారంభించాయి. మెల్లిగా చిరునవ్వు అతని పెదాలమీద ప్రత్యక్షమై కళ్ళల్లోకి ప్రాకింది. అతని ముఖకవళికల్ని గమనిస్తున్న ఆమె ఉత్సాహంతో లేచి నిలబడింది. కానీ అతని కళ్ళకి ఆమె కనిపించడంలేదు. అరగంటనుంచీ బుర్రని వేడెక్కించిన ఆలోచనల ఫలితం తళతళమంటూ అతని కళ్ళకి కనిపిస్తోంది.

ఉషారుగా అతను సిగరెట్ వెలిగించాడు. ఘాటుగా పొగ పీల్చి వదిలాడు. తృప్తికరంగా నవ్వుకుంటూ

టీపాయ్ మీదున్న టెలిఫోన్ వైపు నడిచాడు. ఆమె మళ్ళీ ఏవో ప్రశ్నించింది. ప్రశ్న అతన్ని తాకి గోడను తాకిన రబ్బరు బంతిలా ఆమె వైపే దూసుకువెళ్ళింది.

సోఫాలో కూచుని రిసీవరెత్తి, ఏదో చెప్పి, రిసీవర్ని పరేసి అతను వెనక్కి వాలి, కాలుమీద కాలు వేసుకున్నాడు. రెండు క్షణాల్లో టెలిఫోన్ మోత గదిలో రాజ్యం చేస్తున్న నిశ్శబ్దాన్ని తరిమేసింది.

"జూబారీస్...." అంటో కంఠం అతని చెవిలో, ఆ కంఠంలో ధ్వనించిన నిరుత్సాహాన్ని అతను చిరునవ్వుతో గుర్తించాడు.

"మిష్టర్ కుబేర్దాస్ జూబారీ?"

"యస్....ఎవరు?" జూబారి విసుగ్గా అడిగాడు.

"శివానంద్" అతను క్లుప్తంగా అన్నాడు. జూబారి ఊపిరి బిగబట్టడం అతనికి స్పష్టంగా వినిపించింది.

"కమీషనర్ సాబ్! నను నే....ఏం చేయమని శలవు? మీరు పంపుతామన్న రిసీటింకా రాలేదు...."

"మిస్టర్ జూబారీ, మొదటిసారిగా మా డిపార్టు మెంటుకి దొరికిపోయిన మీ గురించి ఆలోచిస్తూంటే జాలేస్తోంది..."

"మంచి మాటన్నారు. థాంక్స్లాట్!" ఏదో తెలీని ఆశా, ఉల్లాసం జూబారి కంఠంలో అస్పష్టంగా వున్నాయి.

"చట్టప్రకారంవెళ్తే మీరు చాలా కష్టంలో ఇరుక్కుంటారు. ఇంటర్నేషనల్ లెవల్లో మీ రెప్యుటేషన్ దెబ్బతింటుంది. అంచేత మీకు సహాయం చేయాలనుకుంటున్నాను...."

"ఓహ్! థాంక్యూ థాంక్యూ థాంక్యూ ఊఊఊ!"

జూబారి బొబ్బలెడుతున్నట్టు అరవడం ప్రారంభించాడు.

“పూర్తిగా వినండి!” శివానంద్ చిరాగ్గా అన్నాడు. “ఈ విషయంలో నేను ఏం చేసినా మీకూ, సిబిఐకీ—అంటే ప్రభుత్వానికీ—ఇద్దరికీ నష్టం రాకూడదు. ఇది కేవలం మీమీద సానుభూతితో ఆడుతున్న మాట! మీ గురించి మేం క్షుణ్ణంగా పరిశోధించాం. ఎప్పుడూ మీరు కంచెదాటలేదని మా రిపోర్ట్సు చెపుతున్నాయి....”

“యస్! మీ రిపోర్ట్సు ఇరవైనాలుగు క్యారెట్ల బంగారంలాంటి నిజాన్ని చెప్పాయి! మీ....”

“మిస్టర్ జూబారీ, అడ్డుతగలకుండా వినండి! మీతో సరసాలాడ్డానికి నాకు వ్యవధిలేదు. నేను త్వరగా ఏదో డిసైడ్ చేయాలి!” శివానంద్ కసిరాడు. జూబారీ బరువుగా ఊపిరి పీల్చాడు.

“మీ పరువు పాడుకాకుండా, సిబిఐ గౌరవం, పరపతీ చెడకుండా, మధ్యే మార్గంగా ఒక సెటిల్మెంటు కనిపెట్టాలని చూస్తున్నా. ఆ పరిష్కారం మీకు కొంచెం నష్టం కలిగిస్తుంది; ఆర్థికంగా. ఆ నష్టాన్ని భరించే ఇష్టం లేకపోతే మీరు రెండువిధాలుగా నష్టపోతారు. పరువు పోతుంది. పైసలూ పోతాయి....” శివానందాగి మరో సిగరెట్ వెలిగించాడు. అటువైపున జూబారి బరువుగా, ఇసుకలో బండిని లాగిన ఎద్దులా బుసకొడుతున్నాడు.

“పరిష్కారం చెప్పండి సాబ్....” చివరికి అన్నాడతను.

“ముందట మీరు చెప్పాలి. ఆర్థికంగా నష్టపోతారా? రెండూ పోగొట్టుకుంటారా?”

“నా సమాధానం మీకు తెలుసు: ముందటిదే! చెప్పండి!” జూబారి హుషారుగా అన్నాడు. ఎంత ఆఫీ

సరైనా నోటుముందు ఓటమిని అంగీకరించాల్సిందే! జూబారి విజయగర్వంతో నవ్వుతున్నాడు.

"రైట్. పరిష్కారం వినండి: మేం సోదా చేసి సీజ్ చేసిన డైమండ్ నెక్లెస్‌ని మీరు మరిచిపోవాలి...."

"వాట్?" జూబారి అరిచాడు.

"మరిచిపోయాక, నెక్లెస్ సోర్స్‌ని బైటపెట్టకుండా మేం రిపోర్టు చేస్తాం. ఎవరో అజ్ఞాతవ్యక్తి ఆ పురాతనమైన ఆభరణాన్ని స్వచ్ఛందంగా సిబిఐకి అందజేశాడని రాస్తాం. అదేవిధంగా న్యూస్ పేపర్స్‌లో కూడా వార్త ప్రచురించబడుతుంది. మీరు పొరపాటునకూడా ఎవరితోనూ నెక్లెస్ గురించి అనకూడదు!"

"కమీషనర్ సాబ్....మీ మాటలు అర్థం కావడం లేదు. ఏదో 'కొంచెం' డబ్బు నష్టపోవాలన్నారు. కొంచెంగా నష్టపోడానికి మేం ఎప్పుడూ సిద్ధమే! అయితే నెక్లెస్ "

"మిస్టర్ జూబారీ, ఆ నెక్లెస్ చందనపూర్ రాజవంశానికి చెందిందని మాకు తెలుసు. మీకూ తెలుసు. అది పదేళ్ళక్రితం దొంగిలించబడిందన్న సంగతి నేను మీకు చెప్పక్కర్లేదు! పదేళ్ళ గురించి మీకు తెలీకపోయినా దొంగిలించబడిందని మీకు తెలుసు...." శివానంద్ ఆగాడు.

"మీ మాటలు నాకు అర్థంకావడంలేదు. నాకెలా తెలుస్తుంది?" జుబారీ అర్థంకానట్టు అడిగాడు.

శివానంద్ చిన్నగా నవ్వాడు. "దొంగ సొత్తుని కొన్న వ్యక్తి మీరే!"

"మిస్టర్ కమీషనర్!"

"అమాయకత్వం నటించకండి. మీ 'దాగుడుమూత లాట' అయిపోయింది. ధైర్యంగా యధార్థాన్ని ఎదు ర్కోండి! జూబారీ పరువుని కాపాడుకోండి!" శివా నంద్ గంభీరంగా అన్నాడు. జూబారీ తాత్కాలికంగా మూగవాడై పోయాడని టెలిఫోన్ చెప్తోంది.

"ఇదంతా మీకు తెలీకపోతే, మీకే నష్టం. చందన్ పూర్ రాజవంశానికి చెందిన ప్రాచీనాభరణాన్ని అతి తక్కువ ధరకి మీరు కొనుగోలు చేశారని మేం రిపోర్టు రాస్తాం. ఆ దొంగతనం గురించి ఎన్నిసార్లు వార్తలు వచ్చినా మీరు, మిమ్మల్ని కల్సుకున్న దొంగ గురించి ప్రభుత్వానికి, పోలీసులకి తెలియజేయలేదు. అది క్షమించ రాని నేరంగా పరిగణించబడుతుంది. దొంగని దాచి పెట్టడం, దొంగసొత్తు కొనడం—రెండు నేరాలు మీ మెడకి చుట్టుకుంటాయి. ఇప్పుడు చెప్పండి; చివరిసారిగా అడుగుతున్నా! కోహినూర్ వజ్రంలా విలువలో కాక పోయినా, పురాతనత్వంలో ప్రఖ్యాతిచెందిన ఆ నెక్లెస్ మీకు కావాలా?" శివానంద్ ప్రశ్నించాడు.

జూబారీ గుటకలు మింగాడు. ఆశా, ఆందోళనా అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయని అతని కంఠం చేస్తున్న అర్థంకాని చప్పుళ్ళు శివానంద్‌కి చెప్తున్నాయి.

"ఆల్ రైట్, కమీషనర్ సాబ్....ఆ దరిద్రపు నెక్లెస్ గురించి మాకు తెలీదు!" చివరికి జూబారీలోని ఆందోళనే జయించింది.

"గుడ్! తెలివైన నిర్ణయం!" శివానంద్ నవ్వాడు.

"మీరు కొంచెం నష్టం అన్నారు. దానిమీద ఎంత ఖర్చుచేశానో మీకు తెలీదు...."జూబారీ ఏడుపు కంఠంతో ప్రారంభించాడు.

"మిస్టర్ జుబారీ, యూ ఆర్ మిస్టేకన్! మీరు దాన్ని ఎంతకి కొన్నారో చివరి పైసాతో లెక్క చెప్ప గలను. మా ఫైల్స్‌లో కథంతా వుంది. ఫైల్ని రెండు కాపీలుతీసి మా డిపార్టుమెంటుకి ఒకటీ. మీకొకటీ పంపించమంటారా?" శివానంద్ గంభీరంగా ప్రశ్నించాడు.

జుబారీ మళ్ళీ మూగవాడై పోయాడు.

"నిజం చెప్పాలంటే, అధికంగా మీరు కొంచెంగా నష్టపోతారన్నాను. ఆ విషయం ఇప్పుడు చెప్తాను...."

"క్యా అఆఅ!" జుబారీ నివ్వెరపోతూ టెలిఫోన్‌లో అరిచాడు.

"ఇందాకా వివరించిన విధంగా మీకూ, మా డిపార్టు మెంటుకీ ధోకా లేకుండా అంతా ఏర్పాటు చేయాలంటే మీరు అయిదు లక్షలు చెల్లించాలి; వెంటనే!"

"వాట్? ఎంత?"

"ఫైవ్ లాక్స్. నాట్ మోర్!" శివానంద్ నవ్వుతూ అన్నాడు.

"కమీషనర్, సిబిఐ ఉద్యోగిగా వుండికూడా మీరు" జుబారీ ఆశ్చర్యంతో ఆపేశాడు.

"ఆయామ్ సారీ. అది నాకు కాదు. మీకు తెలుసు! మేం ఈ రెయిడ్‌లో అయిదుగుర్ని ఉపయోగించాం. నోనా ప్లస్ ఇవాళ నాతో వచ్చిన నలుగురూ. వాళ్ళయిదుగురికీ మీ కథా, నెక్లెస్ కథా పూర్తిగా తెలుసు. ఆఫ్ కోర్స్ వాళ్ళు మా సిబ్బందికాదు. కొన్ని బలమైన కారణాల వల్ల డిపార్టుమెంటుతో సంబంధంలేని వాళ్ళని మేం అప్పుడప్పుడూ వాడుకుంటూ వుంటాం. వాళ్ళు నోరు జారితే, మీ పరువు దిగజారిపోతుంది.

"నాకు అర్థంకావటంలేదు!" జుబారీ అడ్డుతగిలాడు.

"అర్థం అవుతుంది. మీ గురించి వాళ్ళద్వారా ఎవరికీ ఏమీ తెలీకూడదు. అంటే వాళ్ళ నోళ్ళు మూసేయాలి; నోట్లని ప్లాస్టరుగా ఉపయోగించి! అలా ఒక లక్ష మీరు యివ్వగలిగితే ఆ పని జరుగుతుంది. లేదంటే చెప్పండి. ఫోన్ పెట్టేసి, రసీదూ, నోటీసూ పంపిస్తాను!"

"ఇది అన్యాయం!" జుబారీ అరిచాడు.

"ఓకే. అయితే న్యాయంగానే వ్యవహరిస్తాం. గుడ్ బై!" శివానంద్ రిసీవర్ని పెట్టేయకుండా ఒకే ఒక క్షణం ఆగాడు.

"ఆగండి! డిస్కనెక్టు చేయకండి! ఇరుక్కుపోయాం. ఎంతో కొంత తగ్గించండి. ప్లీజ్" జుబారీ కంగారుగా అన్నాడు.

"అయామ్ సారీ. అయిదులో అయిదు పైసలుకూడా తగ్గించే శక్తి నాకు లేదు! అయినా మీరు ఇంత కక్కుర్తి పడతారనుకోలేదు. నేను చెప్పిందంతా మరచిపోండి. నాకు వేరే పనుంది...."

"ఆగండి! ఓకే ... చెవులదాకా రొయిలాగా మునిగి పోయే వున్నాను. జుట్టుదాకా మునిగితే పోయేదేంలేదు! ఇచ్చేస్తాను. అంతా మీరు చెప్పినట్టే జరుగుతుందన్న గ్యారంటీ...." జుబారీ ఆదరాబాదరా అన్నాడు.

"మీరిచ్చేది రిసీవ్ చేసుకుంటాం. రసీదు పంపం! అదే మీకు గ్యారంటీ!" శివానంద్ నవ్వుతూ అన్నాడు.

"నమ్మమంటారా?" జుబారి బొంగురుగా అడిగాడు.

"మీ ఇష్టం! మా బలవంతం ఏమీ లేదు!"

"ఆల్ రైట్. ఎవర్నో పంపండి" జుబారి కంఠంలో ఓటమి ధ్వనించింది.

"ఎవ్వరూ రారు. అయిదు లక్షల్ని నీట్ గా ప్యాక్ చేయండి. కుచేలా టెక్స్ టైల్స్ లో రెండుజతల టెర్రికాట్ పంచలు కొనండి. ఆ పంచల మడతలో నోట్ల పాకెట్ ని శుభ్రంగా, భద్రంగా పార్సిల్ చేయండి. కుచేలా టెక్స్ టైల్స్ ఇచ్చే ప్లాస్టిక్ సంచీలో పెట్టండి. సంచీని మూసి, అతికించండి. హోటెల్ రెక్స్ రిసెప్షన్ లో యివ్వండి. మాకు అందుతుంది...."

"హోటల్ రిసెప్షన్....ఫరవాలేదా?" జూబారి సందేహిస్తూ అన్నాడు.

"డోంట్ యూ వర్రీ! సరిగ్గా అరగంటలో పంచల పార్సిల్ అక్కడికి చేరాలి. అరనిమిషం ఆలస్యమైనా మేం అందుకోం!" శివానంద్ నిష్కర్షగా అన్నాడు.

జూబారి నిట్టూర్చాడు. "పంపిస్తాం....పంచలు దేనికి?" అయోమయంగా అడిగాడతను.

"మీరు మాకు శాస్త్రోక్తంగా పంచలచాపు చదివిస్తున్నారు!" శివానంద్ నవ్వుతూ అన్నాడు రిసీవర్ని పడేసి. నవ్వుతూ ఆమెవైపు చూశాడు....

* * *

"డార్లింగ్...." ఆమె మళ్ళీ పిలిచింది.

శివరామ్ లతవైపు నవ్వుతూ చూశాడు.

లత తేలిగ్గా నిట్టూర్చింది. "ఇంతసేపటికి నా పిలుపు చెవిలో దూరింది. థాంక్ గాడ్!"

శివరామ్ ఆమెవైపు నవ్వాడు. "డోంట్ థాంక్ గాడ్; థాంక్ మీ! నీ పిలుపు దూరింది నా చెవిలో; గాడ్ చెవిలో కాదు!"

లత కిలకిల నవ్వింది. మంచం దగ్గరగా రమ్మని అతనికి తలపూపుతో సైగచేసింది. సిగరెట్ వెలిగించి శివరామ్

ఆమె దగ్గరగా ఆగి, తలవాల్చి ఆమె మొహంలోకి చూశాడు. నడినెత్తిమీదికి ఎక్కిన సూర్యుణ్ని చూస్తున్న పొద్దు తిరుగుడు పువ్వులా లత మొహం వికసించింది.

"ఇందాకా ఎవరితోటో, ఏమిటేమిటో ఫోన్‌లో మాట్లాడావు. పంచలచాపూ, అయిదులక్షలూ తప్ప మరో అక్షరం నాకు అర్థం కాలేదు! ఏమిటిదంతా?" లత ఆశగా ప్రశ్నించింది.

"హనీ, యూ ఆర్ బ్లెస్‌డ్! ఎంత అర్థం కావాలో అంతే, ఏది అర్థంకావాలో అదే నీకు అర్థమైంది! అర్థం కానిదాన్ని అడుక్కి తోసెయ్. మరో ఇరవై నిముషాల్లో నేను హోటల్ కైలాస్‌కి వెళ్ళిపోతాను. ఆ తరువాత పదినిముషాల్లో వెళ్ళి లాంజిలో కూచో రిసెప్షనిస్టుని చూస్తూ. కుచేలా టెక్స్‌టైల్స్ పేరున్న పాకెట్ ఒకటి...."

"రిసెప్షనిస్టుకి అందజేయబడుతుంది. ఇచ్చిన వ్యక్తి వెళ్ళిపోయేదాకా కదలకుండా కూచుంటాను. తరవాత ప్యాకెట్‌ని తీసుకుని కైలాస్‌కి వస్తాను!" లత నవ్వుతూ అంది.

"ఎగ్జాక్ట్లీ! యూ ఆర్ స్మార్ట్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"నిన్న మొన్నటిదాకా అదెవతో 'నోనా' నీకు స్మార్టుగా అవుపించిందనుకుంటాను!" లత ఎగతాళిని నటిస్తూ అంది.

శివరామ్ గొల్లున నవ్వాడు. "అఫ్‌కోర్స్, నోనా ఈజ్ స్మార్టు! కుబేర్ దాస్ జాబారి 'అరవింద్'ని నమ్మటానికి ఆమె నటన బ్రహ్మాండంగా తోడ్పడింది!"

"అది ఇప్పుడెక్కడుంది?" లత కంఠంలో ఈర్ష్య

ఖంగుమంది.

శివరామ్ చిరునవ్వు నవ్వాడు. "ఎక్కడుందో ఎవరికి తెలుసు!"

"భర్తగా నటించావుగా? నీకే తెలియాలి!"

"హనీ, యూ ఆర్ రాంగ్! ఆమె నా భార్యగా నటించింది! నాకోసం కాదు; లోకంకోసం. కుబేర్ దాస్ ఖాతాకోసం! డబ్బుకోసం!" శివరామ్ లత కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

లత కళ్ళు తటాలున చిరునవ్వు నవ్వాయి. "డార్లింగ్, సారీ ..."

"డోంట్ బీ సారీ. ఇలాంటి చిన్న చిన్న గిల్లికజ్జాలు లేకపోతే లైఫ్‌లో మజా వుండదు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత ఆవేశంతో లేచి నిలబడి అతని దగ్గరగా జరిగింది. రెండు చేతుల్నీ అతని మెడచుట్టూ దండలా వేసింది. "డార్లింగ్ .... నెక్లెస్ ... ముద్దొస్తోంది. వేసుకోనా?"

ఆశ వెలుగులా ప్రతిఫలిస్తున్న లత విశాల నేత్రాల లోకి శివరామ్ నవ్వుతూ చూశాడు. ఎడంచేతిలోని సిగరెట్టిని గోడవారగా గిరాటేసి రెండు చేతుల్తో ఆమె బాబ్డ్ హెయిర్ని పట్టుకున్నాడు.

"హనీ, ఆ రాళ్ళు బరువెక్కువ. నువ్వు మోయలేవు!"

"వాట్?!" లత ప్రశ్ననీ ఆశ్చర్యాన్నీ కలిపి అరిచింది.

"నీకు జీర్ణంకాని పదార్థాన్ని నువ్వు తినకూడదు!"

"నేనొప్పుకోను. ఆ నెక్లెస్ నాకు కావాలి!" లత బుంగమూతి పెట్టూ మొండిగా అంది.

శివరామ్ కళ్ళు సానపెట్టిన వజ్రాల్లా, తీక్షణంగా లత

కళ్ళల్లోకి చూశాయి. "హనీ, నీలోని 'ఆడదాన్ని' జయించు! ఆ సెక్సెన్ని ధరించి, ధరించగలిగిన మెడ ఈ దేశంలో ఒక్కరికే వుంది...."

"ఎవరామె?" లత కటాలున అడ్డుకగిలింది కోపంగా.

"ఆమె కాదు; అతను!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత కళ్ళు ఆశ్చర్యాన్ని నిండుగా పోసిన గిన్నెల్లా అయ్యాయి.

"డార్లింగ్...."

"హనీ, మనం ఆఘమేఘాలమీద చందనపూర్ వెళ్ళాలి. ఆ వ్యక్తి అక్కడున్నాడు... ..వెళ్తాను. రిసెప్షన్‌లో పని ముగించి కైలాస్‌లో మన గదికి దూసుకురా. పార్సిల్‌ని బ్రీఫ్‌కేస్లో పడేయ్. సీయూ...."

లతకి మాట్లాడే అవకాశం యివ్వకుండా శివరామ్ చకచకా గుమ్మంవైపు నడిచాడు.

## 6

చందన్‌పూర్. హోటల్ చందన్. రూమ్ నంబర్ నలభై రెండు. తలుపు తోసుకుని శివరామ్ గదిలోకి జొరబడ్డాడు. తిరగేస్తున్న సినిమా పత్రికని గిరాటేసి లత అతన్ని నవ్వుతూ చూసింది. అతన్ని చూడగానే ఆమెలోని విసుగు మాయమైపోయింది.

"డార్లింగ్..గదిలో వదిలేస్తావ్. గాలిలో హాయిగా తిరిగొస్తావ్!" ఆమె కంఠంలో ఆక్షేపణ ధ్వనించింది.

జవాబుగా చిన్నగా నవ్వుతూ శివరామ్ ఆమె పక్కనే సోఫామీద కూచున్నాడు. కాళ్ళు పొడుగ్గా చాచి, అలసటగా ఆవులించాడు.

"గాలిలో తిరగడానికాదు; కథలు తెలుసుకో

డానికి!" అన్నాడతను నవ్వుతూ.

"డార్లింగ్, అర్థమయ్యేలా చెప్పకపోతే, ఈ ఊళ్లో వున్నంతకాలం నీతో మాట్లాడను!"

శివరామ్ చిరునవ్వు నవ్వుతూ నిటారుగా కూచుని టీపాయ్‌మీదున్న టెలిఫోన్‌ని ఎత్తి వొళ్లో పెట్టుకున్నాడు. రిసీవరెత్తి తనకి కావాల్సిన నంబరుకి కనెక్ట్ చేయమన్నాడు. రిసీవర్ని పడేసి, సిగరెట్ వెలిగించాడు. అతని తల మెల్లిగా అతవైపు తిరిగింది.

"వేటగాడు తను వేటాడే పులి తిరుగాడే ప్రాంతం గురించి, సమయం గురించీ వోపిగ్గా, జాగ్రత్తగా పరిశీలిస్తాడు. అలాగే నేనూ వేటాడబోయే వ్యక్తికి వెనకా ముందూ, మంచీ చెడ్డా, అతని అలవాట్లూ, పొరపాట్లూ అన్నీ కనిపెడుతూ వుండిపోయాను...."

"ఎవరు? ఎవరతను? ఏం కనిపెట్టావ్?" లత ప్రశ్నల్ని వర్షించింది.

శివరామ్ చిరునవ్వు నవ్వాడు. మాట్లాడకుండా సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ, తలని సోఫా వెనక్కి నొక్కి గింగిరాలు తిరుగుతున్న సీలింగ్ ఫాన్ని తదేకంగా చూశాడు.

"హనీ...." మెల్లిగా పిలిచాడతను. "కాసేపట్లో టెలిఫోన్‌లో మాట్లాడతాను. చెవులప్పగించు విను. కొంతవరకూ నీకూ అర్థమవుతుంది...."

టెలిఫోన్ మోత అతన్ని అటకాయించింది. అతని ఎడమ చెయ్యి రిసీవర్ని చెవికి ఆనించింది.

"యస్....హూ యీజ్ దట్?" బొంగురు కంఠం శివరామ్ చెవిలో గర్జించింది.

"అయామ్ శివరామ్."

"శివరామ్?" అవతలి కంఠంలో అయోమయం. "నెవర్ హార్డ్ ఆఫ్ యూ.... మేబీ రాంగ్ నంబర్."

"రాణా రాజసింహాగారేనా?" శివరామ్ అడ్డుతగిలి, ఆంగ్లంలో ప్రశ్నించాడు.

"అఫ్ కోర్స్.... బట్ ...."

"రాణాసాబ్, నా గురించి మీకు తెలీదు. మీ గురించి నాకు పూర్తిగా — సంపూర్తిగా తెలుసు!" శివరామ్ సగర్వంగా అన్నాడు.

"వాట్ డూ యూ వాంట్?" రాణా రాజసింహ కంఠంలో విసుగు ఖంగుమంది.

"మిమ్మల్ని పర్సనల్ గా కలుసుకున్నప్పుడు చెప్తాను. ఇప్పుడు 10–15 అయింది. సరిగ్గా 10-45కి మీ ముందు పరమశివుడిలా ప్రత్యక్షమవుతాను. నేను ఫోన్ చేసినప్పుడు ఫోన్ దగ్గర మీరు తప్ప మరెవరూ లేకుండా చేయడానికి కొంచెం శ్రమపడ్డాను. పదీనలభైఅయిదికి నన్ను సగౌరవంగా మీ సన్నిధికి తీసుకురమ్మని మీ సిబ్బందికి హుకుమ్ ఇవ్వండి!" శివరామ్ తడుముకోకుండా అన్నాడు.

అటువైపునుంచీ క్షణకాలం నిశ్శబ్దం అతని చెవిలోకి దూసుకుపోయింది.

మరుక్షణం రాణారాజసింహ కంచుకంఠం అతని చెవిలో గింగిర్లు తిరిగింది. "ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?"

రాణా కంఠంలోని ఆగ్రహాన్ని చిన్న నవ్వుతో శివరామ్ నిర్లక్ష్యంగా తుడిచేశాడు. "రాణాసాబ్, ఎంతో తెలుసుకుంటేనేగానీ నేను యెవరితోనూ మాట్లాడను! చందన్ పూర్ రాజవంశానికి చెందిన రాణారాజసింహాతో, రాజకీయాల్లోకి దిగి, వున్న పార్టీలన్నీ మార్చి

ముక్కు మట్టిచేసుకుని రాజకీయాల్లో రాణించలేకపోయిన రాణాతో, నాలుగు బాట్లింగ్ కంపెనీలు పెట్టి నానిరకం సరుకుతో మందు బానిసల్ని ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్న కామందు రాణాతో మాట్లాడుతున్నానని నాకు తెలుసు!"

మళ్ళీ కాసేపు అటు వైపున రాణారాజసింహ మౌనంగా వుండిపోయాడు.

"శివరామ్....నీ పేరు ఎక్కడా వినలేదు. నువ్వు పేపర్లు ఎక్కువగా చదువుతావా?" రాణారాజసింహ క్షణకాలం తర్వాత బుజ్జగిస్తున్నట్టు అడిగాడు.

శివరామ్ నవ్వాడు. "రాణాసాబ్, ఎనిమిదేళ్ళప్పుడు తెగచదివేవాడిని. అప్పట్లో మీ రాజవంశం పేరు చాలా రోజులపాటు పెద్ద పెద్ద పేపర్లలో అచ్చయ్యింది. మీ వంశం పేరుతో బాటు దానికి సంబంధించిన 'మరో పేరూ' అప్పుడు అచ్చయ్యింది...."

"వాట్ యూ మీన్?" రాణా అదిరిపడ్డాడు. అతని కంఠధ్వనిలోని ఆశ్చర్యాన్నీ, కంగారునీ శివరామ్ చిరునవ్వుతో విన్నాడు.

"ఎనిమిదేళ్ళ తరవాత మీ పేరు—మీ వంశం పేరుతో బాటు మళ్ళీ పేపర్లన్నింటినీ అలక్కుండా వుండాలంటే మీరు అర్జెంటుగా నాతో మాట్లాడి తీరాలి!"

"నువ్వు....నువ్వెక్కడున్నావ్?" రాణా సాలోచనగా ప్రశ్నించాడు.

"రాణాసాబ్, మిమ్మల్ని గౌరవంగా పలకరించే వ్యక్తిని అలాగే గౌరవించడం మీరు మొదట నేర్చుకోవాలి!"

"ఓహ్....సారీ....మీరు ఎక్కడున్నారు?" రాణా తటపటాయించి మెల్లిగా అడిగాడు.

"గుడ్! ఎనిమిదేళ్ళూ, పేపర్లూ, పేరూ అనగానే అసలు విషయాన్ని మీరు పట్టేశారని ఇప్పుడు మీరు మాట్లాడే తీరు నాకు చెప్తోంది...."

"వేరార్ యూ నౌ?" రాణా రెట్టించాడు.

"చెప్పను. 10-45కి వస్తున్నా. బ్రౌన్ కలర్ సూటు. బటన్ హోల్‌లో ఎర్రగులాబీ నన్ను నన్నుగా చెప్తుంది. మీ కోట ముఖద్వారం వద్దున్న ద్వారపాలకుడికి చెప్పండి. అర్థమైందా?"

"మిస్టర్, మామూలుగా ప్రయత్నించి మా దర్శనం చేసుకోలేక యిలా బుకాయించి ఎలాగో మమ్మల్ని కలుసుకోడానికి డెస్పరేట్‌గా ప్రయత్నిస్తున్నావని మాకు అర్థమవుతోంది! యూ కాంట్ విన్!" రాణా బహువచనాన్ని మరిచిపోయి గంభీరంగా అన్నాడు.

శివరామ్ నవ్వలేదు. అతని పెదవుల మౌతిపీస్ ముందు వేగంగా కదిలాయి. "మిస్టర్ రాణా, బుకాయింపులు కాదు. మీ జాతకం నా చేతిలో వుంది. అర్థమైందా? మీ జా__త__కం!"

"వాట్?"

"మీరు అపురూపంగా చూసుకున్న మీ జాతకం ప్రస్తుతం నా చేతుల్లో వుంది. 10-45కి మీరు నన్ను చూడకపోతే మీకు మళ్ళా ఫోన్ చేస్తాను. భవిష్యత్తులో నేను దొరికే పది అడ్రసులు చెప్తాను. తరువాత మీరు నాకోసం పరుగులు పెడతారు. ఏ అడ్రసులో వుంటానో కనుక్కోలేక అలా పరుగులు పెడుతూనే వుంటారు!" శివరాం ఆగాడు.

అటువైపున రాణా ఈసారి తటపటాయించలేదు.

"మిస్టర్ శివరాం, 10-45కి మీరు ఇక్కడుంటారు "

పకపక నవ్వుతూ శివరాం రిసీవర్ని పెట్టేశాడు. లేచి, నిటారుగా నిలబడ్డాడు.

తనవేపు అయోమయంగా చూస్తున్న లత వొళ్ళో పడేలా కోటుజేబులోంచీ తీసిన తాళంచెవిని విసిరాడు.

"హనీ, హోటల్ ప్రతాప్ గది తాళంచెవి నీ వొళ్ళో వుంది. ఈ హోటల్ బిల్లు చెల్లించేశాను. నిన్ను టాక్సీ ఎక్కిస్తాను. హోటల్ ప్రతాప్‌లో నాకోసం వెయిట్ చేస్తూ రెస్టుతీసుకో...."

"ఇక్కడ బాగానే వుందిగా? డార్లింగ్...." లత సందేహిస్తూ ఏదో చెప్పబోయింది.

"ఎక్కణ్నుంచీ నేను ఫోన్ చేశానో కనుక్కోడానికి రాణా ప్రయత్నిస్తాడు. నేను చెప్తే తప్ప యెవరూ మనగురించి తెలుసుకోకూడదు! గెటప్. క్విక్!" శివరాం ముందుకి వంగాడు. లత వేళ్ళమధ్య తిరుగుతోన్న ఎర్ర గులాబీని అందుకుని కోటుకి గుచ్చుకున్నాడు.

## 7

తెల్లటి ఇరుకు పైజామా, మోకాళ్ళదాకా సాగిన తెల్లటికోటూ వేసుకుని, తెల్ల తలపాగా చుట్టుకున్న వ్యక్తి గులాబీని క్షణకాలం చూసి అతని మొహంలోకి చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ షివ్‌రాం.... " అంటూ ఆగాడతను. మోకాళ్ళ కిందికి సాగిన కోటుకి వున్న డజనుపైగా గుండీలని పెట్టుకోడానికి అతను యెంత ఇబ్బంది పడి వుంటాడో ఊహించుకుంటూ శివరాం చిరునవ్వు నవ్వాడు.

"రాణాపాల్ మేడమీద తమకోసం ఎదురుచూస్తున్నారు...." ఇంగ్లీషులో అంటూ అతను మెట్లవైపు రెండుచేతులూ చూపించాడు. మెట్లమీద నిజంగానే రెడ్ కార్పెట్ వుంది. తనకోసమా? శివరాం నవ్వుకుంటూ అతన్ని వెంబడించాడు.

ఎన్నో మెట్లు ఎక్కాక, పొడుగాటి వరండాలో యెన్నో స్తంభాలు దాటాక, నగిషీలు చెక్కిన ఎత్తయిన తలుపుముందు అతను ఆగాడు. అక్కడే ఆగమన్నట్టు అరచేత్తో సైగచేసి తలుపు తోసుకుని లోపలికి జొరబడ్డాడు. శివరాం వెనక్కి తిరిగాడు.

తను ప్రవేశించిన ముఖద్వారం పూలమొక్కల్తో, వాటర్ ఫౌంటెన్లతో అందంగా, విశాలంగా వున్న మైదానానికి అవతల, దూరంలో అవుపిస్తోంది. ముఖద్వారం సరిహద్దులో ముష్టియుద్ధం చేస్తున్న రాతి వస్తాదులు అక్కణ్ణుంచీ చిన్నపిల్లల్లా అవుపిస్తున్నారు. దూరంలో అవుపిస్తున్న చందన్‌పూర్ పట్టణంవేపు తన చూపుల్ని తిప్పాడు శివరాం. బిల్డింగులన్నీ కుప్పగా అవుపిస్తున్నాయి. వాటిలో యెక్కడో హోటల్ ప్రతాప్ ఉంది. అందులో లత....

తలుపు చప్పుడు అతని ఆలోచనల్ని తెంచేసింది. శివరాం మెల్లిగా వెనక్కి తిరిగాడు. తలుపు పూర్తిగా తెరిచిన గుమ్మంలో, నగిషీలు చెక్కిన ద్వారబంధం మధ్య రోజ్ వుడ్ ఫ్రేములో బిగించబడిన ఎవరో రాజాగారి బొమ్మలా వున్నాడతను. అతని కళ్ళు రెప్పవేయకుండా చూస్తున్నాయి.

"మిష్టర్ శివరాం...." రాణా రాజసింహ పొట్టిగా లావుగా వున్నాడు. ఖరీదైన చూడీదార్ పైజామా,

గోల్డుకలర్ జుబ్బా. మెడలో పులిగోరు. గిరిజాల జుట్టు బుర్రమీసాలు. వెడల్పాటి మొహం. గుండ్రటి దవడలు. తెల్లబడిపోతున్న జుట్టుని నల్లగా వుంచడానికి అతను నిత్యం ప్రయత్నిస్తున్నట్టు అతని జుట్టూ, మీసాలూ చెప్తున్నాయి. పాన్‌తో ఎర్రబడిన అతని పెదవుల సందులోంచీ పళ్ళు పండిన దానిమ్మగింజల్లా ఎర్రగా అవు పిస్తున్నాయి.

"రాణాసాబ్, గ్లాడ్ టూ సీయూ!" శివరాం ఠీవిగా ముందుకు కదిలాడు.

"కమిన్ అండ్ క్లోస్ ది డోర్," అంటూ రాణా రాజసింహ వెనక్కి తిరిగాడు. లోపలికి జరిగి శివరాం తలుపు మూశాడు.

విశాలమైన హాలు. ఎత్తయిన గోడలు పింక్ కలర్‌తో మెరుస్తున్నాయి. మూడువైపులా రెడ్ వెల్వెట్ కర్టెన్లు బరువుగా కిందికి వేళ్ళాడుతున్నాయి. వాటి వెనక గుమ్మాలున్నాయని స్పష్టంగా తెలుస్తోంది. మూడు కర్టెన్లపైనా పెద్దపులుల తలలు గాండ్రిస్తున్నాయి. ఇరువైపులా వున్న పులుల తలలమీద పొడుగాటి అయిల్ పెయింటింగ్స్ వేళ్లాడుతున్నాయి.

పట్టాకత్తులు పట్టుకున్న ఇద్దరు రాణాలు గంభీరంగా చూస్తున్నారు. ఎదురుగా వున్న పులి తలమీద రాణా బొమ్మలేదు; రాణీ బొమ్మ వుంది. బొమ్మలో ఆమె చాలా అందంగా వుంది. ఆమె కళ్ళు చూసేవాడి కళ్ళని లాగు తున్నాయి. అయితే, శివరాం కళ్ళు ఆమె కళ్ళమీదా, అందంమీదా లేదు.

ఆమె మెడలోంచీ వేళ్ళాడుతున్న వజ్రాల నెక్లెసు అతని దృష్టిని లాగిపట్టింది. శివరాం పెదవులు నవ్వుతో

విచ్చుకున్నాయి. హాలుని పూర్తిగా కప్పిన ఎర్రటి, మెత్తటి తివాచీమీద అతను అడుగులు వేయసాగాడు. గుమ్మానికి కొంచెం ముందున్న వెడల్పాటి టేబుల్ వెనక, సింహాసనంలాంటి కుర్చీలో కూచున్న రాణా రాజసింహ ఇంకా రెప్పలు వేయకుండా చూస్తున్నాడు. పెదవుల్లాగే అతని కళ్ళు ఎర్రగా వున్నాయి.

శివరాం బల్లముందు ఆగాడు. సింహం కాళ్ళ ఆకారంతో నగిషీలు చెక్కిన కాళ్ళతో వున్న బల్లకి రెడ్ వెల్వెట్ తాపడం చేయబడింది.

"ఏమిటి సంగతి?" రాణా గంభీరంగా, క్లుప్తంగా అన్నాడు.

తనని కూచోమని చెప్పని రాణాని శివరాం చిరునవ్వుతో చూశాడు. టేబుల్ కిందికి తోయబడిన కుషన్డ్ కుర్చీని కాలితో ఇవతలికి లాగి, కూచుని, కాలుమీద కాలువేసుకున్నాడు. రాణా అతన్ని కళ్ళు చిట్లించి చూశాడు.

టేబుల్ మీద, అతని కుడిచేతివైపున వినయంగా వొంగిన సిపాయి బొమ్మ వుంది. సిపాయి రెండుచేతులూ ముందుకి చాచి ఉన్నాయి. దోసిట్లో చక్కగా ఇరుక్కున్న బ్రయర్ పైపుని రాణా అందుకుని పళ్ళమధ్య ఇరికించాడు. పొగ ఊదుతూ చూశాడు.

"కమాన్, స్పీక్!" అతని కంఠంలో అధికారం ఉట్టిపడుతోంది.

"రాణాసాబ్, కొన్ని తరాల క్రితం మీ వంశంలో రాణీగారికి ఒక నెక్లెసు చేయించబడింది. అందులో పదమూడు వజ్రాలున్నాయి. ఆ నెక్లెస్‌లో, వజ్రాల్లో రాణీగారి జాతకం వుంది. మధ్యలో ఉన్న వజ్రంలో

ఆమె జన్మ నక్షత్రం డిజైన్ చేయబడింది. టింట్‌లాగా అపుపించే నక్షత్రం బొమ్మ ఆ వస్త్రంలో డిజైన్ చేయ బడింది. దాన్నిబట్టీ ఆమె పేరు 'తార' అని నేను ఊహిస్తున్నా...." శివరాం ఆగాడు.

రాణా మొహంలో ఆశ్చర్యం నాట్యంచేస్తోంది. వేళ్ళమధ్య ఉన్న సైప్‌ని అతను పూర్తిగా మరిచి పోయాడు. శివరాం ప్రారంభించాడు.

"రెండువైపులా ఉన్న పన్నెండు వస్త్రాల్లో ఆమె జాతకానికి చెందిన విధంగా, ఆ క్రమంలో పన్నెండు రాసులున్నాయి. రాణి తారాదేవి—జాతకం ఆ నెక్లె సులో అతి చాకచక్యంగా మలచబడింది. దాన్ని ఎవరు చేయించారో మీకు తెలుసు. మీ వెనక, నా ఎదురుగా ఉన్న వర్ణచిత్రంలో వున్న నెక్లెసు అదే అని నాకు తెలుసు...."

"ఇంతకీ ఇదంతా యెందుకు చెప్తున్నావ్?" రాణా విసుగ్గా అడిగాడు. అతను విసుగుని నటిస్తున్నాడనీ, తనకి ఆ విషయం ఎంత తెలుసో, ఎలా తెలుసో తెలుసు కోడానికి లోపల్లోపలే తన్నుకుంటున్నాడనీ శివరాంకి తెలుసు....

"ఆ నెక్లెసు ఎనిమిదేళ్ళ క్రితం దొంగిలించబడింది ..." శివరాం ఆగాడు.

"నీకెలా తెలుసు?"

"ఎనిమిదేళ్ళ క్రితం పేపర్లు తెగచదివేవాడినని మీకు ఇందాకే ఫోన్‌లో చెప్పాను!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఆల్‌రైట్....నీకు తెలుసు. ఇప్పుడు నువ్వేసే

దేమిటి?"

"మీ వెనక వర్ణచిత్రంలో వున్న ఆ అద్భుతమైన నెక్లెసు ప్రస్తుతం నా దగ్గరుంది, మిస్టర్ రాణా!" శివరాం సగర్వంగా అన్నాడు.

"వాట్?" రాణా అరిచాడు. అతని వేళ్ళ మధ్యనుంచీ సైపులారి టేబుల్ మీద పడింది.

శివరాం నవ్వుతూ చూశాడు. "పదమూడు వర్షాల కాలకం నెక్లెసు ఈ హస్తాల్లో వుంది, రాణాసాబ్!"

శివరాం పైకెత్తి చూపుతున్న అతని ఖాళీ చేతుల్ని రాణారాజసింహ అయోమయంగా చూశాడు. లేచ పోయి మళ్ళీ కూలబడ్డాడు.

"సో, దాన్ని దొంగిలించింది నువ్వే అన్నమాట!" ఆరోపిస్తున్న రాణా కంఠం వణికింది.

శివరాం మళ్ళీ నవ్వాడు. "వెనకాముందూ ఆలోచించకుండా నోటికి వచ్చింది అనేయడంవల్లే మీరు రాజకీయాల్లో రాణించక పోవడానికి కారణం అని మీకు యెప్పుడేనా తట్టిందా?"

"వాట్ ....డూ యూ మీన్?"

"ఎప్పుడో దొంగిలించిన నెక్లెస్‌ని ఇంతకాలం అట్టిపెట్టుకుని, అమ్మి తినడానికి చేతకాక, మళ్ళీ ఇన్నాళ్ళకి మీ దగ్గరకే వచ్చాననుకుంటున్నారా?" శివరాం అతన్ని తీక్షణంగా చూస్తూ ప్రశ్నించాడు.

"నీ చేతికి అది ఎలా వచ్చింది? ఎవరు దొంగిలించారు?" తన పొరపాటుని గ్రహించిన రాణా ప్రశ్నించాడు.

"మీ రెండు ప్రశ్నలకీ ఒకటే సమాధానం: నేను చెప్పను! మీ వంశానికి గర్వకారణమైన ఆ వండర్

అర్నమెంటు మీద కావాలేమో కనుక్కుందామని పనిగట్టుకుని వచ్చాను, మిస్టర్ రాణా!" శివరాం నవ్వాడు.

"ఎందుకు అక్కర్లేదు? కావాలి. దానికోసం నిద్రలో, కలల్లోకూడా వెతుకుతున్నాం! దాన్ని ఇచ్చెయ్. తగిన బహుమతి ఇస్తాం...." ఆశ్చర్యంనుండి కోలుకున్న రాణా హుందాగా అన్నాడు.

శివరాం చిరునవ్వుతో జేబులోకి చేతిని పోనిచ్చాడు. సిగిరెట్ పాకెట్నీ అగ్గిపెట్టెనీ ఇవతలికి తీశాడు. రాణా వైపు చూశాడు.

"విథౌట్ యువర్ పర్మిషన్...." అంటూ సిగిరెట్ వెలిగించాడు.

తటాలున గుర్తుకు తెచ్చుకుని రాణా రాజసింహ పైప్ని అందుకుని, గోల్డు లైటర్తో వెలిగించాడు.

"బహుమతుల స్టేజి దాటి ఎనిమిదేళ్ళయింది, రాణా సాబ్!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"వాట్.....డూ యూ మీన్?" రాణా పాట పాడాడు విసుగ్గా.

"ఐ మీన్ వాట్ ఐ సెడ్!" శివరాం గంభీరంగా అన్నాడు. "కావాలంటే దాన్ని మీరు తగిన మొత్తం చెల్లించి కొనుక్కోవాలి!"

"వాట్! మా సెక్లెసుని మేం కనుక్కోడమా?" రాణారాజసింహ బెదిరింపుగా చూస్తూ తివిగా పైకి లేచాడు. ఎర్రటి కళ్ళతో తీక్షణంగా చూశాడు. "ఎవరితో మాట్లాడుతున్నావో నీకు తెలిసినట్టు లేదు! నేను విజిల్ వేస్తే మినిస్టర్లంతా పందాలేసుకుని పరుగెట్టుకొస్తారు!"

శివరాం కనుబొమలు పైకి లేచాయి. ఆ క్షణంలో రాణా రాజసింహ చేతిలో పట్టాకత్తి లేనందుకు విచారిస్తూ అతను చిరునవ్వు నవ్వాడు.

"బుసకొడుతూ పాము, గాండ్రిస్తూ పులీ, మనుషుల్ని దూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తాయి. మీరు అలాగే విజిలూ—మినిస్టర్లూ అంటూ బుసా గాండ్రింపూ రెండూ కలిపి నన్ను బెదిరించడానికి ప్రయత్నిస్తున్నారు! మిష్టర్ రాణా...."

రాణా రాజసింహ బిగించిన పిడికిలితో బల్లమీద కొట్టిన దెబ్బ శివరాంకి అడ్డుతగిలింది. రాణా మాట్లాడకుండా ఉరిమిచూశాడు. శివరాం చిన్నగా నవ్వాడు. క్షణంలో నవ్వు ఆపేసి తదేకంగా అతని మొహంలోకి చూశాడు.

"మిస్టర్ రాణా, ఎనిమిదేళ్ళ క్రితమే అది 'మీ నెక్లెసు'గా ఉండటం మానేసింది!"

"నాన్‌సెన్స్! దొంగిలించబడిన వస్తువు యెన్నేళ్ళ తరవాత దొరికినా అది సొంతదారుదే!" రాణా హుంకరించాడు.

శివరాం ఎగతాళిగా నవ్వాడు. "అఫ్‌కోర్స్! నైతికంగా ఇప్పుడా వస్తువు మీదికాదు; ఇన్సూరెన్స్ కంపెనీది!"

"వాట్? వాట్....ది....హెల్ డజ్....ఇట్....మీన్?"

"దొంగిలించబడిన ఆ నెక్లెస్‌కి, ఇన్సూరెన్స్ కంపెనీ పరిహారం చెల్లించింది! అంటే మీ నెక్లెసు పోయినా దాని విలువ మీకు శుభ్రంగా అందింది మిస్టర్ రాణా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

రాణా రాజసింహ తటాలున కుర్చీలో కూలబడ్డాడు. ఆశ్చర్యంతో అతని నోరు తెరుచుకుంది. పాన్‌తో ఎర్రగా తయారైన నాలుక కొద్దిగా ఇవతలికి సాగింది. ఇందాకా దర్పంగా చూసిన కళ్ళలో ఇప్పుడు ఏదో నక్క తెలివి అవుపిస్తోంది. అతని నాలుక లోపలికి వెళ్ళింది. అతని పెదవులు కదిలాయి.

"నీకు చాలా తెలుసు" అన్నాడతను క్లుప్తంగా.

శివరాం నవ్వుతూ మరో సిగిరెట్ వెలిగించాడు.

"చాలా తెలుసుకోడం మనిషికి మంచిది కాదు, శివరాం!" రాణా తగ్గుస్వరంలో స్పష్టంగా అన్నాడు.

శివరాం తటాలున కుర్చీలోంచీ లేచాడు. రెప్పలు వేయని కళ్ళతో తదేకంగా రాణా కళ్ళల్లోకి చూశాడు.

"రాణాసాబ్.... మీకు తెలీదు. ఎక్కువ తెలుసుకోడం మనిషికి యెప్పుడూ లాభిస్తుంది! ఓకే. గుడ్ బై..."

నిర్లక్ష్యంగా వెనక్కి తిరిగిన శివరాంని రాణా నిర్లక్ష్యంగా చూశాడు. శివరాం ఠీవిగా నడుస్తూ గుమ్మం దాకా వెళ్ళాడు. తలుపు లాగాడు. అది, కదల్లేదు.

రాణా శిష్యుడు తన పొడుగు కోటుకి జాగర్తగా గుండీలు పెట్టినట్టు బైట తలుపుకి గొళ్ళెం జాగర్తగా బిగించినట్టున్నాడు! నవ్వుకుంటూ శివరాం వెనక్కి తిరిగాడు. దూరందూరంగా అంగలేసుకుంటూ టేబుల్ని సమీపించాడు. సింహాసనంమీద, కిరీటంలేని రాజులా దర్పంగా కూచున్న రాణా రాజసింహని తీక్షణంగా చూశాడు.

"రాణాసాబ్, మీ తలుపులూ ద్వారబంధాలూ నన్ను బంధించి వుంచలేవు!" అన్నాడు సగర్వంగా.

"చూద్దాం!" రాణా క్లుప్తంగా అన్నాడు. మెల్లిగా పైకిలేచాడు. అతని కుడిచెయ్యి పైకి లేచింది, అతని

చేతిలో ప్రత్యక్షమైన రివాల్వర్ చిల్లు ఒంటి కంటితో శివరాం ఛాతీని చూస్తోంది.

రివాల్వర్ మీంచి తన చూపుల్ని రాణా మొహం మీదికి తిప్పాడు శివరాం. రాణా మొహంలో గర్వం దివిటీలా వెలుగుతోంది. శివరాం నిర్లక్ష్యంగా టేబుల్ చుట్టూ తిరిగి అతని దగ్గరగా ఆగాడు. రివాల్వర్ గురి చేసిన రాణా కళ్ళల్లోకి శూలంతో పొడుస్తున్నట్టు చూశాడు.

"బెదిరించే పులి కోరలు చూపించినట్టు రివాల్వర్ చూపిస్తున్నారు! ఆయుధాలు ఉపయోగించడం మాని బుర్రను ఉపయోగించండి. మనుషుల తత్వం నేను బాగా, చాలా బాగా అధ్యయనం చేశాను. ఆ అధ్యయనం నాకెప్పుడూ ఆర్జించి పెడుతోంది. మీ స్థానంలో ఉండే నన్ను, నా స్థానంలో వుండే మీరు కలుసుకుంటే, ఆ స్థానంలో నేను ఏం చేస్తానో, ఎలా ప్రవర్తిస్తానో నేను రంగంలోకి దిగేముందే ఆలోచిస్తాను. అంటే ఒక పర్టిక్యులర్ సమయంలో, స్థలంలో, పరిస్థితిలో — నేను ఇరికించే పరిస్థితిలో — మనిషి ఎలా రియాక్ట్ అవుతాడో నా మూడో కంటితో ముందే నేను చూస్తాను!" శివరాం సగర్వంగా అన్నాడు.

రాణా ఏదో హుంకరించబోయాడు. అతనికి అవకాశం ఇవ్వకుండా శివరాం ప్రారంభించాడు. "నేను ఇలా రాగానే మీరు 'శివరాం' అనే వ్యక్తికోసం హోటల్ చందన్‌కి మీ గుండాల్ని పంపుతారని ఊహించాను. ఏ నంబరునుంచీ నేను మిమ్మల్ని కాంటాక్ట్ చేశానో కనుక్కోడం కష్టమేంకాదు! కానీ మీ ప్రయత్నం ఫలించదు! మనిషి ఒకచోట వుంటాడు, మరో

చోట్నుంచీ ఫోన్ చేస్తాడు!"

"నాన్సెన్స్...."

"యస్. మీరు సెన్స్‌లెస్‌గా వ్యవహరిస్తారని నాకు తెలుసు! మీ అమూల్యమైన వస్తువుని కోటుజేబుల్లో దాచుకుని ఇక్కడికి పరుగెట్టుకొస్తాననీ మీరు అపోహ పడ్డారు. అదీకాకపోతే, ఇక్కడ బంధించి, రివాల్వర్‌తో బెదిరిస్తే, వొళ్ళు పచ్చడిచేస్తే సెక్రెట్ ఎక్కడ దాచానో చెప్పేసి, శాంతిమయంగా కళ్ళు మూస్తాననీ మీరు అనుకున్నారు! మిస్టర్ రాణా, వానపాములా మట్టిలో కూరుకుపోయి మొద్దులా ఆలోచించడం మానేయండి. పౌరుషం, హుందా వున్న త్రాచుపాములా, నాగసర్పంలా ఎత్తుగా తలఎత్తి, ఎదిగిన మనిషిలా ఆలోచించండి!" శివరాం ఆగాడు. సగర్వంగా రాణా మొహంలోకి చూశాడు.

"మా 'ఆస్తి' ఎక్కడుందో నీచేత చెప్పిస్తాం!" రాణా దర్పంగా. రాజసం ఉట్టిపడేలా అన్నాడు.

శివరాం ఎగతాళిగా నవ్వాడు. ఒకసారి రిస్టువాచీ చూసుకున్నాడు. "మరో ఇరవైతొమ్మిది నిమిషాల్లో నేను యెక్కడుండాలో అక్కడ ఉండాలి. లేకపోతే నేను యెక్కడికి, ఎందుకు వెళ్ళానో, మీ వంశం 'ఆస్తి'-ఇన్సూరెన్స్ కంపెనీ డబ్బు చెల్లించినాకూడా మీదిగానే దురాశతో మీరు అనుకుంటున్న మీ 'ఆస్తి' ఎక్కడుందో పోలీసులకీ, సి.బి.ఐ.కీ, ఇన్సూరెన్స్ కంపెనీకి క్షణాల మీద తెలిసిపోతుంది! అతిత్వరలో అది ప్రభుత్వం ఆస్తిగా, కోహినూర్‌లా యేదో మ్యూజియంలో భద్రపరచబడుతుంది!"

"నో! యూ ఆర్ బ్లఫింగ్!" రాణా దూషిస్తున్నట్టు

అన్నాడు.

"అలాగే అనుకోండి. ఐ డోంట్ కేర్! మీ తండ్రికి చెందినదాన్ని తిరిగి సంపాయించి, కాపాడుకోవాలన్న తపన మీలో ఉంటుందని ఇంతదూరం వచ్చాను. కోహినూర్‌ని దాచుకున్న బ్రిటిష్ మ్యూజియం దాన్ని కానలేదని నేను అనుకోలేదు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

రాణా రాజసింహ చేతిలోని రివాల్వర్ని మరిచిపోయి, కింది పెదవిని సాలోచనగా కొరుక్కుంటూ ఉండిపోయాడు. మెల్లిగా కుర్చీలో కూలబడ్డాడు. రివాల్వర్ని టేబుల్ సొరుగులో పడేశాడు. శివరాం వైపు తదేకంగా చూశాడు.

"సిడౌన్, మిస్టర్ శివరాం!" అన్నాడు నవ్వుతూ. శివరాం నవ్వుతూ అతని యెదురుగా కుర్చీలో కూచున్నాడు. టేబుల్ మీద చెలికత్తె బొమ్మ చేతుల్లో ఉన్న బంగారు పళ్ళెంలోని పాన్ బీడాల్లో ఒకదాన్ని తీసి నోట్లో దోపుకుని రాణా నమలడం ప్రారంభించాడు. లవంగాలూ, ఏలకులూ. జాపత్రీ కలిసిన గుమాయింపు వైటికి వ్యాపించింది.

"మిస్టర్ శివరాం, వాటీజ్ యువర్ గుడ్ నేమ్?" రాణా బీడాని కుల్లుతూ ముద్దగా అడిగాడు.

"శివరాం."

"అదికాదు. మీ అసలు పేరు?" రాణా నవ్వుతూ అడిగాడు.

"అసలు పేరూ, కొడ్డీ పేరూ—అంతా అదే మిస్టర్ రాణా!" శివరాం నవ్వుతూ అన్నాడు. రాణా మొహంలో అపనమ్మకం, అసంతృప్తి పెనవేసుకుని అవు

పిస్తున్నాయి.

శివరాం చిన్నగా నవ్వుకున్నాడు. తను నిజం చెప్పినా లోకం నమ్మదు! అయినా మరేం ఫరవాలేదు. నమ్మక పోవడంవల్ల నష్టం తనకికాదు, లోకానికే!

“ఆల్ రైట్ శివ—రాం.... నెక్లెస్ ఎక్కడుంది? లెట్స్ స్టార్ట్ బిజినెస్!” రాణా హుషారుగా అన్నాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. “చెప్పను మిస్టర్ రాణా. పనయ్యాక చేతికి అందిస్తాను!”

రాణా నిట్టూర్చాడు. “ఆల్ రైట్, వాట్ డూ వాంట్?”

ఇంతసేపటికి అడగాల్సిన ప్రశ్న అడిగిన రాణాని శివరాం చిరునవ్వుతో చూశాడు. “డబ్బు!”

“అదే ఎంత?” రాణా విసుగ్గా అడిగాడు.

“పదిహేను లక్షలు చాలు.”

“వాట్!” రాణా నమ్మలేనట్టు అరిచాడు. “శివరాం, ఈ క్షణందాకా నేను మామూలు మనిషితో మాట్లాడుతున్నాననే అనుకున్నాను. నీకు పిచ్చిపట్టిందని ఇప్పుడు అర్థమౌతోంది!”

శివరాం అతన్ని తీక్షణంగా చూశాడు. “మిస్టర్ రాణా నటించకండి. నేను తిరిగీ అక్కడికి చేరుకోడానికి అట్టే వ్యవధిలేదు. ఇన్సూరెన్స్ క్లెయిమ్ పదిహేను లక్షలు మీరు జేబులో వేసుకున్నారు. అప్పట్లో మీ అంచనా ప్రకారం నెక్లెస్ విలువ అంతేవుందేమో! ఇవాళ బంగారం రేటూ, వజ్రాల రేటూ పార్టీ టిక్కెట్టు రేటూ భయంకరంగా పెరిగాయి. ఇవాళ ఆ నెక్లెస్ ధర పదిహేను కాదని మీకు తెలుసు! మార్కెట్ రేటు కాకుండా ఆ నెక్లెస్ విలువను పెంచేది వేరే

ఉంది!"

"ఏమిటది?" రాణా తపీమని ప్రశ్నించాడు.

"హిస్టారికల్ ఇంపార్టెన్స్ ప్లస్ మీ వంశం!" శివరాం నవ్వుతూ అన్నాడు.

రాణా వేళ్ళు టేబిల్ అంచుమీద కాస్సేపు తబలా వాయించాయి.

"మిస్టర్ రాణా...."

శివరాం పిలుపు రాణా తబలాసోలోకి అంతరాయం కలిగించింది. అతను ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీ పూర్వీకులు పోగేసిందిగానీ, మీరు సంపాయించుకుందిగానీ నేను అడగడంలేదు. మీ వంశ ప్రతిష్ఠని హెచ్చవేతవేసే ఆ నెక్లెస్‌ని యాభైలక్షలకి కొనడానికొక్కడా మీరు వెనకాడరు. మీ కళ్ళూ మీ మౌనం నాకు ఆ సంగతి చెప్తున్నాయి! ఇన్స్యూరెన్స్ కంపెనీ ఇచ్చిన పైకం మాత్రం నేను అడుగుతున్నా. యెందుకంటే, నెక్లెస్ మీ చేతుల్లోకి వచ్చిన మరుక్షణం ఆ పైకం అలాగే వుంచుకునే అర్హత మీకు ఉండదు!" శివరాం నవ్వాడు.

రాణా నవ్వలేదు. అతని తల రోలులా ముందుకీ వెనక్కీ ఆడింది.

"ఓకే శివరాం, టేక్ ఇట్ లాక్స్."

"సారీ, రాణాసాబ్. ఇలాంటి బేరంలోకూడా నేను నిజాయితీగా వ్యవహరిస్తాను. పదిహేనుకి మీరు పైసా తగ్గితే, నెక్లెస్ మీకు అక్కర్లేదని నేను అర్థం చేసుకుంటాను!"

రాణా మౌనంగా శివరాంవైపు క్షణకాలం చూశాడు. చిరునవ్వు అతని పెదాల్ని విడదీసింది. అంతలోనే

నవ్వు మాయమైంది.

"శివరాం, ఆ నెక్లెస్‌ని నేను కానుకగా ఇవ్వకపోతే ఏం చేస్తావ్?" రాణా హఠాత్తుగా ప్రశ్నించాడు. ఆశ్చర్యంతో సహా శివరాం మొహంలోకి వెతుకుతూ చూశాడు.

శివరాం చిన్నగా నవ్వాడు.

"ఏ సేఠ్‌కో, ఏ ఫారినర్‌కో అమ్మేయాలని ఇందాకా ఆలోచించాను. ఆ మాటే మీతో అన్నాను. ఇప్పుడు ఆ అభిప్రాయం మార్చుకుంటున్నా. మీ వంశానికి చెందిన నెక్లెసుని వారం రోజుల్లోగా, నాకు వీలైనప్పుడు మీ రాజప్రాసాదంలో ఎక్కడో దాచేస్తాను. వెంటనే సిబిఐకీ, ఇన్సూరెన్స్ కంపెనీకి ఇన్‌ఫాం చేస్తాను. దొంగి లించబడని నెక్లెసు దొంగిలించబడినట్టుగా నాటకం ఆడి, లంచాలిచ్చి రాణా రాజసింహ ఇన్సూరెన్స్ కంపెనీకి టోపీ వేశాడని వాళ్ళకి చెప్తాను. అలా ఇన్‌ఫామ్ చేసినందుకు భారత ప్రభుత్వం నాకు పారితోషికం యిచ్చి సన్మానిస్తుంది! అది చాలు నాకు. కావాలంటే వాళ్ళతో బేరం చేస్తాను. ఇంక మీకు లభించే పారితోషికం యేమిటో మీరే ఆలోచించుకోవచ్చు!"

రాణా కళ్ళు గిన్నెల్లా అయ్యాయి. నమ్మలేనట్టు చూశాడతను.

"యూ కాంట్ డూ ఇట్!"

"అయితే ఇంకోటి చేస్తాను. ఏ పదిలక్షలో పారితోషికం తీసుకుని, భారతదేశానికి చెందిన అమూల్యమైన ఆభరణాన్ని సాక్షాత్తుగా ప్రధానమంత్రికి ఈ చేత్తో సమర్పిస్తాను. యెక్కడో దొరికిందంటాను. ప్రభుత్వం, పేపర్లూ నా నిజాయితీని మెచ్చుకుంటాయి. పదిలక్షలూ, కీర్తి చాలు నాకు!" శివరాం నవ్వుతూ

అన్నాడు.

రాణా ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. శివరాం కళ్లు, అతను బుకాయించడంలేదని రాణాకి చెప్పున్నాయి. అతను బరువుగా నిట్టూర్చాడు.

"ఆల్ రైట్....శివరాం...మా వంశంకోసం, మా అమ్మగారి ఆత్మ శాంతికోసం అంగీకరిస్తున్నా. పదిహేను లక్షలు....అయితే ఆ నెక్లెస్ నీ ఆధీనంలో వుందని నువ్వు నిరూపించుకోవాలి!"

నవ్వుతూ శివరాం పైకి లేచాడు. రాణా దగ్గరగా నడిచాడు. కోటుజేబులోంచీ గుండ్రంగా చుట్టిన ఫోటోని ఇవతలికి లాగాడు. దాన్ని రాణా ఎదురుగా టేబుల్ మీద పరిచాడు. రాణా కళ్ళు వెడల్పుగా అయ్యాయి.

"మిస్టర్ రాణా, ఇది మూడు రోజుల క్రిందట 'ది హిందూ' దినపత్రిక మొదటి పేజీ ఫోటో. నూతన రాష్ట్రపతి ప్రమాణ స్వీకారంచేస్తున్న ఫోటో కూడా మీరు చూడొచ్చు. ఆ ఫోటోమీద పెట్టిన నెక్లెసుని జాగ్రత్తగా చూసుకోండి!" శివరాం నవ్వుతూ అన్నాడు.

మూడురోజుల క్రితం తేదీనీ, వారాన్నీ నెక్లెస్ ఫోటోనీ రాణా పరిశీలనగా చూశాడు. పరిచిన హిందూ పేపర్ మీద నెక్లెసుని పెట్టి, ఫోటో తీసినట్టు అతను గుర్తించాడు. ఊపిరిపీల్చుకోడం మానేసిన రాణాని శివరాం సగర్వంగా చిరునవ్వుతో చూశాడు. రాణా టేబుల్ సొరుగులోంచీ మాగ్నిఫయింగ్ గ్లాసు తీసి మరోసారి తేదీని జాగ్రత్తగా చూశాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "మిస్టర్ రాణా, ఇది పాత పేపరు ఫోటోకాదు. పాత పేపర్ని మీరు సంపా

డించగలరు. నూతన రాష్ట్రపతిని, ఈ మధ్యే ఎన్నికై ప్రమాణస్వీకారం చేస్తున్న రాష్ట్రపతిని గతంలో మీరు సంపాదించలేరు!"

"యస్!" రాణా కంఠం బొంగురుగా ధ్వనించింది. శివరాం వెళ్ళి తన కుర్చీలో కూచుని, మరో సిగిరెట్టు వెలిగించాడు. ఆశ్చర్యంనుండీ కోలుకోడానికి రాణాకి రెండునిమిషాలు పట్టింది. మెల్లిగా తలెత్తి శివరాంని నవ్వుతూ చూశాడు. అతని వెడల్పాటి మొహంమీద స్వేదబిందువులు పూసల్లా మెరుస్తున్నాయి.

"శివరాం.....,తరవాత.....,తరవాత....ఈ విషయం గురించి ఇన్సూరెన్స్ కంపెనీకి సిబిఐకీ తెలీదుగా?" సందేహిస్తూ అడిగాడతను.

"నాద్వారా తెలీదు."

"వాటీస్ది గ్యారంటీ?" రాణా కళ్ళల్లో సందేహం దొంగలా తొంగి చూస్తోంది.

"మనిషికీ మనిషికీ మధ్య మాటని మించిన గ్యారంటీ లేదు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"నాకు కబుర్లుకాదు; గ్యారంటీ కావాలి!" రాణా విసుగ్గా అన్నాడు.

"అంతకన్నా గ్యారంటీలేదు! నమ్మకం ఉంటే 'ఊ' అనండి. నమ్మకం లేకుంటే 'ఊహూ' అనండి. మీరు యేమన్నా వినేసి, ఏదీ విననట్టుగా వెళ్ళిపోతాను!"

"ఆల్ రైట్. డబ్బు రెడీగా వుంచుతాను. క్లాక్ ఎప్పుడు పట్టుకొస్తావ్?" రాణా లొంగిపోతూ ప్రశ్నించాడు.

శివరాం సిగిరెట్ను యాష్ ట్రేలో నొక్కి అతన్ని తదేకంగా చూశాడు.

"మిస్టర్ రాణా, ముందుగా ఒకటి తెలుసుకోండి: ప్రశ్నలు అడిగే స్థానంలో, డిక్టేట్ చేసే స్థానంలో మీరు లేరు. చెప్పింది విని, చెప్పింది చేసేస్థానంలో ఉన్నారు."

"ఏమిటి నీ అర్థం?" రాణా ప్రశ్నతో అడ్డుతగిలాడు.

"ప్రశ్నలు వద్దు మిస్టర్ రాణా!" శివరాం కటువుగా అన్నాడు. "ఇవాళే మీ వస్తువుని కొత్త సూట్ కేస్‌లో నీటుగా సర్దండి. రేపు పదకొండు గంటలకి మీ పాడుగు కోటు 'దివాన్' దాన్ని గ్వాలియర్ రైల్వేస్టేషన్ కి పట్టు కొస్తాడు. ఢిల్లీ వెళ్ళే ఫ్రాంటియర్ మెయిల్ జనరల్ కంపార్టు మెంటులో నేనుంటాను. అతను సూట్ కేసుని నాకు అందిస్తాడు. బదులుగా అతనికి నేనో రైలు టిక్కెట్టు ఇస్తాను. ఆ టిక్కెట్టు తీసుకెళ్ళి ఊరికి వెళ్ళి యేదో లాడ్జిలో బసచేయమనండి...."

"అదంతా నాకు నచ్చదు! వస్తువు పట్టుకురా. పైకం పట్టుకుపో!" రాణా అడ్డుతగిలాడు.

అతన్ని వినిపించుకోకుండా శివరాం చెప్పుకుపోయాడు "రోజూ, అయిదురోజులపాటు రైల్వేస్టేషన్ కి వచ్చి పోతూ వుండమనండి. ఈ అయిదు రోజుల్లో అతన్ని నేను స్టేషన్‌లో కలుసుకుంటాను. మీ వస్తువున్న పార్సెల్ ని అందజేస్తాను..."

"ఈ డొంకతిరుగుడు వ్యవహారమంతా దేనికి? డబ్బు లాక్కుని ఉడాయించడానికా?"

శివరాం గంభీరంగా నవ్వాడు. "నమ్మకం లేకపోతే వ్యాపారం సాగదు! నేను చెప్పినట్టు చేస్తేగానీ నెక్లెస్ మీ మెడలో వాలదు!"

"తరవాత వాలుతుందన్న గ్యారెంటీ ఏమిటి?"

రాణా కోపంగా అడిగాడు.

"గ్యారెంటీ గురించి ఇందాకే మీకు చెప్పాను! మీరు కంగారు పడకుండా వుంటానికి మరో రహస్యం చెప్తాను. రేపొద్దున ఆ నగని ధరించి మీరు ఎలా బైట తిరగగలరో, నేను కూడా ఇప్పుడు అలాగే తిరగలేను. అది లోకానికి కనిపిస్తే కొంపలంటుకుంటాయి! పైగా ఐ వాంట్ టూ ఎంజాయ్ లైఫ్! వజ్రాల నెక్లెస్ దోచుకుని, పిసినారిలా బతకడం నాకు ఇష్టంలేదు. నాకు కావాల్సింది రాళ్ళు కాదు; లక్షలు! మీరు కాకుండా మరొకరికి అమ్మి మరింత జేబులో వేసుకునే అత్యాశ వుంటే నేను ఇంత దూరం రాను! పదిహేను నావి; పదమూడు మీవి!" శివరాం అర్థవంతంగా అంటూ నవ్వాడు.

"అయిదు రోజులు....ఆ గడువు దేనికి?"

"ఇది మీ అరణ్యం. అంత విలువైన వస్తువుని జేబులో పెట్టుకుని మీ అడవిలోకి మొండి ధైర్యంతో ప్రవేశించేంత మూర్ఖుణ్ని కాను నేను!" అంటూ శివరాం లేచాడు.

"శివరాం, సిడౌన్! ఇంకా మాట్లాడాలి...." రాణా ఆత్రుతగా అన్నాడు.

"ఇంక మాట్లాడ్డానికి ఏమీ లేదు! రేపు పదకొండింటికి మీరు మొత్తం చెల్లిస్తారు. అయిదురోజుల్లోగా సరుకుని అందుకుంటారు. మరో హెచ్చరిక: మొత్తంలో ఏమాత్రం తక్కువున్నా మీరు నష్టపోతారు. నన్ను వెంటాడ్డానికి ప్రయత్నించినా, సూచనలకి విరుద్ధంగా చిన్న పని చేసినా మీరు కష్టపడతారు. గుర్తుంచుకోండి!" శివరాం రెప్పవేయకుండా చూస్తూ అన్నాడు.

రాణా అర్థమైనట్టు తలపంకించాడు. మెల్లిగా పైకి

లేచాడు. అదోలా శివరాంవైపు చూశాడు. "శివరాం, నేను ఈ విషయంలో యెవర్నీ నమ్మను. స్టేషన్‌కి నేనే వస్తాను!"

శివరాం మాట్లాడకుండా సిగిరెట్ వెలిగించాడు.

"రావొచ్చా?" రాణా ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

శివరాం చిరునవ్వు నవ్వాడు.

"నిరభ్యంతరంగా!" రాణా తేలిగ్గా నిట్టూర్చాడు.

# 8

గ్వాలియర్ స్టేషన్ కిటకిటలాడుతోంది.

శివరాం జనాన్ని భుజబలంతో చీల్చుకుంటూ జనరల్ కంపార్టుమెంటు వేపు నడిచాడు. మరో మూడునిమిషాల్లో ఫ్రాంటియర్ మెయిల్ ఢిల్లీ వేపు బయల్దేరుతుంది. శివరాం జనరల్ కంపార్టుమెంటుకి కొంచెం దూరంగా ఆగి, తమ్ములాట సాగిస్తున్న ప్రయాణీకుల్ని చిరునవ్వుతో చూశాడు. అతని కళ్ళు రాణాకోసం వెతుకుతున్నాయి.

శివరాం తన పక్కనే వున్న రిజర్వ్‌డ్ కంపార్టుమెంటులోకి ఎక్కాడు. డోర్ దగ్గరే నిలబడి తలలు అలలుగా వున్న జనసముద్రాన్ని చూస్తూ ఉండిపోయాడు. అతని కళ్ళు మెరిశాయి. సూట్‌కేసు మోస్తూ జనంలో దూరడానికి రాణా కంగారుగా ప్రయత్నిస్తున్నాడు. మాసిన బట్టల్లో, ఎర్ర తలపాగాతో రాణా మామూలు ప్రయాణీకుడిలా అవుపించడానికి ప్రయత్నిస్తున్నాడు.

"అరే భాయ్, రాణా!" శివరాం రాగయుక్తంగా అరిచాడు. తటాలున రాణా తల అతనివైపు తిరిగింది. శివరాం చెయ్యి ఊపాడు. రాణా మొహంలో కంగారు

మాయమైంది. వేగంగా శివరాం వైపు రాసాగేడు. తోసుకుంటూ పైకెక్కుతున్న నలుగురు ప్రయాణీకులకి దారియిస్తూ శివరాం పక్కకి జరిగాడు. ముందుకు వొంగి చెమటలు కక్కుతున్న రాణా మొహంలోకి నవ్వుతూ చూశాడు. రాణా మొహం ఉద్రేకంతో నిండివుంది.

"వేషానికి తగిన పేరుతో పిల్చాను!" శివరాం నవ్వుతూ అన్నాడు. సూట్ కేసువైపు చూస్తూ చెయ్యి చాచాడు. తటపటాయిస్తూ రాణా సూట్ కేసు అందించాడు.

"శివరాం...." రాణా యేదో చెప్పబోయాడు. శివరాం అతనికి అవకాశం ఇవ్వకుండా కంపార్టుమెంటు లోపలికి జరిగాడు. ఎడంవైపున్న లావెటరీలోకి దూరి తలుపు మూసుకున్నాడు.

నిమిషం తర్వాత శివరాం మళ్ళీ డోర్ ముందు ప్రత్యక్షమయ్యాడు. కంగారుగా అటూ ఇటూ చూసి లోపలికి యెక్కబోతున్న రణాని చిరునవ్వుతో చూశాడు.

అతని చెయ్యి కోటుజేబులోంచీ ఇవతలికి వచ్చింది. రాణా ఆత్రుతగా చెయ్యి చాచాడు. శివరాం టికెట్ని అతనికి అందించాడు. రాణా ఆత్రంగా టికెట్ని చూశాడు. అతని కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

అది ప్లాట్ ఫాం టికెట్!

రాణా కంగారుగా శివరాం మొహంలోకి చూశాడు. ఇద్దరు ప్రయాణీకులు ఆదరాబాదరా లోపలికి జొరబడుతూ వాళ్ళ మధ్యలో దూరారు. ట్రెయిన్ కుయ్యో అంది. మెల్లిగా చక్రాలు కదిలాయి. రాణా అదుర్దాతో రాడ్ పట్టుకుని ట్రెయిన్తో బాటు కదుల్తున్నాడు.

శివరాం నవ్వుతూ అతన్ని చూస్తున్నాడు.

"శివరాం.... యూ...." మెయిల్ కూత అతని మాటల్ని మింగేసింది.

కోటులోపల్నుంచీ మెస్మరిస్టులా శివరాం చిన్న పార్సిల్‌ని ఇవతలికి తీశాడు. ఇప్పుడు పరుగెడుతున్న రాణావైపు దాన్ని చాచాడు.

రాణా అప్రయత్నంగా దాన్ని అందుకున్నాడు.

"గుడ్‌బై రాణా సాబ్!" శివరాం నవ్వుతూ అన్నాడు.

అయోమయం, ఆశ్చర్యం, ఆనందం కలగాపులగంగా వున్న రాణా మొహంలోకి ఒకసారి చూసి శివరాం వెనక్కి జరిగాడు. డోర్ పక్కనే వారగా వుంచిన సూట్‌కేసుని అందుకున్నాడు. మెయిల్ వేగం పుంజుకుంటోంది. అటువైపున్న డోర్ని శివరాం తెరిచాడు. నిర్భయంగా మెట్లమీదికి దిగాడు. నిర్భయంగా ట్రెయిన్ వెళ్తున్నవైపు తిరిగి కొద్దిగా గాలిలోకి ఎగిరి నేలమీద వాలాడు. తూలిపడబోయి, పక్కనే ఆగి వున్న మరో రైలు పెట్టెని అనుకున్నాడు.

అతని దగ్గరగా ఫ్రాంటియర్ మెయిల్ కంపార్టుమెంట్సు దూసుకెళుతున్నాయి. శివరాం ఆలస్యం చేయకుండా, ఆగివున్న ట్రెయిన్‌లోకి ఎక్కాడు. క్షణంలో అటుపక్కకి దిగేశాడు....

రెండు నిమిషాల్లో శివరాం ప్లాట్‌ఫాంమీద ఠీవిగా నడుస్తున్నాడు. మరో నిమిషంలో మద్రాసు వెళ్ళే జి.టి. ఎక్స్‌ప్రెస్ అతనికోసమే యెదురుచూస్తున్నట్టు ఆగి వుంది. శివరాం తన కంపార్టుమెంటులోకి ఎక్కాడు. తలుపుమూసి, లోపలికి వెళ్ళాడు.

అతన్ని చూడగానే లత మొహంలోని కంగారు అదృశ్యమైంది. తేలిగ్గా నిట్టూర్చి, నవ్వుతూ చూసిందామె. సూట్కేస్ని ఆమె పక్కనే పడేసి శివరాం ఆమెకి ఇటువైపున కూచున్నాడు.

"డార్లింగ్....రాలేవేమో అని భయపడిపోయాను" లత తగ్గుస్వరంతో అంది.

శివరాం చిన్నగా నవ్వాడు. "ఈ ట్రెయిన్లో, ఈ బెర్తుమీద ఈ ప్రయాణం ఇవాళ ప్లాన్ చేసిందికాదు. ముందు చూపుతో ముందుగానే అన్నీ ఫిక్స్ చేశాను. మనం ఫిక్స్ చేసింది యెప్పుడూ బెడిసికొట్టదుగా?"

శివరాం కంఠంలో ధ్వనించిన విజయగర్వం లతకి యెంతో చెప్పింది. ఆప్యాయంగా ఒక చేతిని అతని తొడ మీదా, రెండో చేతిని పక్కనే వున్న సూట్కేసుమీదా వేసిందామె.

గ్రాండ్ట్రంక్ ఎక్స్ప్రెస్ వాళ్ళ గమ్యస్థానంవేపు కదిలింది.

## 9

టిఫిన్ ముగించి, కాఫీ తాగేసి శివరాం తృప్తికరంగా సిగిరెట్టు వెలిగించాడు.

"డార్లింగ్...."

శివరాం రెప్పలెత్తి లతవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏదో సస్పెన్స్ నవలని అక్కడక్కడా తిరగేసినట్టు అంతా గందరగోళంగా వుంది. డైమండ్ నెక్లెసు వచ్చింది; పోయింది. ఆ నోసా మూలంగా ఈ అద్వేంచర్లో నాకు అవకాశం లేకుండా పోయింది!" లత దెప్పుతున్నట్టు అంది.

శివరాం ఉల్లాసంగా నవ్వాడు. "ఏది వచ్చినా, ఏది పోయినా మనకి నష్టం రాలేదుగా!"

"డార్లింగ్ కొన్ని సందేహాలు నన్ను పీక్కుతినేస్తున్నాయ్..."

శివరాం ఆమెని నవ్వుతూ చూశాడు. "చెప్పకు. సందేహమేమిటో తెలుసుకోకుండానే వాటికి సమాధానాలు చెప్తాను. ఊకొట్టు!" అంటూ సోఫాలోంచీ లేచి మంచంవేపు నడిచాడు. మంచంమీద పక్కవాటంగా పడుకుని లతవైపు చూశాడు. లత అతని పక్కనే కూచుంది.

"కుబేర్ దాస్ జాబారీ దొంగనగలు చేతులు మార్చడంలో ఎక్స్‌పర్టు అని తెలుసుకున్నాను. దేశవ్యాప్తంగానే కాకుండా విదేశాల్లోకూడా పేరుప్రఖ్యాతులున్న అతని దగ్గర చాలా ఖరీదైన దొంగనగలు వుండవచ్చన్న అనుమానం కలిగింది. అమెరికాలో స్థిరపడి, అమెరికా ఆంధ్రగా తెలిని వెళ్ళాడిన అరవింద్‌లా నటిస్తూ కేర్‌లెస్‌గా మాట్లాడుతూ అతని మతి పోగొట్టాను. చివరికి చారిత్రక విలువవున్న నెక్లెసుని అమ్మడానికి అతను నిశ్చయించుకున్నాడు...."

"ఆ నెక్లెసు నిజంగా ఎవరిది?"

"చందన్‌పూర్ మహారాణీ తారాదేవిది. అందులో వున్న వజ్రాల్లో ఆమె జన్మ నక్షత్రం, రాసులూ వున్నాయి. జాబారి నెక్లెస్ చూపించాడు. లక్షరూపాయలు అడ్వాన్స్ పారేసి వజ్రాలమీద వేలిముద్రలు వేసి తిరిగొచ్చాను. ఏడెనిమిదేళ్ళక్రితం న్యూస్ పేపర్లలో యెక్కడో చదివిన వార్త ఆ రాత్రి నాకు గుర్తొచ్చింది. ఎనిమిదేళ్ళప్పుడు రాజప్రాసాదంలోంచీ యెవరో దాన్ని

కాజేశాడు.

"అప్పట్లో కొంచెం పలుకుబడివున్న రాణా రాజ సింహ పోలీసుల సహాయంతో ఆ విలువైన నగకోసం చాలా అన్వేషించాడు. ముందు చూపుతో అతను దాన్ని పదిహేను లక్షలకి ఇన్స్యూర్ చేశాడు. నగపోయిందని ఖచ్చితంగా తేలిపోయాక అతను క్లెయిమ్ పెట్టి పదిహేను లక్షలు తీసేసుకున్నాడు. ఇదంతా గుర్తొచ్చాక, బాగా ఆలోచించి ప్లాన్ చేశాను. జూబారి దగ్గర తన వంశానికి చెందిన నెక్లెసు వుందని రాణాకు తెలీదు. దాన్ని సంపాదించి రాణాకు అమ్మితే యెలా వుంటుందని ఆలోచించాను...."

"డార్లింగ్ ....యూ ఆర్ ...."

"వెంటనే బ్రహ్మాండమైన పథకం వేశాను. సిబిఐ ఆఫీసర్లా నటిస్తూ, నలుగురు ఎక్స్ సర్వీస్ వ్యక్తుల్ని అసిస్టెంట్సుగా తీసుకుని జూబారీస్ మీద 'లైట్నింగ్ రెయిడ్' చేశాను. జూబారీకి నేను తయారుచేయించిన ఐడెంటిఫికేషన్ కార్డులూ, సెర్చ్ అండ్ సీజ్ వారెంటూ చూపించాను. అరవింద్ నీ నోనానీ సిబిఐ అతనిమీద ప్రయోగించిందని అతన్ని అదరగొట్టేశాను. చివరికి వజ్రాల నెక్లెస్ని సీజ్ చేశాను. అరవింద్ గా నటించిన సిబిఐ ఆఫీసరు నేనే అని అతనికి రివీల్ చేశాను. జూబారి బోర్లాపడిపోయాడు. అతను తేరుకుని పైకి లేచేలోగా అయిదు లక్షలు వసూలు చేసేశాను. తరవాత...."

"తరవాత చందన్ పూర్ వెళ్ళాం! ఆ తరవాత కథ కావాలి నాకు!" లత అడ్డుకగిలింది.

శివరాం చిరునవ్వు నవ్వాడు. "తరవాత రెయిడ్ లో పాల్గొన్న నలుగురికి వెయ్యేసి, నోనాకి రెండువేలు

ఇచ్చేశాను. తరవాత చందన్‌పూర్...." అంటూ సిగ
రెట్టు వెలిగించాడు. లత కుతూహలంతో చూసింది.

"గతంలో నెక్లెస్ వారసుడు రాణా రాజసింహాని కల్సుకుని, నెక్లెస్ నా అధీనంలో వుందని నిరూపించాను. ఇన్సూరెన్స్ పైకం నాకు చెల్లిస్తే నెక్లెస్ని అతని మెడలో అలంకరిస్తానన్నాను. నన్ను బెదిరించి దాన్ని లాక్కోడానికి రాణా ప్రయత్నించాడు. అతనికి నా విశ్వరూపం చూపించి, కనువిప్పు కలిగించాను. అడిగింది ఇచ్చి నెక్లెస్ని తీసుకోకపోతే ఏంచేస్తానో వివరించాను. చివరికి రాణా పదిహేను చెల్లించాడు!" శివరాం ఆగి, నవ్వుతూ చూశాడు.

లత కళ్ళు చిట్లిస్తూ చూసింది. "డార్లింగ్, ఈసారి నువ్వు పొరపాటుచేశావేమో అనిపిస్తోంది. అయామ్ వర్రీడ్!"

శివరాం మంచంనుంచి కిందికి దిగాడు. లతముందు ఠీవిగా నిలబడి ప్రశ్నార్థకంగా చూశాడు.

"హనీ....పొరపాటు....ఏమిటది?"

"అయిదుగురు వ్యక్తుల్ని నీ కాన్ఫిడెన్స్‌లోకి తీసుకున్నావు. నోవా, నలుగురు ఎక్స్ సర్వీసు...."

శివరాం నవ్వు ఆమెని ఆపేసింది. "వాళ్ళని పనిలోకి తీసుకున్నాను; కాన్ఫిడెన్స్‌లోకి కాదు! ఎంతో అన్వేషించి నోవాని పట్టాను. గంటసేపు నా భార్యగా నటిస్తే రెండువేలిస్తానన్నాను. పాతకాలం నగల్ని గురించి ఆమెకి బ్రెయిన్ వాష్ చేశాను. నోవా గంటలుకాదు, రోజులు నటిస్తానంది. తరవాత ఆ నలుగురూ. సిబివి కమీషనర్ శివానంద్‌గా వాళ్ళకి పార్టుటైమ్ జాబ్ ఇచ్చాను; దేశంకోసం! నలుగుర్నీ వివిధ సమయాల్లో

జూబారి షో రూమ్‌కి పంపించాను. ఏవో నగలుచూసే వాళ్ళలా నటించమన్నాను. నేను వాళ్ళముందు షాపులో ప్రత్యక్షమయ్యే దాకా, నలుగురూ ఒకే పనిమీద అక్కడికి చేరుకున్నట్టు వాళ్ళకి తెలీకుండా అంతా ప్లాన్ చేశాను!"

"గుడ్ గాడ్!" లత అరిచింది.

"నలుగురూ ముందు చెప్పునే రెయిడ్ చేస్తూ ఉండి పోయేలా యేర్పాటు చేశాను. నెక్లెస్ని ఒక్కణ్నే సీజ్ చేశాను. స్టాకూ, రిజిస్టర్లూ సక్రమంగా ఉన్నాయి. జూబారీన్ని అనుమానించే పనిలేదన్నాను. వాళ్ళ ఫీజు వాళ్ళకి ఇచ్చేశాను. జరిగిందాన్ని అతిరహస్యంగా వుంచే షరతుమీదే వాళ్ళకి ఉద్యోగాలిచ్చాను. నోరు జారితే మేజర్ జనరల్ నాకు సప్లై చేసిన లిస్టులోంచీ వాళ్ళ పేర్లు ఎగిరిపోతాయన్నాను. ఈపాటికి వాళ్ళు రెయిడ్ గురించి మరిచిపోయి, కొత్త పార్ట్‌టైం జాబ్ కోసం యెదురుచూస్తూ వుంటారు! చాలా?" శివరాం నవ్వుతూ అన్నాడు.

"జూబారి పోలీసులకో, సిబిఐకో ఫిర్యాదుచేస్తే?" లత అనుమానం వ్యక్తం చేసింది.

"చేయడు. చేసి, తను దొంగతనంగా దొంగ నెక్లెస్ కొని దాచుకున్న రహస్యాన్ని చెప్పుకోడు! వానీ తేలు కుట్టిన దొంగ ఏం చేస్తాడు?" శివరాం ప్రశ్నించాడు.

"ఓకే—ఇంక, రాణా రాజసింహాకి నువ్వు టోపీ వేశావ్. ఒకటికాదు; రెండు కాదు; పదిహేను లక్షలు!" లత నవ్వింది.

"అది అతని సైకం కాదని ఇందాకే చెప్పాను. అది ఇన్సూరెన్స్ కంపెనీ డబ్బు. అతనూ నోరు తెరవడు. కిక్కురుమనకుండా తన అమ్మమ్మ నెక్లెస్ని భూస్థాపితం

చేసి, అప్పుడప్పుడూ తవ్వి చూసుకుంటూ గడిపేస్తాడు! శివరాం నవ్వుకుంటూ మరో సిగిరెట్ వెలిగించాడు. “హనీ, ఇంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు కత్తిరించాట్ట. అలాగే ఆ వజ్రాయుధంతో నేను జూబారీనీ, రాణానీ కూల్చేశాను! వాళ్ళు పైకి లేవరు!”

“డార్లింగ్..నా మనసంతా ఆ నెక్లెసుమీదే వుంది!” లత ఆశగా అంది.

శివరాం ఆమెని తదేకంగా చూశాడు. “హనీ, ఆ నెక్లెస్ని ఎవరు ధరించినా, అది వాళ్ళకి ఉరితాడు అవుతుంది! దాన్ని మరిచిపో. నీ దగ్గర ఇరవై లక్షలు ఉన్నాయి. ఏడు వారాల నగలు ఏడుసెట్లుగా చేయించుకో!”

లత ఉద్రేకంతో పైకి లేచింది. వీపుని అతనివైపు తిప్పి, అతని ఛాతీమీద తల ఆన్చి, రెప్పలు బాగా పైకెత్తి అతని కళ్ళల్లోకి చూసింది. ఆమె చేతులు నెక్లెస్లా అతని మెడచుట్టూ అల్లుకున్నాయి.

“డార్లింగ్........మరీ పెద్ద మొత్తం........భయంలేదంటావా?” లత మళ్ళీ అనుమానిస్తూ, అంది.

శివరాం చేతులు ఆమె సన్నటి నడుముని వడ్డాణంలా చుట్టుకున్నాయి. నెక్లెస్ మధ్యలోని పతకంలా మెరుస్తున్న ఆమె మొహాన్ని అతను నవ్వుతూ చూశాడు.

“హనీ, ఈ అడ్వెంచర్ని రహస్యంగా ఉంచుకోవాల్సిన అవసరంలేదు. అలా ఉంచుకోకూడదు కూడా! కుబేర్ దాస్ జూబారీకి అయిదు లక్షల చిన్న టోపీ, రాణా రాజసింహాకు పదిహేను లక్షల పెద్ద టోపీ వేసినట్టు

అర్జెంటుగా నేను ఒక వ్యక్తికి చెప్పాలి!" శివరాం ఆలోచనగా అన్నాడు.

"ఎవరా వ్యక్తి?" లత ఆశ్చర్యంతో ప్రశ్నించింది. వజ్రాల్లా మెరుస్తున్న కళ్ళతో శివరాం ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"డిటెక్టివ్ టెంపో."

('శివరామ్ అడ్వెంచర్స్' సీరీస్‌లో
ఇది రెండవ నవల.)

— అయిపోయింది —

# ప్రమాదకరమైన డ్రగ్

## వసుంధర

ఉమ ఇంటికి వచ్చేసరికి చాలా హడావుడిగా వుంది.

ఆమె కంగారుపడి తల్లిని చాటుగా పిలిచి-"ఏమయిందమ్మా?" అనడిగింది.

"వచ్చేవా తల్లీ! నీకోసమే చూస్తున్నాను. నాన్నగారికి గుండెనొప్పి వచ్చింది—" అంది ఉమ తల్లి సత్యవతి. తనను పక్కకు పిలిచి దెవరో కూడా వెంటనే గమనించలేని స్థితిలో వుంది సత్యవతి.

ఉమ, తండ్రికి గుండె నొప్పి అనగానే కంగారు పడింది.

"నువ్వు కంగారుపడకు. నాన్నగారు నీతో ఏకాంతంగా మాట్లాడుతారుట. దగ్గర నేనుకూడా ఉండకూడదన్నారు—" అంది సత్యవతి.

తండ్రి తనతో ఏకాంతంలో ఏం మాట్లాడాలనుకుంటున్నదీ ఉమకు తెలుసు.

ఉమ తండ్రి రాఘవరావు కిద్దరు మేనల్లుళ్ళు. ఇద్దరూ

చిన్నప్పట్నించీ ఆయన దగ్గరే పెరిగారు. ఒకడి పేరు సతీష్. రెండోవాడి పేరు నరేష్.

సతీష్‌కి చిన్నతనంలోనే తల్లి పోతే తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడు. నరేష్‌కి చిన్నతనంలోనే తండ్రి పోతే తల్లి రెండో పెళ్ళి చేసుకుంది. ఆవిధంగా ఇద్దరు మేనల్లుళ్ళూ రాఘవరావిల్లు చేరారు.

రాఘవరావుకిద్దరే పిల్లలు. పెద్దది ఉమ. పందొమ్మిదేళ్ళు. బీయస్సీ చదువుతోంది. చదువు బాగా వస్తోంది. బాగా చదివి ఏమైనా సాధించాలని ఆమె కోరిక. ఆమె తమ్ముడు గోపాల్‌కి ఐఐటీ కాన్పూర్‌లో ఇంజనీరింగ్ ఎంట్రెన్స్‌లో సెలక్షన్ వచ్చింది. కుర్రాడు చాలా తెలివైనవాడు.

రాఘవరావుది బట్టల వ్యాపారం. మేనల్లుళ్ళిద్దర్నీ ఆయన వ్యాపారంలో పెట్టకుండా చదివించాడు. ఇద్దరూ బీకాం ప్యాసయ్యారు. ఇద్దరికీ ప్రయివేటు కంపెనీల్లో ఆ ఊళ్ళోనే ఉద్యోగాలు దొరికాయి. జీతం నెలకు ఏడెనిమిదొందలు.

వాళ్ళిద్దరూ కూడా ఉమను ప్రేమిస్తున్నారు. ఆ విషయం రాఘవరావుకు చెప్పుకున్నారు.

“మిమ్మల్నిద్దర్నీ కూడా చిన్నప్పట్నించీ సమంగా చూసుకున్నాను. ఇప్పుడు మీలో ఒకడి నల్లుణ్ని చేసుకుని రెండోవాణ్ని చిన్నబుచ్చలేను....కాబట్టి మీరు ఉమమీద ఆశలు పెంచుకోకండి—” అన్నాడు రాఘవరావు వాళ్ళతో.

సతీష్‌కీ నరేష్‌కీ మధ్య సదవగాహన వుంది. వాళ్ళిద్దరూ కూడబలుక్కుని—“ఉమ మా యిద్దరిలోనూ ఎవరినైనా ఎన్నుకుంటే మేము చిన్నబుచ్చుకోము—” అని రాఘవ

రావుకి చెప్పారు. రాఘవరావు ఉమ అభిప్రాయమడిగి తెలుసుకున్నాడు.

ఆమెకు వాళ్ళిద్దరిలో యెవరన్నా అభిమానమే. కానీ ఆ యిద్దరిలో యెవరినీ కూడా ఆమెకు పెళ్ళిచేసుకునే వుద్దేశ్యంలేదు.

రాఘవరావిది విని బాధపడ్డాడు.

సతీష్, నరేష్—ఇద్దరూ అందమైన యువకులు. బుద్ధిమంతులు. చురుకైనవాళ్ళు. వారితో చిన్నతనం నుంచీ పరిచయమున్నప్పటికీ ఉమ వారిని తనకు వరుల స్థానంలో ఊహించుకోలేదు. అందుకు కారణమేమిటి?

తను మొదట్నుంచీ మేనల్లుళ్ళను తక్కువ స్థాయిలో వుంచేడా? ఉమకు వారంటే చిన్న చూపేర్పడడానికి కారణం తనేనా?

"ఉమా! వాళ్ళంటే నీకిష్టంలేదనకు. వాళ్ళలో ఎవరినీ యెన్నుకోలేనని చెప్పు. వాళ్ళ మనసు బాధపడకూడదు" అన్నాడు రాఘవరావు.

ఉమ సరేనంది.

ఇది జరిగేక కొన్నాళ్ళకు సతీష్ ఎక్కడో తాగి పడిపోతే నరేష్ తనే యింటికి తీసుకొచ్చాడు. రాఘవరావు సతీష్‌మీద మండిపడితే "మామయ్యా! వాడిని కోప్పడకు. ఇప్పుడు వాడు మనలో లేడు. ఉమను పెళ్ళిచేసుకోవడం అసాధ్యమని తెలియగానే వాడికి జీవితమంటే విరక్తి పుట్టి తాగుడు అలవాటు చేసుకున్నాడు...." అని నరేష్ సద్ది చెప్పాడు.

సతీష్‌కు మత్తు దిగేక రాఘవరావతణ్ని ఏకాంతంలో చెడామడా తిట్టి—"నా పెంపకంలో ఏదో లోపముండి వుండాలి—" అని బాధపడ్డాడు.

"మామయ్యా! తప్పు నీ పెంపకానిది కాదు. నాదే! నరేష్ ఉమను ప్రాణంకంటే యెక్కువగా ప్రేమించాడు. వాడు జీవితంమీద విరక్తి చెంది ఆత్మహత్య చేసుకోబోతే, సమయానికి అదృష్టవశాత్తూ నేను కాపాడగలిగాను. ఉమను వాడికిచ్చి పెళ్ళిచేసే బాధ్యత నాదని చెప్పాను" అన్నాడు సతీష్.

"అందుకోసం తాగుడు మొదలు పెట్టావా?" అన్నాడు రాఘవరావు నిరసనగా.

"అవును మామయ్యా! ఉమ మాట మరదలేకాదు. మంచి బాల్య స్నేహితురాలు మాలో ఒకరిని తిరస్కరించడం కష్టమనిపించి ఇద్దరికీ దూరంగా వుండటం నిర్ణయించుకున్నాను... మాలో ఒకరిపై విరక్తి కలిగితే ఎన్నిక ఆమెకిబ్బందికాదు. అందుకే నేను తాగుడు అలవాటు చేసుకున్నాను—" అన్నాడు సతీష్.

రాఘవరావు తెల్లబోయాడు. ఆయన మేనల్లుణ్ని మందలించి—"ఏ కారణంచేతనైనా సరే వెధవ పనులు చేయకు—" అన్నాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు నరేష్ లాడ్జిమీద రెయిడింగులో పోలీసులకు పట్టుబడ్డాడు. అతణ్ని విడిపించుకునేసరికి రాఘవరావుకు తల ప్రాణం తోకకు వచ్చింది. అదేమని అడిగితే "సతీష్‌కోసం త్యాగం—" అని నరేష్ అన్నాడు.

తన మేనల్లుళ్ళిద్దరూ చెడిపోతున్నారని రాఘవరావుకి అర్థమయింది. వాళ్ళను చెడిపోకుండా ఆపలేకపోతున్నాడు తను. అందుకు కారణం ఉమ.

రాఘవరావు కూతురికి పరిస్థితి చెప్పాడు.

"వాళ్ళంటే నాకిప్పుడు చాలా చిరాగ్గా వుంటోంది"

అంది ఉమ.

"వాళ్ళు నిన్నేం చేశారు?" అన్నాడు రాఘవరావు.

"ఇప్పుడు వాళ్ళ ప్రవర్తనలో మార్పు వచ్చింది. కొత్త చనువు ప్రదర్శిస్తున్నారు. వెకిలిగా వుంటున్నారు. గట్టిగా తిడితే — 'అలాగే తిట్టు నన్నుసహిస్యూంచుకో— రెండో వాణ్ణి ప్రేమించు'-అంటున్నారు. ఇదివరకటిలా చనువుగా వాళ్ళను పలకరించలేకపోతున్నాను. వాళ్ళకు వీలైనంత దూరంగా వుంటున్నాను—" అంది ఉమ.

"వాళ్ళు చెడిపోతున్నారనడంలో సందేహం లేదు—" అన్నాడు రాఘవరావు.

"వాళ్ళ విషయంలో ఏం చేస్తారు మరి?" అంది ఉమ.

"నేనేం చేస్తాను? నువ్వే ఏదో చేయాలి...."

"నేనా?" అంది ఉమ ఆశ్చర్యంగా.

"నీ కారణంగానే వాళ్ళు చెడిపోయారు."

"చెడిపోయే వాళ్ళకెప్పుడూ యేదో కారణముంటుంది. చెడిపోనివాళ్ళకూ ఆ కారణాలుంటాయి...."

"అంటే?"

"ఈరోజీకారణంగా చెడిపోయినవాళ్ళు రేపింకో కారణంగా చెడిపోవచ్చు. అసలు వాళ్ళది చెడిపోయే బుద్ధి...." అంది ఉమ.

"చిన్నపిల్లవైనా బాగా చెప్పావమ్మా—అయితే నేనిప్పుడు నీకు నిజం చెప్పక తప్పదు—" అన్నాడు రాఘవరావు.

ఉమ ఆశ్చర్యంగా—"ఏమిటా నిజం నాన్నా?" అంది.

"సతీష్, నరేష్—చిన్నప్పట్నించీ కూడా బుద్ధి

మంతులు కారు. వాళ్ళ బుద్ధి వక్రరీతులు లేయకుండా వుండాలని నేను వాళ్ళను ప్రత్యేకమైన క్రమశిక్షణలో పెంచాను. వెయ్యి కళ్ళతో కనిపెట్టుకు నేవాణ్ని. చివరికి వాళ్ళిప్పుడు స్వతంత్రులయ్యారు. మనింట్లోనే వుంటు న్నారు. ఇంటద్దెలేదు. తిండి ఖర్చులేదు. నెలనెలా జీతం వస్తోంది. దాంతో వాళ్ళకు కొత్త వుత్సాహం వచ్చింది. ప్రాజ్ఞులయ్యారనుకుని వాళ్ళను నేను వుపేక్షించాను. ఫలితంగా వాళ్ళ అసలు బుద్ధి బైటపడి దురలవాట్లకు లోనయ్యారు. ఇంత తొందరగా వాళ్ళు మారిపోతారని నేననుకోలేదు...."

"కానీ వాళ్ళకు మీరంటే భయంలేదా?"

"భయమెందుకులేదు? వుంది. అయితే వాళ్ళు నా బలహీనతని కనిపెట్టారు. ఇన్నాళ్ళుగా నా యింట్లో వుంచుకుని కూతుర్ని కూడా యివ్వాలనుకోవడంలేదని నేను కించపడుతున్నానని గ్రహించి అవకాశాన్నుపయో గించుకుంటున్నారు...." ఆగాడు రాఘవరావు.

"అంటే?" అంది ఉమ ఆశ్చర్యంగా.

"వాళ్ళిద్దర్లో యెవ్వరూ నిన్ను ప్రేమించడంలేదు. నిన్ను పెళ్ళిచేసుకోవాలనీ అనుకోవడంలేదు. నువ్వు వాళ్ళను పెళ్ళిచేసుకోవనీ వాళ్ళకు తెలుసు. అందుకే లేని ప్రేమను నటిస్తూ—ఆ వంకపెట్టి దురలవాట్లను యథేచ్ఛగా కొనసాగిస్తున్నారు. నేనూ వాళ్ళని ఏమీ అనలేకపోతున్నాను. దీనికి ఒక్కటే విరుగుడు. నువ్వు వెంటనే పెళ్ళిచేసుకోవాలి!"

"ఎవరిని?" అంది ఆమె తెల్లబోయి.

"సతీష్‌నీ, నరేష్‌నీ కాదులే....నువ్వు ఊఁ అంటే యేదో ఒక మంచి సంబంధం దొరకడానికంతో సేపు

పట్టదు...."

"కానీ నేను ఫిజిక్సులో డాక్టరేట్ చేయాలనుకుం టున్నాను...."

"చూడమ్మా—నీ కారణంగా రెండు జీవితాలు నాశనమవుతున్నాయి. నీవు పెళ్ళిపోతే నేను నా మేన ల్లుళ్ళని అదుపుచేయగల్గుతాను. లేకుంటే వాళ్ళ గతి అంతే!" అన్నాడు రాఘవరావు.

"ఎవరికర్మకి కెవరు కర్తలు నాన్నా?"

"నా మేనల్లుళ్ళ కర్మకు నా కూతురే కర్త!" అన్నాడు రాఘవరావామె ప్రశ్నకు బదులిస్తున్నట్లుగా.

ఉమ మృదువుగా తండ్రి కోరికను నిరాకరించింది. సతీష్‌నీ, నరేష్‌నీ వాళ్ళ కర్మకు వాళ్ళను విడిచిపెట్టింది.

రాఘవరావింకా అప్పుడప్పుడు ఉమను పెళ్ళి విషయమై అడుగుతూనే వున్నాడు. ఇప్పుడాయనకు గుండె నొప్పి వస్తే—ఉమతో ఏకాంతంగా మాట్లాడా లన్నాడు.

ఉమకాయనేం మాట్లాడాలనుకుంటున్నదీ తెలుసు.

## 2

రాఘవరావు ఉమను చూసి నీరసంగా నవ్వి— "డాక్టరు గుండెనొప్పి అన్నాడు. నాకేమీ అలాగని పించడంలేదు—" అన్నాడు.

"ఎక్కువ మాట్లాడొద్దు నాన్నా!" అంది ఉమ.

"నాది గుండెనొప్పి కాదమ్మా! ఛాతీలో కాస్త పోటువచ్చి ఓక్షణంపాటు స్పృహ తప్పిందిలే. దానికి పెద్ద హడావుడైపోయిందింట్లో...."

"అంతా అమ్మ నాకు చెప్పింది—" అంది ఉమ.

"అమ్మ చెప్పింది విన్నావుగా—ఇక నేను చెప్పింది

విను ..."

"ఎక్కువ మాట్లాడనంటేనే వింటాను...."

"ఒక్క ముక్కలో చెబుతాను. సరిగ్గా నెల్లాళ్లలో నీ పెళ్ళి అయిపోవాలి—" అన్నాడు రాఘవరావు.

ఉమ నవ్వి ఊరుకుంది.

"నీకు వేళాకోళంగా వున్నట్లుంది. నేనప్పుడే వరుణ్ని సిద్ధం చేసి వుంచాను—"

"ఎవరు?" అంది ఉమ.

"అతడి పేరు రవి. బీటెక్ ప్యాసయ్యాడు. ఈ ఊళ్ళోనే ఓ పెద్ద కంపెనీకి సేల్సు ఇంజనీరుగా వచ్చాడు. మీ యిద్దరికీ యీడూ జోడూ యెంతో బాగుంటుంది."

ఉమ మాట్లాడలేదు.

రాఘవరావు తలగడ క్రిందనుంచి ఓ కవరుతీసి కూతురికందించి—"ఇందులో రవి ఫోటో వుంది. చూడు" అన్నాడు.

ఉమ కవర్లోంచీ ఫోటోతీసి చూసింది.

అందమైన యువకుడు. చిరునవ్వులు చిందిస్తున్నాడు.

"ఎలాగున్నాడమ్మా?" అన్నాడు రాఘవరావు.

"నా కంటికి హంతకుడిలా కనిపిస్తున్నాడు—" అంది ఉమ.

"హంతకుడా? — ...." రాఘవరా వాశ్చర్య పడ్డాడు.

"అవును నాన్నా! నాలోని జ్ఞానతృష్ణను నీ వర్థం చేసుకోలేవు. అనుకున్న ప్రకారం చదువుకోకపోతే నేను చచ్చినదానితో సమానం. ఆ విధంగా చూస్తే ఇతడు హంతకుడే కదా!"

రాఘవరావు నవ్వి—"పొరబడ్డా వమ్మా! ఇతడు వంచకుడు కాదు. అన్నివిధాలా నీకు తగిన వరుడు. అత డికి నీ గురించి చెప్పాను. నీ ఆశయాలు, అభిప్రాయాలు— అన్నీ అతడికి నచ్చాయి—" అన్నాడు.

ఉమ ముఖం కొద్దిగా ఎర్రబడింది—"అయితే మా పెళ్ళి నా డాక్టరేటయ్యాక నేనని చెప్పావా?— .. " అంది.

"అతడికి బాగా డబ్బు సంపాదించాలనుంది. అందుకే ఆలేదేళ్ళదాకా పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదని చెప్పాడు. అప్పుడు నేనతడితో అమ్మాయి కూడా అలాగే అనుకుంటోంది. అలాంటప్పుడు మీరిద్దరూ నాముందు పెళ్ళి చేసుకుంటే తప్పేముందని అడిగాను. అతడు తన సంపా దన ధోరణిలో వుంటాడు. నువ్వు నా ఇంట్లోనే వుండి చదువు ధ్యాసలో వుంటావు— "

"అలాంటప్పుడు పెళ్ళెందుకు?"

"పెళ్ళి ఆడదానికి శ్రీరామరక్ష. మగాడికి బంధం. ఆశయసాధన కద్దు రానప్పుడు పెళ్ళి వాయిదా వేయడ మెందుకు చెప్పు?"

"ఆలోచించాలి నాన్నా!"

"అసలు నీ తరఫున నేనే ఆలోచించాలనుకున్నాను. ఛాతీలో యేదో నొప్పిలా వచ్చింది. డాక్టర్ దాన్ని గుండెనొప్పి అన్నాడు. నా మాట వినమ్మా—నువ్విక ఆలోచించడానికి వీల్లేదు— ...." అన్నాడు రాఘవ రావు.

ఉమ చటుక్కున తండ్రి కళ్ళలోకి చూసింది.

రాఘవరావు కళ్ళు దీనంగా అర్థిస్తున్నట్లుగా వున్నాయి. ఏమనుకుందో—"సరే—నాన్నా! మీరు

చెప్పినట్లే జరుగుతుంది—" అంది.

రాఘవరావు తృప్తిగా నిట్టూర్చాడు.

## 3

"రవి హత్య కేసులో ఇక అనుమానించ తగ్గదేమీ లేదు—" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్రావు.

"మీరు కేసు నెప్పుడూ యిలాగే ప్రారంభిస్తారు. అందుకే చివరకు మీకు మిగిలేవన్నీ అనుమానాలే!" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"సరే—అయితే ఒక్కసారి నేను చెప్పేదంతా శ్రద్ధగా వినండి...." అన్నాడు ఈశ్వర్రావు—"రవి సన్‌రైజ్ ఎలక్ట్రికల్ ప్రొడక్ట్సుకి సేల్సు ఇంజనీరు. అతణ్ణి రాఘవరావు తన ఇంటల్లుణ్ణి చేసుకోవాలనుకున్నాడు. సతీష్, నరేష్ రాఘవరావు ఇంటల్లుళ్ళు కావాలన్న దురాశ ఫలించక దురలవాట్లకు లోనయ్యారు. రవితో ఉమ పెళ్ళికి ఒప్పుకోగానే వాళ్ళు మానసికంగా షాక్ తిన్నారు. ఇద్దరూ కలిసి రవిని చంపాలనుకున్నారు. ఇద్దరిలోకీ ధైర్యవంతుడైన సతీష్ హత్యను చేశాడు.

హత్యాయుధం ఉక్కు కత్తి. దానిమీద సతీష్ వేలిముద్రలున్నాయి. అతడు మొన్న సాయంత్రం ఆరున్నరకు రవి గదికి వెళ్ళడం యెదురింటివాళ్ళు చూశారు. ఏడుంపావుకల్లా అతడా యింట్లోంచి బయటకు వచ్చాడు. అదీ ఎదురింటివాళ్ళు చూశారు. హత్య ఆరున్నరకూ యేడుంపావుకీ మధ్య జరిగింది. సతీష్ నేరం ఒప్పుకున్నాడు—...."

"ఇంకా చెప్పాల్సిన దేమైనా వుందా?" అన్నాడు వెంకన్న.

"ఈ ప్రశ్న నేనే మిమ్మల్నడిగా ననుకోండి—"

అన్నాడు ఈశ్వర్రావు.

వెంకన్న నవ్వి—"తెలివిగానే బదులిచ్చారు. అయితే మొత్తం వివరాలన్నీ నాకు పొల్లుపోకుండా చెప్పారు. ఆ చెప్పడంలో కేసు పటిష్టంగా వుందన్న నమ్మకం కంటే—నేనేదైనా అడ్డుపుల్ల వేస్తే వినాలన్న తపనే యెక్కువగా కనిపించింది నాకు—" అన్నాడు.

"అలాగే అనుకోండి. అడ్డుపుల్ల యేమయినా వేస్తారా?"

"అడ్డుపుల్ల వేయడం కాదు. అగ్గిపుల్ల గీస్తాను...."

"ప్రాస కోసం పాట్లు కవులకి. డిటెక్టివ్‌లకెందుకు?"

"నేను నిజం చెబుతున్నాను. మీ పరిశోధన కాగితాలను అగ్గిపుల్ల గీసి అంటించడం నిజం—...." అన్నాడు వెంకన్న గంభీరంగా.

"వెంకన్న గారూ—కాగితాల కెప్పుడూ డూప్లికేట్లుంటాయి. అందువల్ల అంటించి లాభంలేదు. ఇంతకూ మీరు చెప్పదల్చుకున్నదేమిటో చెప్పండి...." అన్నాడు ఈశ్వర్రావు నెమ్మదిగా.

"ముందు—ఒకే ఒక్క చిన్న విషయం చెబుతాను—...." అన్నాడు వెంకన్న—"సేల్సు ఇంజనీరు రవి యింటిలో మొత్తం నలుగురు మనుషులున్నారు. నలుగురూ ఆడవాళ్ళే! ఇంటాయన, కొడుకు పనిమీద ఊరెళ్ళారు. ఇంటాయన తల్లి, భార్య, కోడలు, కూతురు వున్నారు. వాళ్ళు నలుగురికీ వీధరుగులమీద కూర్చుని వచ్చేపోయేవాళ్ళను చూస్తూ కబుర్లు చెప్పుకునే అలవాటున్న మాట నిజం. అయితే నలుగురిలో ఒక్కరికికూడా వాచీ లేనిమాట కూడా నిజం—"

"నేను ప్రశ్నించినప్పుడు వాళ్ళలో ఇద్దరికి వాచీలున్నాయి——....” అన్నాడు ఈశ్వర్రావు.

"నిజమే. ఆ యింట్లో ఇద్దరాడవాళ్ళ చేతులకు వాచీలున్నాయి. అయితే ఆ రెండూ పని చేయడం లేదు——....”

"అయితే వాళ్ళు కచ్చితంగా టైమెలా చెప్పగలిగారు?”

"ఈ ప్రశ్న మీరు నన్ను కాక వాళ్ళ నడిగితే బాగుంటుంది....”

ఈశ్వర్రావు చిరాగ్గా——"నావల్ల పొరపాటయింది. మీ రడిగారా పోనీ!” అన్నాడు.

"అడిగాను. వాళ్ళ జవాబు చాలా ఫన్నీగా వుంది——....” వుంది.

ఈశ్వర్రావు కంగారుగా —— "చెప్పండి...!” అన్నాడు.

"వాళ్ళు రేడియో వింటున్నారుట. ప్రాంతీయ వార్తలు అయ్యాయుట. ఎదురింట్లోకి సతీష్ వెళ్ళాడుట. అప్పుడు రేడియోలో—సమయం ఆరున్నర కావస్తోంది——కొంచెం సేపట్లో గ్రామస్థుల గోష్ఠి వింటారు——అన్న ప్రకటన వచ్చిందట. కాసేపటికి సతీష్ బయటకు వచ్చేట్ట. అప్పుడు——వార్తలు ఇంతటితో సమాప్తం——అందిట రేడియో! దాన్నిబట్టి టైము యేడుంపావయిందని గ్రహించామన్నారు——”

"ఇందులో ఫన్నీ యేముంది?”

"ఫన్ తెలియాలంటే వాళ్ళ రేడియో చూడాలి. అందులో బ్యాటరీలు లేవు. అది కరెంటుతో కూడా పని చేస్తుంది కానీ వీధుగుగులమీద ప్లగ్ పాయింటు లేదు.

రేడియోను లోపలే వుంచుకుని విన్నారా అంటే—దాని సౌండు రెండడుగుల మేర దాటి వినిపించడం లేదు—"

"మీరు ట్రాన్సిస్టర్‌ని రేడియో అంటున్నారు—" అన్నాడీశ్వర్రావు.

"ఆ ఫన్ కూడా వాదికాదు. వారిదే. అయితే ఓ సందేహం! ట్రాన్సిస్టర్‌కీ, రేడియోకీ ఎంతో గొప్పగా తేడా చెప్పగలిగిన మీరు—వాళ్ళు టైమెలా చెప్పగలిగారో కూడా ఆలోచించగలిగి వుంటే?...." అని ఆగాడు వెంకన్న.

ఈశ్వర్రావు క్షణంపాటు మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా—"టైము గురించి నేనింత దూరం ఆలోచించలేదు. నావల్ల పొరపాటే జరిగింది. ఇంతకీ యీ కేసులో మీరింకా యేమయినా తెలుసుకున్నారా?" అన్నాడు.

"అది తర్వాత చెబుతాను. ఇప్పుడీ కేసు విషయంలో మీకు కొన్ని అనుమానాలు బయల్దేరాయో లేదో చెప్పండి—" అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ! ఒక్కమాట. సతీష్ నేరం ఒప్పుకున్నాడు. అతడి వేలి ముద్రలు హత్యాయుధంపై వున్నాయి—" అన్నాడీశ్వర్రావు. అయితే అతడి మాటలో దృఢత్వం లేదు.

"సతీష్ నేరం వెంటనే ఒప్పుకున్నాడా?"

"లేదు. వేలిముద్రలు తనవేనని తెలిశాకే ఆ విషయం ఒప్పుకున్నాడు...."

"అంతకుముందతడేమన్నాడు?"

"ఆ రోజు తానస లటువైపే వెళ్ళలేదన్నాడు.

అయితే అతడికి ఎలిబీ లేదు—" అన్నాడు.

"ఎలిబీ వుంది. చెప్పకపోవటానికి భయపడుతున్నాడంతే!"

"భయమా? ఉరికంబమెక్కడానికన్నా సిద్ధపడేటంత భయమా?" అన్నా డీశ్వర్రావు.

"ఈశ్వర్రావుగారూ! అన్ని సమయాల్లోనూ మనిషికి ప్రాణమొక్కటే విలువ కాదు...."

"అయితే అతనికున్న ఎలిబీ యేమిటి?"

"అదప్పుడే చెప్పను. మీరు మాత్రం కేసప్పుడే ముగిసిపోయిందనుకోకండి. తర్వాత భంగపడతారు. మీరు నాకు స్నేహితులు. అందుకే ముందుగా హెచ్చరిస్తున్నాను...."

"అసలు మీ కీ కేసుమీద ఆస క్తి యేమిటి?"

"అది కూడా అప్పుడే నేను మీకు చెప్పను...."

"ఇంతకీ హంతకు డెవరో తెలుసుకున్నారా?...."

"హంతకు డెవరు కాదో తెలుసుకున్నాను—...."

ఈశ్వర్రావు నవ్వి—"మీరిప్పుడేం చేయబోతున్నారు?" అన్నాడు.

"రవి యెదు రింటివాళ్ళు—సతీష్‌కి వ్యతిరేకంగా యెందుకు సాక్ష్యం చెప్పారో తెలుసుకోవాలి—...."

"వాళ్ళకు సతీష్, నరేష్ ఇద్దరూ బాగా తెలుసు. కానీ రవి హత్యకేసులో సతీష్ నిరికించాల్సిన అవసరం లేదు వాళ్ళకి—"

"లేకపోవచ్చు. కానీ అబద్ధమెందుకు చెప్పారో—చెప్పాల్సిన అవసరమేముంది వాళ్ళకి—...." అన్నాడు వెంకన్న.

ఈశ్వర్రావు ఆలోచనలో పడ్డాడు.

"ఎదిరింట్లో హత్య జరిగింది. ఆ సమయంలో సతీష్ ఆ యింట్లో వున్నట్టు సాక్ష్యమిస్తున్నారు వాళ్ళు. అది అబద్ధపు సాక్ష్యమని నేను ఋజువు చేయగలను. అయితే వాళ్ళు అబద్ధం చెప్పడానికి కారణా లూహించాలి. రవి హత్య వాళ్ళే చేసివుండాలి. లేదా హత్యగురించి వాళ్ళకు తెలిసుండాలి. లేదా హత్య జరిగేక వాళ్ళకు తెలిసి— సతీష్ నిందులో ఇరికించి వుండాలి. ఒకటి మాత్రం ఖచ్చితంగా నిజం. రవి, సతీష్ యిద్దరిలో ఒకరంటే వాళ్ళకు పగ వుంది—....." అన్నాడు వెంకన్న.

"మీరు కోడిగుడ్డుకు ఈకలు పీకుతున్నారని నా అనుమానం—" అన్నాడీశ్వర్రావు.

"ఈశ్వర్రావుగారూ-మీరు తొందరపడవద్దని హెచ్చరిస్తున్నాను. కోడిగుడ్డును తొందరపడి బద్దలు కొట్టక పోతే అందులోంచే ఈకలు పుట్టుకొస్తాయన్న విషయం మీకు తెలియంది కాదు గదా—....." అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ! నిర్దోషిని రక్షించడమే నా ఆశయం. అపరాధిని దండించడంలో నాకు తొందరున్న మాట నిజం. అపరాధిని నిర్ణయించడంలో తొందరపడ వని మీకు మాట యిస్తున్నాను—" అన్నాడు ఈశ్వర్రావు.

## 4

"కూర్చోండి...." అన్నాడు రాఘవరావు.

"నాకిక్కడ వ్యవధి లేదు. మిమ్మల్నర్జెంటుగా కొన్ని ప్రశ్నలడగాలి—" అన్నాడు వెంకన్న.

"అడగండి—" అన్నాడు రాఘవరావు.

"మీ మేనల్లుళ్ళిద్దరూ చిన్నప్పట్నించీ మీ వద్దనే

పెరిగారు వాళ్ళంటే మీకు చాలా అభిమానం వుండి వుండాలి. కానీ లేదు—ఎందుచేత?"

"ఎందుకు లేదు?" అన్నాడు రాఘవరావు.

"వాళ్ళలో ఒక్కణ్ని కూడా మీ రల్లుడిగా చేసుకో లేదు—...."

"శాస్త్రం ప్రకారం—అంటే విజ్ఞాన శాస్త్రం ప్రకారం దగ్గరి సంబంధాలు శ్రేయస్కరం కాదు—...."

"అయితే విజ్ఞానశాస్త్రం ప్రకారం—డ్రగ్సు గురించి మీ అభిప్రాయమేమిటి?"

"డ్రగ్సంటే?"

"ఉదాహరణకు బ్రౌన్ షుగర్ అనుకోండి....—"

"వాటి విషయం ఇప్పుడెందుకు?"

"మీ మేనల్లుళ్ళిద్దరూ డ్రగ్ అడిక్ట్స్. అంటే వాళ్ళ కేవో మానసిక సమస్యలుండి వుండాలి. వాళ్ళకు మానసిక సమస్యలేముంటాయి—మీ కారణంగా తప్ప—...." అన్నాడు వెంకన్న.

"ఇన్ని తెలుసుకున్నారు. వాళ్ళ మానసిక సమస్య లేమిటో తెలుసుకో లేదా?"

"తెలుసుకున్నాను...."

"ఏమిటవి?....—?" కుతూహలంగా అడిగాడు రాఘవరావు.

"వారి మానసిక సమస్యలను గురించి మీ రేమనుకుంటున్నారో చెప్పండి. ఆ తర్వాత నేననుకున్న విషయాలు చెబుతాను...."

"అసలు వాళ్ళకు మానసిక సమస్యలున్నాయనే నాకు తెలియదు—"

"మీకు తెలుసు...."

రాఘవరావు చిరాగ్గా — "మీరు నన్ను దబాయిస్తున్నారు—" అన్నాడు.

"దబాయించడం కాదు. మానసిక సమస్యలున్నవారే డ్రగ్ అడిక్ట్స్ అవుతారని మీకు తెలుసు.... మరి యే సమస్యలూ లేకుండానే మీ మేనల్లుళ్ళు డ్రగ్ అడిక్ట్స్ అయ్యారనుకున్నారా మీరు?"

"అసలు నాకు మా మేనల్లుళ్లు డ్రగ్ అడిక్ట్స్ అన్న విషయమే తెలియదు—...."

వెంకన్న నవ్వి—"మీరు నన్ను దబాయిస్తున్నారు-" అన్నాడు.

"నిజంగా వాళ్ళు డ్రగ్ అడిక్ట్సని నాకు తెలియదు—...."

"అయితే ముందు నేను మీవాళ్ళు డ్రగ్ అడిక్ట్సని చెప్పగానే మీ కెందుకు ఆశ్చర్యపోలేదు?"

"మీరు చెప్పిన మాటను నేను నమ్మలేదు—...."

"అపనమ్మకం ఆశ్చర్యానికి అడ్డురాదు— "

"ఆశ్చర్యం నా అలవాటుకాదు—...."

"పోనీ అసలు విషయానికి వస్తాను—మీ మేనల్లుళ్ళు మీకు తెలియకుండా మీ అమ్మాయిని డ్రగ్ అడిక్టగా మార్చారన్న విషయం కూడా మీకు తెలియదా?"

"ఏమిటీ? మా అమ్మాయి డ్రగ్ అడిక్టా? అసంభవం...." అన్నాడు రాఘవరావు కంగారుగా.

"ఇదే ఆశ్చర్యం.... ఇదే రియాక్షన్ మీ మేనల్లుళ్ళ గురించి విన్నప్పుడు కూడా మీలో కలిగివుంటే—నేను మీకు వాళ్ళ గురించేమీ తెలియదని నమ్మి వుండేవాణ్ని" అన్నాడు వెంకన్న.

"ఇంతకీ మీరేమంటారు?"

"మీ మేనల్లుళ్ళు డ్రగ్ అడిక్ట్సని మీకు తెలుసు. తెలియకపోతే ఇంతకాలం ఆ విషయం తెలుసుకోని మీరు వారిపట్ల బాధ్యతారహితంగా ప్రవర్తించినట్లే లెక్క. తెలుసుంటే వాళ్ళను మంచిదారికి మళ్ళించ డానికే ప్రయత్నమూ చేయకపోవడం ఘోరాపరాధం."

"డిటెక్టివ్ గారూ! ఓ వయసొచ్చేక కన్న కొడుకుని కూడా స్నేహితుడిగా భావించాలనుకునే తత్వం నాది."

"అదే—కన్నకొడుకులాగే మేనల్లుళ్ళని కూడా స్నేహితులుగా భావించారా మీరు?"

"మీకు సంజాయిషీ యిచ్చుకోవాల్సిన అవసరం నాకు లేదు—"

"సరే—మీ మేనల్లుళ్ళు డ్రగ్ అడిక్ట్సు కావడంవల్ల మీకు ప్రయోజనముందని నేను ఋజువుచేసిన రోజునే— మీరు నాకు సంజాయిషీ యిచ్చుకుందురుగాని—సెలవు" అంటూ లేచాడు వెంకన్న.

## 5

"హలో! నరసింహంగారేనా మాట్లాడుతూంట.... నేను....రాఘవరావుని మాట్లాడుతున్నాను...."

"రాఘవరావుగారా—నమస్కారం.... చెప్పండి.... విశేషాలేమిటి?"

"ఇప్పుడు డిటెక్టివ్ వెంకన్న నా దగ్గరకు వచ్చాడు. నా మేనల్లుళ్ళకు నేనేదో అన్యాయం చేసినట్లు మాట్లా డాడు...."

"ఊఁ."

"ఊఁ అని ఊరుకుంటారేమిటి? ఆ డిటెక్టివుకి చాలా విశేషాలు తెలిశాయి. ఎవరు చెప్పారంటారు?"

"మీ అనుమానం ఎవరిమీదుంది?"

"నరేష్‌మీద....?"

"ఊఁ."

"నరేష్‌దీ, సతీష్‌దీ ఒక్కటే ప్రాణం. సతీష్ ప్రాణాలు ప్రమాదంలో పడగానే నరేష్ డిటెక్టివుని కలిసి వుంటాడు...."

"అయితే?"

"అయితే అంటారేమిటీ—మీకు భయంగాలేదా?"

"నా భయం సంగతి నేను చూసుకుంటాను. మీ భయం సంగతి చెప్పండి ..."

"నాకేం భయం? ఇందులో నాదేం లేదు. నా మేనల్లుళ్ళని మీ చేతిలో పెట్టాను. మీరేం చేస్తున్నారో నాకు తెలియదు...."

"తెలుసు...."

"వ్యాపారంలో నాకు నెలకు యాభై వేల రూపాయ లిస్తానన్నారు. అంతే నాకు తెలుసు...."

"రాఘవరావుగారూ! మీ మేనల్లుళ్ళని — నెలకు యాభై వేల రూపాయలకోసం ఆశపడి నరసింహంలాంటి సమాజ విరోధికి అమ్మెయ్యడం దారుణం కదూ!"

"హలో—ఎవరది మాట్లాడుతూంట?" అన్నాడు రాఘవరావు కంగారుగా.

"నేను—డిటెక్టివ్ వెంకన్నను మాట్లాడుతూంట.."

"మీరా? మీరక్కడికెలా వచ్చారు?"

"మీ దగ్గరకు రావడానికి ముందే నేను నరసింహాన్ని కలుసుకున్నాను. ఆయన దగ్గర్నుంచి ఆట్టే రాబట్టలేక స్పృహ తప్పించి ఫోన్‌లో రిసీవర్ తీసి బైటపెట్టి మీ యింటికి వచ్చాను. మీరు వెంటనే ఆయనకు ఫోన్

చేస్తారని నాకు తెలుసు. నేను నరసింహాన్ని మళ్ళీ కలుసుకునేదాకా మీకు ఎంగేజి రింగు వస్తూండి వుంటుంది...."

"యూ ఆరే దేర్ డెవిల్!" అన్నాడు రాఘవరావు.

"నిర్దోషిని రక్షించే నిజం బైటపెట్టించడానికి— నేనెంతకైనా తెగిస్తాను. బీకేర్‌ఫుల్—" అని ఫోన్ పెట్టేశాడు వెంకన్న.

# 6

"మిస్టర్ నరసింహంగారూ! మిమ్మల్నిలా బలవంతం చేయాల్సి వచ్చినందుకు నాకూ బెంగగానే వుంది. కానీ మీరు నాకు నిజం చెప్పలేదనడానికి రాఘవరావు మాటలే ఋజువు. మీ చేత కక్కించిన నిజం నా దగ్గరైతే భద్రంగా వుంటుంది. లేకుంటే పోలీసులు రంగంలోకి దిగుతారు...." అన్నాడు వెంకన్న.

నరసింహం వెంకన్న వంకే చూస్తున్నాడు.

ఆ ఇల్లు తను తన కార్యకలాపాలకోసం ప్రత్యేకించుకున్నాడు. తన భార్యాబిడ్డలే ఆ యింట్లో అడుగుపెట్టడానికి సాహసించరు. ఆ యింట్లో యెలాంటి పరిస్థితుల్లోనూ తను కలుసుకుందుకు వీల్లేదు. ఇంటి గుమ్మందగ్గర ముగ్గురు కాపలావాళ్ళు వంతులవారీన రోజంతా కాపలా వుంటారు. వాళ్ళెవరినీ లోపల అడుగుపెట్టనివ్వరు.

వాళ్ళను దాటివెడితే ఓ గది వస్తుంది. అందులో ఉత్తమశ్రేణికి చెందిన అల్సేషియన్ డాగ్ వుంది. కాపలావాణ్ణికూడా తన గదిలో అడుగుపెట్టనివ్వదు. దానికి తిండిపెట్టేటప్పుడు కూడా కాపలావాడు బయట వుంచి ఈలవేస్తాడు. కుక్క తిండితిని వెళ్ళిపోతుంది. కుక్కను షికారు తిప్పేవాడు కూడా గది బయట

నిలబడి ఈలవేస్తాడు. అప్పుడది వాడితో వెడుతుంది.

ఒక్క నరసింహం తప్ప మరెవ్వరూ దాని గదిలోకి వెళ్ళడానికి సాహసించరు. నరసింహాన్నదేమీ చేయదు.

కాపలావాడి మాటను కాదన్నవాడికి కుక్క గురించిన హెచ్చరిక అందదు. కుక్క కూడా తన గదిలో అడుగు పెట్టినవాడిని మొరుగుతో హెచ్చరించదు. మెరుపు దాడి చేస్తుంది.

అందుకే నరసింహానికి ఆ యింట్లో తన కార్యకలాపాలు కొనసాగించడమెంతో సులభం. రోజూ కొన్ని గంటలసేపాయన అక్కడే గడుపుతాడు.

ఈరోజు వెంకన్న యింట్లో అడుగు పెడుతూనే కాపలావాడిని కరాటే దెబ్బతీసి స్పృహ తప్పించాడు. అతడిపై మెరుపుదాడిచేసిన కుక్క కేమయిందో స్పృహ తప్పి పడిపోయింది. ఆ తర్వాత తనను కలిసి—అడగ కూడని ప్రశ్నలే అడిగాడు. తనకేమీ తెలియదని దబాయించాడు. అప్పుడీ వెంకన్న తనను కూడా స్పృహ తప్పించాడు.

ఇప్పుడు తిరిగివచ్చి రాఘవరావు ఫోన్ తనే అందుకున్నాడు.

చాలా పకడ్బందీగా తెలివిగా పథకం వేశాడు.

ఇతడి శక్తిని తక్కువ అంచనా వేయడం తనకే ప్రమాదం.

"అడగండి—చెబుతాను—" అన్నాడు నరసింహం,

"మీ కారణంగా సతీష్, నరేష్ డ్రగ్ అడిక్ట్సు అయ్యారు. వాళ్ళను మీరలా ఎందుకు తయారుచేశారు?"

"నమ్మకంగా పనులు చేసిపెట్టడానికి డ్రగ్ అడిక్ట్సును మించినవారు లేరు. నా వద్ద అలాంటివారు యాభైమంది

దాగా వున్నారు—"

"డ్రగ్సు అలవాటు చేయడం చట్టరీత్యా నేరం. మీకా విషయం తెలుసా?"

"చట్టాన్ని పరిరక్షిస్తారని ప్రజలెన్నుకున్న నాయకుల అండ నాకుంది—" అన్నాడు నరసింహం.

"అలాంటప్పుడు బహిరంగంగానే ఈ పని చేయొచ్చుగా. రహస్యంగా యెందుకు చేస్తున్నారు?"

"నేరాలు బహిరంగంగానే జరుగుతున్నాయి. ప్రజలకు వాటిపై ఆసక్తి లేదు...."

"అది మీ పొరపాటు అభిప్రాయం "

"అయితే బోఫార్స్, ఫెయిర్ ఫాక్స్ సబ్ మెరీన్ డీల్ వగైరా వ్యవహారాల్లో రహస్యమేమైనా వుందా? పత్రికల ఘోషే తప్ప ప్రజలేమైనా పట్టించుకున్నారా? ప్రముఖ రాజకీయనాయకులెవరైనా పదవినుంచి తప్పుకున్నారా?"

శంకరన్న తడబడి—"అది పదవికోసం ప్రాకులాట. మీరు చేస్తున్నది ప్రజల ప్రాణాలతో ఆట—" అన్నాడు.

"అయితే భోపాల్లో గ్యాసు లీకు సంగతేమిటి? అందులో రహస్యమేముంది? నష్టపోయిన ప్రజలకు న్యాయం చేకూర్చడానికి—ఎన్ని ఏళ్ళు పడుతుంది? కోర్టులో వాదనలు ప్రజల కష్టాలు తీరుస్తాయా?"

"అందుకని యథాశక్తి మీరూ ప్రజలకన్యాయం చేస్తున్నారన్నమాట."

"నేను నాకు న్యాయం చేసుకుంటున్నాను. అందువల్ల ఇతరుల కన్యాయం జరిగితే అది వారి కర్మ-" అన్నాడు నరసింహం.

నరసింహం, వెంకన్న ఒకరి ముఖాలొకరు తీవ్రంగా చూసుకున్నారు.

దేశానికి, ప్రజలకు జరుగుతున్న అన్యాయం గురించిన ఆందోళన, ఆవేశం వెంకన్న ముఖంలో ప్రస్ఫుటమవుతోంది.

కార్యదీక్ష, ఇతరుల గురించిన నిర్లక్ష్యం, తనకేమీ ప్రమాదం లేదన్న నమ్మకం—నరసింహం ముఖంలో కనబడుతున్నాయి.

ఇద్దరూ ఒకరి భావాలనొకరగ్గం చేసుకున్నారు.

"నరసింహంగారూ! సతీష్ నా క్లయంటు. అతణ్ని రక్షించడం నా బాధ్యత. అతడీహత్య చేయలేదని మీరు నిరూపిస్తే నేను మీ జోలికి రాను—లేదా మిమ్మల్నీ మీ సంసనూ సమూలంగా నాశనం చేస్తాను...." అన్నాడు వెంకన్న.

"మా జోలికి వస్తే దేశం పునాదులు కదిలిపోతాయి" అన్నాడు నరసింహం నిర్లక్ష్యంగా.

"దేశం పునాదులు తమలోనే ఉన్నాయని మీకులా భ్రమపడినవారు చాలామంది ఉన్నారు. కానీ దేశం శాశ్వతం. మీరు అశాశ్వతం. అది కూడా నేను ఋజావు చేయగలను...."

"ఎలా?"

"ఇంకో గంటలో ఈ ఊళ్ళో యెక్కడెక్కడి మాదకద్రవ్యాలనూ పోలీసులు స్వాధీనం చేసుకుంటారు. వాటిని సరఫరా చేసే సామాన్యులందరూ కూడా పట్టుబడతారు. అంటే తాత్కాలికంగా మీ యంత్రాంగం స్తంభించిపోతుంది...."

నరసింహం నవ్వి—"అది అసాధ్యం—" అన్నాడు.

"ఇంకా గంట టైముంది. అంతవరకూ నేనిక్కడే వుంటాను ..." అని తనూ నవ్వాడు వెంకన్న.

"నాకు చాలా పనులున్నాయి. మీరిక్కడుంటే నాకిబ్బంది...."

"మీకిబ్బంది కలిగించాలనే నేనిక్కడున్నాను—" అన్నాడు వెంకన్న.

నరసింహం టైము చూసుకున్నాడు. గడియారం ఆగిపోయినట్లుంది కాని తిరుగుతోంది.

"మీకు బోరుగా వుంటే నేనడిగే ప్రశ్నలకు జవాబు చెప్పండి. కాలక్షేపంగా వుంటుంది....—" అన్నాడు వెంకన్న.

నరసింహం మాట్లాడకుండా కుర్చీలో వెనక్కి జారగిలబడి కళ్ళు మూసుకున్నాడు.

"గంటయింది. కళ్ళు తెరవండి—" అని వెంకన్న అన్నాకే ఆయన కళ్ళు తెరిచాడు.

"ఇప్పుడు ఒకటీ రెండూ మూడూ నాలుగూ అయిదు-నెంబరుకు ఫోన్ చేయండి—" అన్నాడు వెంకన్న.

నరసింహం ఉలిక్కిపడి—"ఆ నంబరు మీకెలా తెలుసు?" అన్నాడు.

"ఫోన్ చేయండి—" అన్నాడు వెంకన్న.

నరసింహం నంబరు తిప్పాడు.

"హలో—ఎవరూ మాట్లాడుతూంట?" అందకతలి గొంతు.

"నేను నరసింహాన్ని. సింహాద్రితో మాట్లాడాలి...."

"సింహాద్రిని కాసేపటి క్రితం పోలీసులు తీసుకెళ్ళారు. ఇంట్లో మాదకద్రవ్యాలున్నాయి. ఇంతకీ మీరెవరు?"

నరసింహాం చటుక్కున ఫోన్ పెట్టేశాడు. ఆయన ఒంటికి చెమటలు పట్టాయి.

"ఇప్పుడు ఒకటి రెండూ మూడూ అయిదూ నాలుగుకు ఫోన్ చేయండి—"

నరసింహాం కంగారుగా అతడివంక చూసి—"మీ కింకా యిలాంటి నెంబర్లెన్ని తెలుసు?" అన్నాడు.

"మీకు తెలిసినవన్నీ కాక—మరో మూడు...—"

"నాకు తెలిసిన వెన్ని?"

"పదకొండు— ...."

నరసింహాం ఆశ్చర్యంగా—"ఇవన్నీ మీ కెలా తెలుసు?" అన్నాడు.

"చాలా సింపుల్. మిమ్మల్ని నడిపించే దెవరో మీకు తెలియదు. నాకు తెలుసు— ...."

"ఎవరతడు?"

"అతడు చాలా తెలివైనవాడు. ఒక మంత్రి మిమ్మల్ని నడిపిస్తున్నట్లు మిమ్మల్ని భ్రమపెట్టాడు. నమ్మించాడు. కానీ నిజానికా మంత్రికేమీ తెలియదు. అతడు పదవిలోకి వచ్చి పదిహేను నెలలయింది. ఆ పదవి ఇంకా యెన్నాళ్ళుంటుందో అతడికే తెలియదు. అతడిలో ప్రస్తుతానికి నిజాయితీ వుంది. అతడు మీకు సహకరించడు. సహకరిస్తా డనుకుంటే మీరు మోసపోతారు— ...."

"నే నిప్పుడేం చేయాలి?"

"కేసును వెనక్కు తిప్పాలి—"

"ఏ కేసు?"

"సేల్సు ఇంజనీరు రవి హత్య కేసు— ...."

"ఆ కేసుకీ నాకూ సంబంధ మేమిటి?"

"అదే మీరు నాకు చెప్పాలి— ...."

"నేనేం చెప్పగలను? అత డెవరో నాకు తెలియదు—...."

"నరసింహంగారూ! మీకు తెలియనివి కూడా నేను మీ చేత చెప్పించగలను. తెలిసినవి చెప్పించలే ననుకున్నారా?" అన్నాడు వెంకన్న గంభీరంగా.

నరసింహం మాట్లాడలేదు.

వెంకన్న మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు—"రవి యెదురింట్లో జానకమ్మ వుంటోంది. జానకమ్మ తన మనుమరాలిని సతీష్‌కిచ్చి పెళ్ళి చేయాలనుకుంది. సతీష్ నిరాకరించాడు. అందుకని ఆ కుటుంబానికి సతీష్ అంటే కొంత కోపముంది. ఆ కోపం సతీష్‌ని హంతకుడిగా నిరూపించాలనుకునేంత కాదు. మీరా కుటుంబానికి పాతిక వేలిచ్చి తప్పుడు సాక్ష్యం పలికించారన్నవిషయం నా అసిస్టెంట్సు తెలుసుకున్నారు. ఆ విధంగా మీ గురించి నాకు తెలిసింది—"

"కానీ రవితో నాకు సంబంధ మేమిటి?" అన్నాడు నరసింహం మొండితనం వదిలిపెట్టకుండా.

"రవి హత్య సతీష్ చేశాడని మీరెందుకు నిరూపించాలనుకున్నారో చెప్పండి. నేను రవికీ మీకూ సంబంధాన్నూహిస్తాను—...."

నరసింహం మాట్లాడలేదు.

"మిస్టర్ నరసింహం! మీ కిప్పుడు రెండు బంగళాలున్నాయి. బ్యాంకులో ఆరు లక్షలున్నాయి. ఉద్యోగం చేస్తున్న కొడుకు, వివాహమైన కూతురు, మీరే ప్రాణంగా జీవిస్తున్న భార్య వున్నారు. ఇంతవరకూ మీరు చేసిన తప్పులన్నీ క్షమించబడతాయి. హాయిగా, బుద్ధిగా జీవించవచ్చు. అందుకోసం మీకు తెలిసిన నిజాలన్నీ నాకు

చెప్పండి, లేదా జైలుకు వెళ్ళవలసి వుంటుంది. లేదా—....

"ఒక్కసారిగా మాదక ద్రవ్యాలు, అనుచరులు పట్టుబడ్డారంటే—మీలో యెవరో నమ్మకద్రోహం చేశారనే అర్థం. మిమ్మల్నందర్నీ నడిపించే నాయకుడు నిజం తెలుసుకుందుకు నా దగ్గరకు వస్తాడు. అతడికి నేను మీ పేరు చెప్పగలను—...." అన్నాడు వెంకన్న.

"వద్దు—" అన్నాడు నరసింహం భయంగా.

జైలుశిక్ష కంటే కూడా నరసింహం తన నాయకుడికి యెక్కువ భయపడతాడని వెంకన్నకు తెలుసు.

"మీకూ—రవికీ వున్న సంబంధం చెప్పండి—"

"రవి నన్నూ రాఘవరావునూ బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు—" అన్నాడు నరసింహం నెమ్మదిగా.

"ఎందుకని?"

"నిజంగా మీకు తెలియదా?"

"తెలియదు—...."

"నా గురించి యెన్నో తెలుసుకున్నారు. ఇది తెలుసుకో లేదా?"

"తెలిసినవాటితో తెలియనివి తెలుసుకోవడం నా పద్ధతి. ఇప్పుడా పద్ధతే వుపయోగిస్తున్నాను—" అన్నాడు వెంకన్న.

నరసింహానికి వెంకన్న మాటలో హెచ్చరిక అర్థమయింది. ఆయన నెమ్మదిగా రవిని గురించి చెప్పసాగాడు.

రవి రాఘవరావుకు దూరపు బంధువు. అతడు తన్నుతాను ఫలానా అని రాఘవరావుకు పరిచయం చేసుకున్నాడు. రాఘవరావు వెంటనే అతడి గురించి వాకబు

చేశాడు.

రవికి చాలా దురలవాట్లున్నాయి. ముఖ్యంగా అతడికి మదిర, మదవతి ప్రతిరోజూ కావాలి.

రవి రాఘవరావు కూతురు ఉమను పెళ్ళి చేసుకుంటా నన్నాడు. రాఘవరావు నిరాకరించాడు. రవి తాత్కాలి కంగా ఊరుకున్నాడు. అతడు రాఘవరావుపై నిఘావేసి కొన్ని రహస్యాలు తెలుసుకున్నాడు.

రాఘవరావుకు బట్టల వ్యాపారంలో ఇటీవల బాగా నష్టం వస్తోంది. గత మూడు సంవత్సరాలుగా ఆయన నష్ట పోతూనే వున్నాడు. లోపం యెక్కడుందో తెలి యడంలేదు. ఆయనకు యేడాదిలో మూడులక్షల రూపా యల అప్పు తేలింది. మరుసటి సంవత్సరం కూడా అదే కొనసాగింది. ఆయన నరసింహందగ్గరకు అప్పుకు వెళ్ళాడు. నరసింహం ఆయనకు స్నేహితుడు. స్నేహితులు కష్టాల్లో వున్నప్పు డాయన ఆదుకుని భాగస్వాములుగా చేసుకుం టూంటాడు. నరసింహం రాఘవరావు వ్యాపారంలో నెల నెలా వచ్చే నష్టం తను భరించి—యాభై వేల రూపాయలు నెల నెలా యిస్తానని చెప్పాడు. అదీ అప్పుగా కాదు. తనకు నమ్మకస్థులైన ఇద్దరు మనుషులు కావాలి. ఆ మనుషుల్ని సరఫరా చేస్తే అందుకు నర సింహం ఇచ్చే ప్రతిఫల మిది.

ఆ మనుషుల నేం చేస్తాడని రాఘవరావు నరసింహాన్నడి గాడు!

వాళ్ళను డ్రగ్ అడిక్ట్సుగా మార్చి స్మగ్లింగు కుపయో గించుకుంటానని నరసింహం రాఘవరావుకు చెప్పాడు. రాఘవరావు తటపటాయించాడు. నరసింహం ఆయన్ను తటపటాయించవద్దన్నాడు.

మూడు సంవత్సరాల కాంట్రాక్టు. ఈలోగా రాఘవ రావు తన వ్యాపారంలో నిలదొక్కుకోవాలి. కానీ ఆయన మేనల్లుళ్ళు డ్రగ్సు వదలలేని స్థితి యేర్పడు తుంది.

రాఘవరావు నరసింహాన్ని మరీ మరీ అడిగాడు— డ్రగ్ అడిక్ట్సుగా మార్చకుండా వీలుపడదా అని!

నేరాలకు డ్రగ్ అడిక్ట్సు సహాకరించినట్లు మరెవ్వరూ సహాకరించలేరు. ఒకసారి డ్రగ్స్‌కు అలవాటు పడ్డ వ్యక్తి—డ్రగ్ కోసం హాత్య చేయమన్నా చేస్తాడు.

సతీష్, నరేష్ బ్రౌన్ సుగర్‌కు అలవాటుపడి నర సింహాం తొత్తులయ్యారు. వారి కారణంగా నరసింహాం ప్రతినెలా లక్షలకు లక్షలు లాభాలార్జిస్తున్నాడు.

ఈ విషయం రవి కనుక్కున్నాడు. సతీష్, నరేష్‌ల నేరాల్లో రాఘవరావుకు భాగముందన్న విషయాన్నతడు ప్రపంచానికి తెలియజేస్తానన్నాడు. అలా తెలియజేయ కూడదనుకుంటే—రాఘవరావు ఉమను రవికిచ్చి పెళ్ళి చేయాలి. రాఘవరావు తన సమస్యను నరసింహానికి చెప్పు కున్నాడు.

నరసింహాం రవిని బెదిరించాడు. అప్పుడు రవి నర సింహానికే యెదురుతిరిగాడు. అతడికి నరసింహాం గురించిన రహాస్యాలూ తెలుసు. అవి బయట పెట్టే ధైర్యమూ వుంది.

రవి నరసింహానికీ సమస్య అయ్యాడు. నరసింహాం రవిని చంపడానికి గూండాల సాయం కోరాడు.

రవికి చాలామంది గూండాలతో పరిచయముంది.

గూండాలు రవిని హెచ్చరించారు.

రవి నరసింహాన్ని కలుసుకుని—"మీరు నన్ను చంపా

అనుకున్నట్లు గూండాలద్వారా నాకు సమాచారమందింది. ఈ సమాజంలో మీ పద్ధతులు మీవి. నా పద్ధతులు నావి. రెండూ నేరాలకు సంబంధించినవే! చట్టవిరుద్ధమైనవే! అలాంటప్పుడొకరినొకరు తప్పు పట్టుకుని ప్రయోజన మే ముంది? నేను మీ జోలికి రాను. మీరు నా జోలికి రాకర్దు. నేను రాఘవరావుగారి కూతుర్ని చేసుకుంటే మీ కేం నష్టం? అన్యాయంగా నన్ను చంపడానికి గూండాలు కూడా ఒప్పుకోరు—" అన్నాడు.

నరసింహం రవికి స్నేహితుడయ్యాడు.

రాఘవరావు నరసింహం దగ్గర గోల పెట్టాడు.

"రవి బలవంతుడు. ప్రత్యేకించి అతడు నా జోలికి వస్తే తప్ప నేనతణ్ణేమీ చేయను. అతడు నా స్నేహాన్ని కోరాడు. సువ్వతణ్ణి అల్లుణ్ని చేసుకోవడం మంచిది—" అన్నాడు నరసింహం.

"చస్తే నేను వాణ్ని అల్లుణ్ని చేసుకోను—" అన్నాడు రాఘవరావు.

"నేను రవిని చంపడం, చంపించడం కుదరదు. పోనీ నీ మేనల్లుళ్ళ చేత హత్య చేయించకూడదూ?" అన్నాడు నరసింహం.

"వాళ్ళచేత నా స్వార్ధంకోసం హత్య చేయించలేను. ఇప్పటికి వాళ్ళకు జరిగిన అన్యాయం చాలు—" అన్నాడు రాఘవరావు.

"వాళ్ళిప్పుడు జీవచ్ఛవాలతో సమానం. నా మాటలు విని వాళ్ళను హత్య కుపయోగించుకో—" అన్నాడు నరసింహం.

రాఘవరావు పూర్తిగా నిరాకరించాడు. నరసింహం చివరికో ఉపాయమాలోచించేడు. ఆ ప్రకారం హత్య

కేర్పాట్లు నరసింహం చేస్తాడు. సతీష్, నరేష్‌లు రవిని చంపాలనుకుంటున్నట్టు ప్రచారమవుతుంది. సతీష్, నరేష్‌ల నుంచి తన్ను తానెలా రక్షించుకోవాలో రవికి తెలుసు. అతడు వారి గురించి జాగ్రత్తపడుతూంటాడు. అప్పుడు నరసింహం మనిషి రవిని హత్య చేస్తాడు. తనే హత్య చేసినట్లు సతీష్ అంగీకరిస్తాడు. సాక్ష్యా లేర్పాటవుతాయి. ఆధారాలు సృష్టించబడతాయి.

"ఇందువల్ల రాఘవరావు సాధించిన దేముంది? కొనల్లుడిచేత హత్య చేయించనన్నవాడు—అతణ్ని హంతకుడిగా నిరూపించబోతున్నాడు. ఇది దారుణం—" అన్నాడు వెంకన్న అంతా విని.

"హత్యాయుధంమీద సతీష్ వేలిముద్ర లుండవచ్చు. కానీ సతీష్ ఆ సమయంలో డ్రగ్ అడిక్ట్స్ మధ్య డ్రగ్స్ సేవిస్తూ వుంటాడనడానికి తిరుగులేని ఋజా వుంటుంది. హంతకుడు సతీషేనని ఋజావు చేయడం చాలా కష్టం-" అన్నాడు నరసింహం.

"అయితే?"

"సతీష్‌ని రక్షించడానికి రాఘవరావు తన తంటాలు తను పడతాడు. బాగా పేరున్న లాయర్ని వినియమిస్తాడు—...."

"కానీ ఆయనలాంటిదేమీ చేయలేదు ...."

"మీరు రంగంలోకి దిగడానికాయనే కారణమని నా అనుమానం. తన మేనల్లుళ్ళంటే ఆయనకు చాలా అభిమానం. కాని ఫలితమాయన ఊహించినట్టు లేదు.... తీగ లాగితే డొంకంతా కదిలింది—...." అన్నాడు నరసింహం.

వెంకన్న ఆశ్చర్యంగా—"నన్ను రాఘవరావుగారే

నియమించారంటే నేను నమ్మలేను—...." అన్నాడు.

"నేను నమ్మగలను—" అన్నాడు నరసింహం.

"ఇంతకీ సతీష్‌నెలా రక్షిస్తారు మీరు?" అన్నాడు వెంకన్న తన టాపిక్‌లోకి వస్తూ.

"రవిని గంగులు చంపాడు. గంగులు ప్రొఫెషనల్ గూండా. వాడు చాలా హత్యలు చేశాడు. హత్య చేసి దొరికినప్పుడల్లా వాణ్ని జైల్లో వేయడం—వాడు జైలు నుంచి తప్పించుకోవడమూ జరుగుతోంది. వాడింకోసారి పోలీసులకు దొరుకుతాడు. అంతే!" అన్నాడు నరసింహం.

"అయితే వెంటనే అసలు విషయం పోలీసులకు చెప్పండి. సతీష్‌ని విడిపించండి—..." అన్నాడు వెంకన్న.

"విడిపిస్తాను. అతడు నాకు సమర్థుడయిన అను చరుడు—...." అన్నాడు నరసింహం.

"నరసింహంగారూ! ఈ కేసు పూర్తికాగానే మీరు సతీష్, నరేష్‌ల గురించి మర్చిపోవాలి. మీరు మాదక ద్రవ్యాల స్మగ్లింగు గురించి కూడా మర్చిపోవాలి—" అన్నాడు వెంకన్న.

"అదెలా సాధ్యం?"

"ఈ ప్రపంచంలో ఎలాంటి నేరాన్నయినా నేను క్షమించగలను. ఆఖరికి హత్యను కూడా సమర్థించగలను. కానీ మాదకద్రవ్యాలతో వ్యవహరించేవాళ్ళని క్షమించ లేను. మీ తప్పు సవరించబడింది. ఇక తప్పు చేయకండి-" అంటూ లేచి నిలబడ్డాడు.

"వెంకన్నగారూ! మరొక్క సందేహం. నా పక్క గదిలో ప్రవేశించినవారికి క్షణం కూడా అవకాశమివ్వదు.

మీరు దాని బారినుంచెలా తప్పించుకుని రాగలిగారు?" అన్నాడు నరసింహం.

"కొన్ని విషయాలు రహస్యంగానే వుండడం మంచిది—" అని వెంకన్న అక్కణ్ణించి కదిలాడు.

## 7

"విశేషాలేమైనా వున్నాయా—?" అన్నాడు వెంకన్న.

"ఇప్పుడే ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్రావుగారు ఫోన్ చేశారు. సతీష్, నరేష్‌లను వైద్యపరీక్షకు పంపారుట. వాళ్ళకు డ్రగ్స్, ఆల్కహాలు, ఆఖరికి స్మోకింగు కూడా అలవాటు లేదని తెలిసిందట—...." అంది పద్మావతీదేవి.

వెంకన్న తెల్లబోయి "అదెలా సాధ్యం—...." అన్నాడు.

"ఏమో—ఆయన చెప్పింది మీకు చెప్పాను—" అంది పద్మావతీదేవి.

"ఇంకేమయినా చెప్పాడా?"

"బహుశా సతీష్‌ని విడిచిపెట్టవచ్చునన్నాడు."

వెంకన్న వెంటనే "నేను అర్జంటుగా రాఘవరావుని కలుసుకోవాలి. ఆయన నాకు కొన్నిఅబద్ధాలు చెప్పాడు" అన్నాడు.

"అబద్ధాలు చెప్పింది నరేష్—రాఘవరావు కాదు—" అంది పద్మావతీదేవి.

"నా దగ్గరకు నరేష్ వచ్చినమాట నిజం. సతీష్‌ని రక్షించమని అడిగిన మాట నిజం. కానీ ఇదంతా అతడు తనకుతానై చేయలేదు. రాఘవరావు చేయించాడు. అందులో నాకేమీ సందేహం లేదు—" అన్నాడు

వెంకన్న.

"ఎందుకు?"

"అది తెలుసుకుందుకే నేను రాఘవరావింటికి వెళ్ళాలి—...."

వెంకన్న కదలబోతూంటే—"ఇలా వచ్చి అలా వెళ్ళిపోతానంటున్నారు. అంత హడావుడెందుకు! రాఘవరావింట్లో కుక్క లేదుగా. కనీసం ఆ డ్రస్సు మార్చుకుని వెళ్ళండి—" అంది పద్మావతిదేవి.

"అవును. బాగానే చెప్పావు. కుక్క గురించి నరేష్ ముందుగానే హెచ్చరించాడు కాబట్టి ప్రత్యేకమైన ఈ డ్రస్ వేసుకున్నాను. ఇప్పుడిక దీని అవసరం తీరి పోయింది—" అంటూ డ్రస్సు మార్చుకున్నాడు వెంకన్న.

వెంకన్న వేసుకున్న డ్రస్సు లోపల ప్రత్యేకమైన స్పాంజి వుంది. మొత్తం పాంటు, చొక్కా అంతా వెనుక స్పాంజితో నిండి వుంటుంది. శరీరానికా స్పాంజి తగులుతూంటే యెంతో హాయిగా వుంటుంది. కుక్క అతణ్ని కరిచినా స్పాంజిని ఛేదించుకొని అతడి శరీరాన్ని తాకలేదు. స్పాంజిలో వుండే ఓ ప్రత్యేక రసాయనం కుక్క శరీరంలో ప్రవేశించి దానికి వెంటనే స్పృహ తప్పుతుంది. వెంకన్న చేతులకుకూడా ఆ స్పాంజి వున్న గ్లోవ్స్ వేసుకున్నాడు. ఆ డ్రస్సు బయటకు చూడ్డానికి మామూలుగానే వుంటుంది.

వెంకన్న తన డ్రస్సు మార్చుకుని—"నా అసిస్టెంట్స్ ఏరీ?" అనడిగాడు.

"వాళ్ళను ప్రత్యేకమయిన పని మీద పంపాను....—"

"ఏమిటది?"

"మీకు గుర్తుందో లేదో— నేను ఈ రోజు కాపు రానికి వచ్చినరోజు. ఇది ప్రత్యేకంగా జరుపుకోవాలని మల్లెపూలు తెమ్మని పంపాను. యెలాగో అలా సాధించుకురావాలని వాళ్ళకు మరీ మరీ చెప్పాను— ...."

"కానీ ఈ సీజన్లో మల్లెపూలెక్కడ దొరుకుతాయి?" అన్నాడు వెంకన్న.

"ఆ సంగతి నాకూ తెలుసు. వాళ్ళకీ తెలుసు. మీకే తెలియడంలేదు— ...."

"అంటే?"

"వాళ్ళకీరోజు సెలవిచ్చేశానని అర్థం చేసుకున్నారు వాళ్ళు. మీరే అర్థం చేసుకోకుండా ఇంకా రాఘవరావింటికి వెడతానంటున్నారు— ...."

వెంకన్న చటుక్కున భార్యవంక చూశాడు.

ఆమె మల్లెపూవులాంటి చీర కట్టుకుని తనే మల్లెపూవులా వెలిగిపోతోంది. ఆమె యే సెంటు రాసుకుందో కానీ వంటి నుంచి కూడా మల్లెల పరిమళం వస్తోంది.

"ఇంకా నీకు మల్లె లెందుకు....?" అన్నాడు వెంకన్న.

"ఏమో— హత్య కేసు పూర్తయినా మీ రింకా రాఘవరావింటికి వెడతా నన్నట్లే— నాకూ మల్లెలు కావాలనిపించింది—" అంది పద్మావతీదేవి.

"నువ్వు చాలా తెలివైనదానివి. నేనిక రాఘవరావింటికి వెళ్ళడంలేదు. ఫోన్ చేసి వస్తా—" అన్నాడు వెంకన్న.

వెంకన్న ఫోన్ తీశాడు. నెంబరు తిప్పి—"హాలో రాఘవరావుగారేనా— నేను— వెంకన్నని— ...."

అన్నాడు.

"వెంకన్నగారూ! నరసింహం నాకంతా చెప్పాడు. కదిలిన డొంక నలాగే వుంచి మా పేర్లేమీ బయటకు రాకుండా హత్య కేసులోంచి సతీష్‌ని తప్పించినందుకు కృతజ్ఞతలు—" అన్నాడు రాఘవరావు.

"థాంక్స్ చెప్పేముందు మీతో విషయం చెప్పాలి. మీ మేనల్లుళ్ళిద్దరూ కూడా డ్రగ్ అడిక్ట్స్ కాదని వైద్య పరీక్షలో తేలింది. మిమ్మల్ని నే ననవసరంగా అనుమానించాను. కానీ యెంతాలోచించినా మీకూ నరసింహానికీ మధ్య యేం జరిగిందో నే నూహించలేకపోతున్నాను—" అన్నాడు వెంకన్న.

"నా మేనల్లుళ్ళు రత్నమాణిక్యాలు వెంకన్నగారూ! వ్యాపారంలో నాకు వచ్చిన నష్టం గురించి విని వాళ్ళు నా కోసం యేమైనా చేస్తామన్నారు. నరసింహం గురించి పూర్తిగా వారికి చెబితే వాళ్ళు నాకు ధైర్యం చెప్పారు. డ్రగ్స్ తీసుకోవలసి వుంటుందని వాళ్ళకు ముందుగా నే తెలుసు. కానీ వాళ్ళు డ్రగ్స్ తీసుకోకుండా నే డ్రగ్ అడిక్ట్స్‌గా నటించారు. ఎక్కడా నరసింహానికి అనుమానం రానివ్వలేదు. డ్రగ్స్ కోసమన్నట్లు ప్రాణాలకు తెగించి యే పనైనా చేసేవారు. డ్రగ్ అడిక్ట్స్ కావడం కంటే—డ్రగ్ అడిక్ట్స్‌గా నటించడం యెంతో కష్టం. అది వాళ్ళు అవలీలగా సాధించారు...."

వెంకన్న ఆశ్చర్యంగా—"ఇది చాలా చిత్రంగా వుంది. అయితే వాళ్ళు మీ అమ్మాయిని ప్రేమించిన విషయ మేమిటి?" అన్నాడు.

"అదంతా కూడా నే నాడించిన నాటకమే! నా

మీద కృతజ్ఞత కొద్దీ వాళ్ళెప్పుడూ తమ హద్దులు మరచి పోలేదు. రవిని చంపించడం కోసం నేనా నాటకా న్నాడవలసి వచ్చింది—....”

“రాఘవరావుగారూ! మీరో విషయం గుర్తుంచుకో వాలి. మీ మేనల్లుళ్ళ అడిక్ట్సు కాదంటే అది పొరపాటు. వాళ్ళు కృతజ్ఞత అనే డ్రగ్ సేవిస్తే....ఆ డ్రగ్ సర ఫరా చేసి వాళ్ళను మీరు దుర్వినియోగం చేసుకున్నారు. మీ కథను తెలుసుకున్నాక—కృతజ్ఞతను మించిన ప్రమాదకరమైన డ్రగ్ లేదని నాకు తోస్తోంది—....” అన్నాడు వెంకన్న.

“వెంకన్నగారూ! మీరు చెప్పింది నిజం. ఈ నిజం నా కెప్పుడో తెలిసినా—దాన్నెలా ఉపయోగించుకో వాలో తెలుసుకోలేకపోయాను. సతీష్—రవి యెదురింటి అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. నేను కాదన్నానని ఆ సంబంధం వదులుకున్నాడు. ఇప్పుడా పెళ్ళి నేనే జరిపి స్తాను. నరేష్‌కి స్వయానా నా కూతుర్నే యిచ్చి పెళ్ళి చేస్తాను. సతీష్, నరేష్‌లు సమంగా ఉండేలా చూసు కుంటాను. ఇకమీదట నరసింహంలాంటివాళ్ళు ప్రోత్స హించినా—పేదరికానికి సిద్ధపడతాను తప్ప—చట్ట విరుద్ధమైన పనులు చేయను—....” అన్నాడు రాఘవ రావు.

“రాఘవరావుగారూ! అత్యాశ కూడా ఒక డ్రగ్ లాంటిదే! దాని కలవాటుపడ్డవారు తమకు తామే కాక సమాజానికి కూడా అత్యంత ప్రమాదకరంగా తయారవు తారు. మీలో మార్పు వచ్చిందన్న నమ్మకంతో నా పరి శోధనా ఫలితాలను గోప్యంగా వుంచుతున్నాను. ఇక

సెలవు—" అని ఫోన్ పెట్టేశాడు వెంకన్న.

"ఏమంటా డాయన?" అంది పద్మావతీదేవి.

వెంకన్న ఆమెకు జరిగింది చెప్పాడు.

"మీరు చాలా నిజం చెప్పారండీ! ఆత్మాశ, కృతజ్ఞత కూడా విభిన్నమైన డ్రగ్సు. అయితే అసమానమైన సామర్థ్యముండీ మీకు ఆత్మాశలేదు. ఎందరో మీ పట్ల కృతజ్ఞత కలిగివున్నా—అది మీ రుపయోగించుకోవడం లేదు. మీరు సామాన్యులు కారు. అవతార పురుషులు—...."

"చాల్లే—నేనేం చేశానని! ప్రేమ మితిమీరితే అదీ ఒక డ్రగ్ వంటిదే—...." అన్నాడు వెంకన్న మొహమాటంగా.

"అమ్మయ్య—నా ప్రేమ మితిమీరిందని యిప్పటికైనా గ్రహించారా—" అంటూ పద్మావతి అతడివంక అదోలా చిలిపిగా చూసింది.

వెంకన్న—"యూ—" అంటూ ఆమెను దగ్గరగా లాక్కోబోయాడు.

సరిగ్గా అప్పుడే ఫోన్ మ్రోగింది.

రిసీవర్ తీసి—"హలో!" అన్నాడు వెంకన్న.

"పద్మావతీదేవిగారు కావాలి—" అందో స్త్రీ గొంతు.

వెంకన్న రిసీవర్ భార్యకందించాడు—"హలో! నేను పద్మావతిని...." అందామె.

"మేడమ్! నేను సీతమ్మను. ఆఫీసు గదిలోంచి మాట్లాడుతున్నాను. నేను, రాజమ్మ కలిసి మల్లెపూలు సాధించుకని వచ్చాం—...."

తాము మల్లెపూలెలా సాధించుకుని వచ్చినదీ సీతమ్మ చెప్పుకుని పోతోంది. ఆమె గొంతులో ఉత్సాహం....

భార్య అలా నీరసంగా ఎందుకై పోతోందో తెలియక అయోమయంగా చూస్తున్నాడు వెంకన్న—....

—:అ యి పో యి ం ది:—

# విమాన దోపిడి

## భీమవరపు పురుషోత్తం

భూమికి ఎన్నో మైళ్ళ ఎత్తుగల ప్రదేశం అది! ఇండియాకు చెందిన ఇంటర్నేషనల్ ఎయిర్ బస్ అక్కడి ప్రదేశాన్నంతా-ఒక రకమైన మంద్రపాటి శబ్దంతో నింపుతూ, మేఘాల్ని చీల్చుకుంటూ సాగిపోతూంది....మనీలానుండి వస్తూందది ఇండియాకు....

సుందరరాజన్ సీటింగ్ హాలుకి టాయిలెట్స్‌కి మధ్యగల నడవాలోకి వచ్చాడు. స్టిక్ ఆధారంతో కొద్దిగా కుంటుతున్నట్టు అడుగులు వేస్తున్నాడతను. సన్నగా, పొడుగ్గా వున్నాడతను. మీసాల్లేని చామన ఛాయ ముఖం!

అరనిమిషం ఆగాడక్కడ. ఇంతలో చప్పుడయింది. తెల్లగా స్లిమ్‌గా ఉన్న ఎయిర్ హోస్టెస్ నవ్వు ముఖంతో వస్తూంది. అతడిని సమీపించింది.

నమ్రతగా అడిగిందామె. "వాట్ ఆర్ యూ డూయింగ్ హియర్!"

పెదాలు నాలుకతో తడుపుకొని తల తిప్పాడు సుందరరాజన్. అతడి కంగారు స్పష్టంగా తెలుస్తోంది!

ఎయిర్ హోస్టస్ కనుబొమ్మలు ముడిపడ్డాయి! ఆమె యేదో అనబోయింది. ఇంతలో.... కొద్ది దూరంలో వున్న టాయిలెట్స్ గోడ వెనుకనుండి ఇద్దరు దృఢకాయులు చురుగ్గా వచ్చారక్కడికి!

అప్రయత్నంగా అడుగు వెనక్కి వేసిందామె. క్షణంలో ఇద్దరూ ఆమెను బంధించారు. అరవకుండా నోటికి ప్లాస్టర్ అంటించారు గట్టిగా....

ఎదురుగా వున్న చిన్న రూమ్‌పై ఇంగ్లీషు అక్షరాలు కనిపిస్తున్నాయి, 'కీపింగ్ రూమ్' అని. మూసి వున్న తలుపుపై చిన్నగా తట్టాడు సుందరరాజన్.

వెంటనే చేతిలో స్టిక్ తీసి ఎయిర్‌హోస్టెస్‌కు ఆనుకొని, స్టిక్‌ని ఆరంగుళాలవరకూ పట్టుకొని లాగాడు. తెల్లగా మెరుస్తూ స్టిక్‌లో దాగివున్న కత్తి బయటికి వచ్చింది. కత్తి ఎయిర్ హోస్టెస్ పీకకు ఆనించాడు ...

కీపింగ్ రూమ్ తలుపు తెర్చుకుంది. స్టెన్‌గన్ ధరించిన గార్డు పొజిషన్‌లోనికి రాబోయాడు ఎదురుగా దృశ్యం చూసి. అప్పటికి వాళ్ళు లోపలికి వచ్చేశారు. దృఢకాయులిద్దరూ తలుపుమూసేసి పిస్టల్స్‌తీసి ముందు కరిచారు!

గదిలోపల మరో నలుగురు గార్డులున్నారు. అందరి వద్దా ఆయుధాలున్నాయి. ఇలాంటి సంఘటనల్ని ఎంతో ఎలర్టుగా యెదుర్కొనేవాళ్ళు సైతం వాళ్ళ మెరుపు దాడికి నివ్వెరబోయారు!

"మీ రెవరయినా ఫైరింగ్ చేస్తే ఈమె పీక తెగిపోతుంది తక్షణం!" తడబడుతున్న పెదాలతో ఇంగ్లీషులో

కర్కశంగా హెచ్చరించాడు సుందరరాజన్.

చెమటతో దుస్తులు తడిసిపోగా, రెప్పలు సాగదీసి వెర్రిగా చూస్తూండిపోయింది, ఆ హఠాత్పరిమాణం నుండి ఇంకా తేరుకోని ఎయిర్ హోస్టెస్.

దృఢకాయులిద్దరూ రెండు స్టెన్ గన్‌లు స్వాధీనం చేసుకొన్నారు. గార్డులు వెనక్కు తగ్గారు. తెల్లగా లోపలి నరాలు కనిపిస్తూన్నంత సున్నితంగా ఉన్న ఎయిర్ హోస్టెస్ కంఠంపై పదునుగా బిగుసుకొంటూన్న కత్తి చూసే కేవలం గార్డులు ఏ చర్యా తీసుకోలేక పోతున్నారు. విమానపు సిబ్బంది ప్రాణాలు కాపాడ్డం కూడా గార్డుల బాధ్యతే!

సుందరరాజన్‌కి కంగారుగా వుంది. ఎయిర్ హోస్టెస్ యేక్షణాన్నయినా స్పృహతప్పి కిందికి జారిపోయేలా వుంది. ఈ లోపల పని చక్కబెట్టుకోవాలి. తర్వాత గార్డుల్ని ఆపడం కష్టం.

చురుగ్గా హెచ్చరించాడు. "డేనియల్, కోదండం... క్విక్!"

అంతే!—దృఢకాయులిద్దరూ పిస్టల్ పైకెత్తారు. వాళ్ళంతట తెగిస్తారనుకొంటే గార్డులు ఎటాక్ చేసేవారే! కానీ అప్పటికే ఆలస్యం అయింది....! సైలెన్సర్ అమ ర్చిన పిస్టల్స్ మెత్తగా మోగాయి. వెంటవెంటనే ముగ్గురు గార్డులు నేలకొరిగిపోయారు!

అది చూసి తలుపు తీసిన గార్డు వెర్రికోపంతో ఉగ్రు డయిపోయాడు....ముందుకురికి శత్రువులు స్వాధీనం చేసు కొన్న స్టెన్ గన్ అందుకొన్నాడు.

అప్పటికే సుందరరాజన్ పెద్ద కంఠంతో హెచ్చ రించడంవల్ల, డేనియల్ ఆ గార్డువైపు పిస్టల్ గురిచూసి

వేల్చాడు. స్టెన్‌గన్ వెనక్కి పడేసి వెల్లకిలా పడిపోయాడతడు.

సుందరరాజన్ వెంటనే కత్తి ఎయిర్ హోస్టెస్ కంఠంపై నుండి తొలగించి స్టిక్ పిడితో, జరిగేదంతా నిశ్చేష్టుడై చూస్తున్న ఐదవగార్డు తలపై మోదాడు. క్షణాలలో అతడు నేలకొరిగిపోయాడు....అప్పుడు వారి కాయి సుందరరాజన్ కళ్ళు తమకు కావలసిన వస్తువు కోసం! కాసేపటికి ముగ్గురు గుర్తించారు దానిని.

గోడనూలగా వరుసగా పేర్చి వున్న విమానంలో ఉపయోగించే చిన్న చిన్న ఉడ్ ఫర్నిచర్స్ మధ్య ఒక పెద్ద టేబుల్‌పై ఉందది!?

అది లెదర్ బాగ్!!

## 2

కోదండం అస్వస్థంగా పడున్న గార్డులవద్ద వెదికి తాళాల గుత్తి తీసాడు. మొత్తం నాలుగు తాళాలున్నాయి. నాలుగు తాళాలుతీసి బాగ్ మూత తెరిచాడు....

ముగ్గురి చూపులు పెట్టెలోపల అతుక్కుపోయాయి. ఆ పెద్దపెట్టె నిండుగా కొత్త నోట్లు తళతళలాడుతూ ముగ్గురినీ ఊరిస్తున్నాయి.

ఇజ్రాయిల్‌లోని ఇండియన్ బాంక్‌నుండి ఇండియాలోని బాంకులకు రొటేషన్ అవుతున్న ఇండియాన్ కరెన్సీ అది!

తృప్తిగా నిట్టూర్చి సుందరరాజన్ పెట్టె మూసి తాళాలు వేసి, వాటిని పక్కకు విసిరేశాడు. ఇక వాటి అవసరంలేదు. డేనియల్ ఈ లోపల ఎయిర్ హోస్టెస్‌ని ఒక మూల కట్టిపడేశాడు. అప్పటికే

భయంతో బిగుసుకొనిపోయిన ఆమె తల పక్కకు వాల్చి మగతగా ఉండిపోయింది.

టైమ్ చూశాడు సుందరరాజన్. "మన ప్లేన్ సమీపించబోతున్నాం — త్వరగా మిగతా కార్యక్రమం జరపాలి!" చెప్పాడు.

డేనియల్ చెప్పాడు. "నువ్వు యిక్కడి సంగతి చూడు. మేము కేబిన్‌లోనికి పోయివస్తాం...."

సుందరరాజన్ తలూపాడు. వాళ్ళు రూమ్ దాటి వెలుపలికి వెళ్ళేటప్పుడు చెప్పాడు. "బీ కేర్ ఫుల్!"

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయాక ఆ గదంతా వెతకసాగాడతడు. కీపింగ్ రూమ్‌లోనే పేరాచూట్స్ వుంటాయన్న విషయం అతడికి తెలుసు!

కాసేపటికి అతడి ప్రయత్నం ఫలించింది. ఒక పొడవాటి షెల్ఫ్‌లో పేరాచూట్స్ కనిపించాయి. విమానానికి యేదయినా ప్రమాదం సంభవిస్తే ప్రయాణీకుల ప్రాణాలు రక్షించడానికి ఉపయోగిస్తారవి.

నాలుగు పేరాచూట్‌లను భుజాన వేసుకొని, లెదర్ బాగ్‌ను నేలమీదనుండి ఈడ్చుకొంటూ హేండ్‌స్టిక్‌తో కొద్దిగా కుంటుతూ గది తలుపులు తెరుచుకొని నడవాలోనికి వచ్చాడతడు.

తలుపులు తెరవగానే సీటింగ్ హాలులో నుండి వస్తూన్న రణగొణధ్వని అతడి చెవులబడింది. చేతిలో తేలికైన ఆయుధం లేకపోయినా అతడికి భయంలేదు. బాగ్‌ను ఈడ్చుకొంటూ హాలులోనికి రాసాగాడు....

ఇంతలో చిన్న కుదుపు! ప్రయాణీకుల హాహాకారాలు ఎక్కువయ్యాయి. కుదుపుతో పాటూ విమానం స్లో అయ్యింది బాగా!

సుందరరాజన్ ముఖంలో చిరునవ్వు ప్రత్యక్షమైంది. ఆనందంతో అతడి హృదయం గంతులేసింది. అతడికి కావల్సింది అదే! వేసిన ప్లానంతా అంచెలంచెలుగా అమలు జరుగుతూంటే అతడి ముఖం తృప్తిగా వెలిగి పోతూంది.

కేబిన్‌లో నుండి డేనియల్, కోదండం బయటికి వచ్చారు. వాళ్ళ చేతుల్లో గార్డ్సుని చంపి స్వాధీనం చేసుకొన్న స్టెన్‌గన్‌లు ప్రయాణీకుల్ని భయభ్రాంతుల్ని చేస్తున్నాయి.

ప్రయాణీకులు ఒకరిద్దరు భయంతో మూర్ఛబోయారు. కొందరు కళ్ళుమూసుకొని దైవప్రార్థన చేసుకొంటు న్నారు. మరికొందరు వాళ్ళు ముగ్గురూ అంతవరకూ తమ మధ్యే సాధారణ ప్రయాణీకుల్లా నటించిన వాళ్ళని గుర్తించి నిర్ఘాంతపోతున్నారు. వైమానిక సిబ్బంది అస మర్థతను తిట్టుకొంటున్నారు. మిగతా వాళ్ళు వాళ్ళ ముగ్గుర్నీ ఆసక్తిగా చూస్తున్నారు.

"అంతా సవ్యంగా జరిగిందా?" ప్రశ్నించాడు సుందరరాజన్.

డేనియల్ తల పంకించాడు. కోదండం "అంతా ఓ.కే. కోపైలట్‌ని గాయపర్చి ప్లేన్ స్లో చేయించాం!" చెప్పాడు.

"సరే! ఇవి ధరించండి" అంటూ రెండు పేరాచూట్లు వాళ్ళవైపు విసిరాడు.

క్షణాల్లో ముగ్గురూ పేరాచూట్లు ధరించారు. లెదర్ బాగ్‌ను కూడా పేరాచూట్‌కి కట్టి, దానికి తన పేరా చూట్‌కి అడ్డంగా ఓ పొడవాటి తాడును బిగించి కట్టాడు సుందరరాజన్. అతడు తన హేండ్‌స్టిక్‌ను

పోగొట్టుకోవడం ఇష్టంలేక భద్రంగా కోటునుండి క్రిందికి దోపుకున్నాడు.

వాళ్ళు పేరాచూట్‌లు ధరించే తతంగం అంతా గమనించి ప్రయాణీకులు మనసులో సంతోషించారు. ప్లేన్ హైజాక్ చేసి తమను ముప్పుతిప్పలు పెట్టకుండా, వాళ్ళతోబాటు వాళ్ళు పోతున్నందుకు రిలీఫ్‌గా ఫీలవుతున్నారు ప్రయాణీకులు.

స్టెన్‌గన్‌లు నడుంపై బిగించుకొని దూకడానికి రెడీ అయ్యారు. డేనియల్ ఆటోమేటిక్ ఎంట్రన్స్ డోర్‌ని పక్కకు తప్పించాడు. తుపాకీ గుండంత వేగంగా లోపలికి దూసుకొని వచ్చినగాలి వాళ్ళ ఊపిరి స్తంభింపచేస్తుంది. ఒకరినొకరు కళ్ళతో హెచ్చరించుకున్నారు....

ప్రయాణీకులు విభ్రాంతిగా చూస్తున్నారు....

## 3

ముందు సుందరరాజన్ పెట్టెను తోసేసి ఏకకాలంలో తనూ దుమికాడు క్రిందికి. వెనగ్గా డేనియల్, కోదండం గాలి వేగానికి కళ్ళు చికిలించి దూకేశారు!!

కొన్ని సెకన్ల తర్వాత పేరాచూట్లు విచ్చుకొన్నాయి. గాలి వత్తిడికి వణికిపోయే గాలిపటాలవలె ముగ్గురు అల్లల్లాడుతూ అన్నిమైళ్ళ ఎత్తునుండి అతి మెల్లగా తేలుతున్నట్టు దిగసాగారు....!

గాలి విసురుకి కొద్దిగా కళ్ళు మూసుకొన్న సుందరరాజన్ కళ్ళు విప్పి స్పష్టంగా చూశాడు. అతడి కనుబొమ్మలు ముడిపడ్డాయి.

గాలి విసురు అతడు ఊహించిన దానికంటే ఎక్కువగా వుంది. క్యాష్ వున్న లెదర్ బాగ్ తాడుతో కట్టడంవలన, కొద్దిదూరంలో అతడి పేరాచూట్‌కి

సమాంతరంగా ఎగురుతూంది.

డేనియల్, కోదండం దూరంగా చిన్నగా కనబడు తున్నారు. వాళ్ళు కూడా దాదాపు అతడి ఎత్తుకు సమంగానే ఉన్నారు.

మరికొద్దిసేపు గడిచింది. సుందరరాజన్ అనుమానం బలపడుతుంది! అప్రయత్నంగా అతడి వెన్ను జలదరించింది భయంతో!?

ఏటవాలుగా వస్తున్న గాలికి ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నా డతడు....ఆ ప్రాంతంలో కొండచరియలు ఎక్కువగా వుండడంవల్ల గాలులు ఎక్కువగా వుంటాయక్కడ. ఒక్కొక్కసారి అవి నార్మల్ పాయింట్‌ను మించి వుంటాయి. అలాంటప్పుడే అవి దగ్గరలో ఉన్న సముద్రంలో వాయుగుండాలు, అధిక పీడనాలు ఏర్పడడానికి చాలా పాత్ర వహిస్తాయి.

ప్రస్తుతం అలాంటి గాలే తమను వెంటాడుతూందని గ్రహించడానికి ఎంతో సమయం పట్టలేదు సుందరరాజన్‌కు!

దూరంగా డేనియల్ కోదండాలు నీళ్ళల్లో మునిగి ఉక్కిరిబిక్కిరి అవుతున్నవాళ్ళలా కాళ్ళూ చేతులు అస్తవ్యస్తంగా ఆడించడం అతడికి కనబడుతూంది....అంతవరకూ తన ప్రక్కనే ఉన్న అదృష్టదేవత ఇప్పుడు తప్పుకోవడం సుందరరాజన్‌కి వెర్రి పుట్టిస్తోంది. అతడికి తల తిరుగుతున్నట్టనిపిస్తోంది!

గాలి విసురు మరింత పెరిగిందని గ్రహించాడు. ఏ క్షణాన్నైనా అతడి దుస్తుల్ని చీలికలు చేయడానికి సిద్ధంగా ఉన్నట్టుంది గాలి. ముఖ్యంగా చెవుల్లోకి ముఖం మీదికి కొడుతున్న గాలి అతడికి స్పృహ తప్పేలా

చేస్తూంది....దూరంగా డేనియల్ కోదండంల పరిస్థితిలో కూడా మార్పులేదు!

చెవుల్లోకి దూరే గాలి డయాఫ్రంను చీల్చి తమను శాశ్వతంగా చెవిటివాళ్ళను చేస్తుందేమో నన్న భయం పుట్టింది అతడికి.

బాగా ఎత్తునుండి పేరాచూట్ల ద్వారా క్రిందికి దిగే సైనికులు వాడే హెల్మెట్లు వుంటే, తమ పరిస్థితి కొంత వరకూ చక్కబడుననిపించింది.

సుందరరాజన్ ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతూనే వున్నాడు. వాళ్ళు క్రిందికి దిగడానికి బదులు కొద్దిపాటి ఏటవాలుగా గాలి అలలలో అలా కొట్టుకొనిపోతూనే వున్నారు....

పరిస్థితి అర్థం చేసుకొన్న సుందరరాజన్, తాము ఇప్పుడప్పుడే క్రిందికి దిగే అవకాశం మాత్రం లేదని గ్రహించగలిగాడు.

తాము లేండ్ అవడానికి ముందే నిర్ణయించుకొన్న ప్రదేశంలో అప్పటి వాతావరణపరిస్థితి పూర్తిగా తెలుసుకోనందుకు, ప్లాను గురించి లోతుగా ఆలోచించనందుకు తనను తానే తిట్టుకొన్నాడు. లెదర్ బాగ్‌ను వేరే విడక కుండా తన పేరాచూట్‌కు కలిపి మధ్యలో తాడు కట్టినందుకు మాత్రం ఆ సమయంలో కొద్దిగా సంతోషించాడు.

కళ్ళు చికిలించి క్రిందికి చూడడానికి ప్రయత్నించపోగాడతడు. కనీసం తామెక్కడున్నామో అయినా తెలుసుకోవాలని వుందతడికి. తెల్లటి మేఘాల మధ్య నుండి నీలంరంగు కనిపిస్తూంది అతని కళ్ళకు! క్రమంగా ఆ రంగు నీళ్ళని గ్రహించాడు....తమ చావు ఖచ్చితంగా

సముద్రపు నీళ్ళలో లేనని అతడికి నమ్మకం కుదిరింది.

కళ్ళు మూసుకొన్నాడు. సముద్రపు హోరులా వినిపిస్తూన్న గాలి, చల్లగా స్పృశిస్తూన్న మేఘాలు తెలుస్తున్నా యతడికి. క్రమంగా అతడికి స్పృహ తప్పింది....!!

# 4

మెల్లగా కళ్ళు విప్పాడు సుందరరాజన్. చిన్న చిన్న కొమ్మలు అతడి చుట్టూ ఉన్నాయి అల్లుకొన్నట్టు. వెంటనే లెదర్ బాగ్ గుర్తుకు రావడంతో త్రుళ్ళిపడి కదిలాడు. ఒళ్ళంతా చితక్కొట్టినట్టు ఉండడంతో అతడి ప్రయత్నం ఫలించలేదు.

అతడి ఆలోచనలు స్తబ్ధత వదిలి కదిలాయి. డేనియల్ కోదండం అతడి స్మృతిపథంలోకి వచ్చారు. అసలు తనెక్కడున్నాడో అర్థం కాలేదతడికి.

'లెదర్ బాగ్' మాట పెదాలు దాటి బయటకు రాక పోయినా నోట్లోనే గొణుక్కున్నాడు. శక్తినంతా కూడ గట్టుకొని అతి కష్టంమీద పైకి కదిలాడు. నడుం దగ్గర కలుక్కుమంది. తడిమి చూసుకున్నాడు. ఎర్రగా కనిపించింది రక్తం! విరిగిన ఎండుకొమ్మ గుచ్చుకొని గాయం అయిందక్కడ.

భారంగా ఊపిరి వదిలి ఒక విరిగిన పొడవాటి కొమ్మ సహాయంతో అక్కడినుండి పైకి లేచాడు. కోటులో దాచిన అతడి హేండ్‌స్టిక్ రెండుగా విరిగిపోయి వుంది. ఆశ్చర్యంగా చుట్టూ చూశాడు. దట్టమైన అరణ్యంలా ఉంది అదంతా!

పక్షుల అరుపులు మాత్రం ఎక్కువగా వినిపిస్తున్నాయి. దూరంగా వెలుతురు తగ్గుతూండడం గమనించి

బాగా సాయంత్రం అయ్యిందని గ్రహించాడు. నడుముకు కట్టుకొన్న పేరాచూట్ బెల్టు విప్పుకొన్నాడు. అతడి పేరాచూట్ తాళ్ళు ఓ సన్నటి చెట్టుకు తగులుకొని దాన్ని విరిచేశాయి.

ఒంటిమీద అక్కడక్కడా వున్న చిన్న చిన్న గాయాలను లెక్క చేయకుండా, ఆత్రంగా కళ్ళతో చుట్టూ తడిమాడు....

అతడి కళ్ళు మెరిసాయి. సమీపంలో ఒక పొదలో ఇరుక్కొన్న పేరాచూట్ కనిపించింది. అతడి పేరాచూట్‌కు కట్టిన త్రాడు ఆ పొదవైపు ఉంది!

విరిగిన హేండ్‌స్టిక్ కత్తి వున్న భాగం తీసికొని అతి కష్టంమీద కుంటుకొంటూ అక్కడికి చేరుకొన్నాడు. ఎక్కువ శ్రమ పడకుండానే అతడి పేరాచూట్ బెల్టు ఉన్న భాగం కనిపించింది.... బెల్టు విప్పేసి ఖాళీగా ఉంది!?

ఆ ప్రదేశంలో ఎక్కడా లెదర్ బాగ్ మటుకు కనిపించలేదతడికి....!?

ఆయోమయంతో పిచ్చెత్తిపోతోంది సుందరరాజన్‌కు. మనిషి రొప్పుతున్నాడు. బాగ్ గాలి తుఫానులో ఎక్కడయినా జారిపోయిందేమోనన్న ఆలోచన అతడిని క్రుంగదీస్తోంది.

ఇంతలో, చెట్టు మొదలుపై కాగితమేదో ఆకర్షించదతడిని. ఆశ్చర్యంతో దానిని తీసి చదివాడు.

"రాజన్,

నీ ప్లాను ఫెయిలయి మా పీకల మీదికి తెచ్చింది! ఇది ఒక చిన్న దీవి! మనుష్య సంచారం అనేది ఏళ్ళ తరబడి లేని ఓ అజ్ఞాత దీవి!

ఇక మా దారి మేము చూసుకొంటాం. ఫెయిలయ్యే ప్లాను వేసినందుకు నీకు శిక్షగా లెదర్ బాగ్ మేము తీసి కెళ్ళిపోతున్నాం!

నీవు మమ్మల్ని వెంబడించాలనుకోవడం నీకే ప్రమాదం! మా వద్ద ఆయుధాలున్న సంగతి నీకూ తెలుసు!—"

డేనియల్, కోదండం రాసిన ఆ కాగితం చదవగానే కోపంతో సుందరరాజన్ కళ్ళు ఎర్రబడ్డాయి. డబ్బు పోయిందన్న బాధ, జరిగిన మోసం అతన్ని నిర్వీర్యుణ్ణి చేశాయి!

కత్తి బయటికి తీశాడు. కసిగా దాన్ని ఆ కాగితం మీద గుచ్చాడు. క్షణంలో డేనియల్ కోదండాల్ని ఇద్దర్నీ ముక్కలు ముక్కలుగా నరికి పారేయాలనిపించిందతడికి.

కాసేపటికి తేరుకున్నాడు సుందరరాజన్. చీకటిపడుతూందని గ్రహించాడు. అజ్ఞాతదీవి! కీకారణ్యం, ముసురుకొంటున్న చీకటి. ఒంటరిగా వున్న అతడిని ఒణికించాయి!

మధ్యాహ్నానికి, ఇప్పటికి తన పరిస్థితి తల్చుకొంటే చిత్రంగా అనిపించింది. కేవలం ఊహించని గాలి తుఫానే తన భవిష్యత్తును నాశనం చేసిందని అతడి నమ్మకం!

చీకటి పూర్తిగా ఆవరించింది. సుందరరాజన్ తల పైకెత్తాడు. చెట్టు బాగా పెద్దది. బలమైన కొమ్మలు శాఖోపశాఖలుగా వున్నాయి. ముఖ్యంగా చెట్టుపైకి ఎక్కడానికి అనుకూలంగా వుంది.

తిండిమాట అటుంచి తెల్లవారేటప్పటికి రక్షణకోసం

యేదో ఒక నివాసం చూడకపోతే, ఏ క్రూరమృగానికో తాను ఆహారంకాక తప్పదని భయం పుట్టిం దతడికి.

మెల్లగా చెట్టు యెక్కసాగాడు. అతడి ఒక కాలు కుంటి కావడం వలన ఒంటి కాలితో యెక్కవలని వచ్చింది. పళ్ళ బిగువున బాధను బిగబట్టి పైకి చేరుకొన్నాడు. ఒక విశాలమైన కొమ్మ సమాంతరమైన రెండు పాయలుగా చీలినచోట అనువుగా అనిపించింది.

అక్కడ వాలిపోయాడు. అతడికి ప్రాణం కొద్ది కుదుటపడినట్టనిపించింది. నడుం దగ్గర గాయం మాత్రం మండుతూంది. డేనియల్, కోదండంలపై ఎలా పగ తీర్చుకోవాలా అన్న ఆలోచనలో పడింది అతడి బుర్ర.

మద్రాసు జైలునుండి తప్పించుకొని పారిపోతూ తనకు తారసపడిన నేరస్థులు వాళ్ళు. తనూ మాజీ నేరస్థుడే. చావాళ్ళ దొంగతనాలకు దూరంగా వుండిపోయిన తను ఆఖరిసారిగా అతిపెద్ద దోపిడీ చేసి సుఖంగా జీవించాలనుకొన్నాడు ఆ డబ్బుతో! కానీ విధి వక్రించింది!

ప్రస్తుతం డేనియల్, కోదండాల్ని ఏదోవిధంగా అంతం చేస్తేగానీ ఆ డబ్బు తనకు దక్కదు....ఇలా సాగుతున్నాయి సుందరరాజన్ ఆలోచనలు.

## 5

తెల్లవారింది—

పక్షుల అరుపులకు మెలకువ వచ్చింది సుందరరాజన్‌కి. పచ్చటి ఎండ చెట్టుపై పడుతూంది. ఆకులను చీల్చుకొని వస్తూన్న సూర్యకిరణాలు అతడి కళ్ళల్లోపడి యిబ్బంది కలిగిస్తున్నాయి.

జాగ్రత్తగా క్రిందికి దిగాడు. నడుం దగ్గర మండుతున్నట్టనిపించింది పట్టు విప్పి చూసుకున్నాడు! గాయం

దగ్గర రక్తం గడ్డకట్టింది. నొప్పి వుంది. అది క్రమేణా పుండుగా మారే ప్రమాదం ఉందని తెలుసతడికి.

ప్రత్యేకంగా గుడ్డముక్క ఏదీ లేకపోవడంతో, కోటు లోపల చిరుగులు పట్టిన షర్టును మడతపెట్టి నడుంచుట్టూ బలంగా కట్టాడు. పైన మామూలుగా కోటువేసుకున్నాడు. కట్టువల్ల గాలి తగిలి గాయం చెడిరే ప్రమాదం లేదు. అయితే త్వరగా మందు కూడా వేయడం అవశ్యకమని తెలుసు అతడికి!

అంతవరకూ దాగి వున్న ఆకలి మెల్లగా విజృంభిస్తూంది అతడిలో! కడుపు నింపుకోవడానికి ఏవో ఒక పళ్ళు తప్పక దొరుకుతాయన్న ఆశ వుంది అతడిలో. ముందు తాను నడవడానికి మంచి కర్ర తయారుచేసుకోవాలనుకొన్నాడు.

చాలాసేపు అక్కడ వెదికి మంచి కర్ర తీసాడు. కత్తితీసి దానిని ఓపిగ్గా తనకు కావలసిన రీతిలో, పైచివర వెడల్పాటి ఒంపు వుండేలా తయారుచేసాడు... దానిని ఉపయోగించి నాలుగైదు అడుగులు అటూ ఇటూ నడిచి చూశాడు. సౌకర్యంగానే ఉందది! తృప్తిగా నిట్టూర్చాడు.

కత్తి నడుంకు కట్టిన షర్టులో దోపుకొన్నాడు. కర్ర సాయంతో నెమ్మదిగా నడుస్తూ చెట్లను, పొదలను గమనిస్తూ ఆహారాన్ని వెదుక్కుంటూ నడవసాగాడు.

ఎంత తిరిగినా మంచి ఫలాలున్న వృక్షాలేమీ అతడికి కనిపించడంలేదు! రెండు మూడు చోట్ల కొన్ని పళ్ళు కనిపించినా అది బాగా వగరుగా ఉండడంతో కొరికి వదిలేశాడు!

అకస్మాత్తుగా ఒకచోట ఆగిపోయాడతడు!?

ఆశ్చర్యంతో ఏదో తెలీని భయంతో అతడి శరీరంపై రోమాలు కంపించాయి! అయినా నమ్మలేనట్టు వీలయినంత పరీక్షగా చూశాడు!

అక్కడంతా బాగా చీకటి ప్రదేశం. దట్టమైన చెట్లు గోడల్లా చుట్టూ క్రమ్ముకొని ఉన్నాయి. సూర్యకాంతి లోపలకు చొరబడే అవకాశం ఏమాత్రం లేదు!

ఎదురుగా పెద్దకొండశ్రేణిని ఆనుకొని చీకటి గుహ కనిపిస్తూంది. దానిచుట్టూ చెట్లూ చేమలు అల్లుకొని పోయాయి. గుహను పూర్తిగా మూసివేయడానికి ప్రయత్నిస్తూంది అక్కడి వృక్ష సంపద!

అక్కడ లావాటి నల్లటి బద్దలు నిలువుగా చీకట్లో కలిసిపోయి ఉండడం పాదలమధ్యనుండి అస్పష్టంగా కనబడుతూంది. వాటి వెనుక బరివి గడ్డాలతో తెల్లని ఆకారాలు ఉండడం చూసి ఒడలు గగుర్పొడిచాయి సుందరరాజన్ కు!?

ఆకారాలు ఊచల దగ్గరగా వచ్చి అతడిని చూస్తున్నాయి....పిలుస్తున్నాయతడిని!

చెమటలు తుడుచుకున్నాడు అతడు. రెండు నిమిషాలాగి భయాన్ని కంట్రోల్ చేసుకుంటూ చీకటిలోనికి మరింత పరీక్షగా చూశాడు.

ఆ ఆకారాలు మనుష్యులే! తల, గడ్డాలు విపరీతంగా పెరగడం వలన చీకటిలో వాళ్ళు భయానకంగా కనిపిస్తున్నారు!

అప్రయత్నంగా అడుగులు ముందుకేసాడు. పట్టపగలే అంత చీకటిగా ఉన్న ఆ ప్రదేశంలో వాళ్ళెందుకుంటున్నారో అర్థంకాలేదతడికి?

వాళ్ళను సమీపించాడు. తెల్లటివాళ్ళ దేహాల్ని బట్టి

వాళ్ళు శ్వేతజాతీయులని తెలుస్తోంది. మొత్తం నలుగురున్నారు. ఒంటిపై పాంట్లు మాత్రమే ఉన్నాయి వాళ్ళకు. అవీ చాలావరకూ శిధిలమైపోయాయి. దట్టంగా వున్న కనుబొమ్మల క్రిందనున్న వాళ్ళ కళ్ళు అతడ్ని అభ్యర్థనగా చూస్తున్నాయి.

క్రమంగా అతడి కర్థమయింది! ఇనుప కటకటాల బోనులో వాళ్ళు బంధించబడ్డారని.... వాళ్ళక్కడ ఎన్నో ఏళ్ళు తరబడి వుంటున్నట్టు వాళ్ళ ఆకృతిని బట్టి గ్రహించాడు!!

తుప్పుపట్టిన ఇనుపబద్దలు పట్టుకొని ఒక ఖైదీ గొంతు సవరించుకొని సుందరరాజన్‌ని అడుగుతున్నాడు ఇంగ్లీషులో "మిస్టర్.... ప్లీజ్.... ప్లీజ్.... ఓపెన్ ది లాక్!"

సుందరరాజన్ అయోమయంగా చూశాడు. వాళ్ళు అడుగుతూనే వున్నారు. చేతులు చాస్తున్నారు. కటకటాలనుండి అతడిని అందుకోవడానికి.... అప్రయత్నంగా అడుగు వెనక్కి వేశాడు.

కొద్దిక్షణాలలో అతడి భయం తగ్గుముఖం పట్టింది. స్వచ్ఛమైన వాళ్ళ మాటలు వినగానే, చీకట్లో దేని కోసమో వెదికాడు. కొండ అంచువద్ద ఇనుపబద్దలను కలుపుతూ వేయబడిన పెద్ద తాళంకప్ప కనిపించింది! నల్లటి ముద్దలా కనిపిస్తూందది.

తెల్లజాతీయులు కటకటాలలోనుండి దానిని అందుకోవడానికి ఏమాత్రం వీలులేకుండా, ఓ రాతి వంపు చివర అమర్చబడి ఉంది ఆ తాళం! కాసేపు అక్కడ వెదికి పెద్ద రాయి సంపాదించాడు.

అంతలోనే అతడిలో ఏదో అనుమానం తలెత్తింది! ఎప్పటినుండో నాగరిక ప్రపంచంతో సంబంధాలు లేని

రాతిమనుషులు వాళ్ళు. తలుపు తెరవగానే తనమీదపడి చంపేస్తే!!

ఆలోచిస్తూన్న సుందరరాజన్‌ను చూసి, అతడి అనుమానాలు పసిగట్టిన వాడల్లే ముందు మాట్లాడిన ఖైదీయే చెప్పాడు. "మిస్టర్! నీకేం భయంలేదు. అనుమానించకుండా విడిపించు మమ్మల్ని. కావలిస్తే ఇదిగో ఈ ఆహారం తీసుకో" అంటూ ఏవో లావాటి దుంపలు అతడి కందించాడు.

ఆకలిమీద ఉన్న సుందరరాజన్ దుంప కొంటనే రుచి చూసాడు. రుచిగానే వుంది! ప్రస్తుతం అమాత్రం రుచి చాలు అతడికి. క్షణాలలో పూర్తిచేశాడు వాటిని.

తర్వాత ఇక సంకోచించకుండా రాతితో తాళం పగలగొట్టి, అక్కడ అడ్డుగా ఎదిగిన మొక్కలను కత్తితో నరికివేసి తలుపు బలమంతా ఉపయోగించి లాగాడు! వాళ్ళు కూడా అటువైపునుండి తోయడంతో అది తెరుచుకొంది....!

## 6

సుందరరాజన్‌తోపాటు ఖైదీలు నలుగురూ వెలుగులోనికి నడిచివచ్చారు. వాళ్ళ ఆనందం పట్ట శక్యం గాకుండా వుంది!

కాసేపు నృత్యాలు చేశారు. మరికాసేపు సంతోషం పట్టలేక పిచ్చిగా నవ్వుతున్నారు. అటూ ఇటూ ఉత్సాహంగా గెంతుతూ సుందరరాజన్‌ని కూడా పట్టుకొని తమతో గెంతించారు.

కాసేపటికి అతడు వాళ్ళకు మంచి మిత్రుడయ్యాడు. ఆ దీవిలోనికి అతడెలా వచ్చిపడ్డాడో అడిగారు వాళ్ళు.

పేరాచూట్‌లతో సాహసాలు చేస్తూ ప్రమాదవశాత్తు యిక్కడ పడ్డానని చెప్పాడు. అయితే దీవిలో వున్న మరో యిద్దరు తనకు ప్రధాన శత్రువులని దేనియల్, కోదండంల నుద్దేశించి చెప్పాడు వాళ్ళకు. అంతకుమించి అతడి విషయంలో పెద్ద ఆసక్తి చూపించలేదు వాళ్ళు.

"మీరసలు ఆ చీకటికొట్లో ఎలా బంధితులయ్యారు?!" ప్రశ్నించాడు సుందరరాజన్. సంభాషణ ఇంగ్లీషులోనే సాగుతూంది.

తెల్లజాతీయుడు నిట్టూర్చాడు. అతడి ముఖంలో నిరాశా మేఘం క్రమ్ముకుంది. "మేము దురదృష్ట జంతులం! మాది థాయ్‌లాండ్. మేం నలుగురం ఒకే కాలనీలో వుండేవాళ్ళం. దేశంలో ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలు, అల్లర్లు చెలరేగిన సమయంలో ప్రభుత్వ వ్యతిరేకవాదులు కొందరు సీక్రెట్ ఏజంట్లు అనుమానించడంతో ప్రభుత్వ వ్యతిరేకతత్వాన్ని ప్రోత్సాహించే విప్లవసాహిత్యపు పుస్తకాల్ని మా ఇళ్ళల్లో దాచేసి వెళ్ళిపోయారు.

అదే మా పాలిట శాపమయింది. సీక్రెట్ ఏజంట్లు మమ్మల్ని కస్టడీలోనికి తీసుకున్నారు. మా పై ఉగ్రులయిన మా పై నిశాధికార్లు మాకీ శిక్ష విధించారు!" చెప్పాడు.

"వెరీబాడ్!" తల పంకించాడు సుందరరాజన్. వాళ్ళను పరిశీలనగా చూశాడు. వాళ్ళ ఎర్రటి తలలు విపరీతంగా పెరిగి అట్టకట్టి వున్నాయి. ఒకరిద్దరి తలలు చాలాచోట్ల తెల్లగా పండిపోయాయి. కాళ్ళూ చేతుల గోళ్ళు అస్తవ్యస్తంగా పెరిగి వున్నాయి.

"ఎన్నాళ్ళయింది మీరిక్కడ బంధించబడి?" మళ్ళీ

అడిగాడు.

"మేమిక్కడికి 1978లో వచ్చాం! అది మాత్రమే గుర్తుంది."

"మైగాడ్! తొమ్మిది సంవత్సరాలు అయింది. అన్ని సంవత్సరాలు అందులో ఎలా వుండగలిగారు? ఇన్నాళ్లూ ఏం తిని బ్రతికారు!?" తెల్లబోతూ అడిగాడు.

"అది మా ఖర్మ! ఏనాడయినా మేము బయటి ప్రపంచాన్ని చూడకపోతామా అన్న ఆశతో నే ఇన్నాళ్ళు ప్రాణాలుగ్గబట్టుకొని జీవించాము! దేవుడు మాకు యింకా ఆయుస్సు ఇవ్వడంతో మమ్మల్ని బంధించిన చోటే ఒక రకమైన దుంపల పాళల ఉండడం చూశాము! ఈ తొమ్మిది సంవత్సరాలు అవే తిన్నాం. ఇక్కడ రాతికొండ చుట్టూ మొలచిన చెట్లవల్ల ఆ దుంపలు తయారవుతూ ఉండవచ్చు.

గుహలోపల కొండరాళ్ళ మధ్యనుండి ప్రవహించే నీటివాగే మా దాహం తీర్చేది! బయట ప్రపంచాన్ని చూడాలన్న మా ఆశ నిరాశ కాలేదు. నీద్వారా మేము తిరిగి స్వేచ్ఛా జీవులమయ్యాం! నువ్వు చేసిన మేలు మాత్రం మరువలేనిది" అన్నాడు. అతడితో పాటు మిగతా వాళ్ళు కూడా సుందరరాజన్‌ను కృతజ్ఞతగా చూశారు.

తనపై వాళ్ళకుగల కృతజ్ఞత అర్థమయ్యేకొలది సుందరరాజన్ ఆలోచనలు పరుగులుతీయసాగాయి.

"నేను మీకు సాయం చేశాను. ప్రతిగా మీరుకూడా నాకో సాయం చేస్తే నే సమంజసం!" చెప్పాడతను మెల్లగా.

"ఏమిటది? చెప్పండి!" అడిగాడో తెల్లజాతీయుడు.

అతడు చెప్పాడు. "నేను మీకు మిత్రుడిని. నా

శత్రువులు మీకూ శత్రువులవుతారు! అదే మీరు చేయ వలసింది!"

సందేహంగా చూశారు వాళ్ళు?

"దేనియల్, కోదండం నాకు శత్రువులని ఇందాకే చెప్పాను. వాళ్ళు నాకు చేసిన ద్రోహం చెప్పాలంటే చాలా వుంది! అది యిప్పుడు అప్రస్తుతం! మనం ఐదు గురం కలసి ముందు వాళ్ళను పట్టుపెట్టాలి—ఆ తర్వాతే ఈ దీవిలో నుండి బయటపడడానికి ప్రయత్నించాలి!" చెప్పాడతడు వాళ్ళ ముఖం వంక చూస్తూ.

నలుగురూ ఒకరి వంక ఒకరు చూసుకున్నారు.

"మిస్టర్ రాజన్! చేయని నేరానికి మేము ఇన్నేళ్లూ బంధిఖానా అనుభవించాం. ఆ ప్రభావం నుండి మేమింకా కోలుకోలేదు. హత్యలు లాంటి నేరం చేసేటంత ధైర్యం శక్తీ మాకు లేవు. కావలిస్తే నీకు తోడుంటాం!"

అది విని సుందరరాజన్ మిన్నకుండిపోయాడు. అతడి ముఖం వాడింది. ఇక చేసేదిలేక కాసేపాగి చెప్పాడు. "సరే! అలాగే చేయండి. ప్రస్తుతం వాళ్ళు ఇక్కడి నుండి బయటపడడానికి, పడవలాంటిది యేదో తయారు చేసే ప్రయత్నంలో వుంటారు తప్పకుండా....! మనం వాళ్ళను కనిపెట్టాలి ముందు!"

"అవును. దేనికయినా ముందు వాళ్ళ ఉనికి తెలుసు కోవడం ముఖ్యం!" చెప్పాడు ఒక తెల్లజాతీయుడు.

సుందరరాజన్‌తో మొదట మాట్లాడిన తెల్లజాతీ యుడు చెప్పాడు "అలా అయితే తీరప్రాంతంలోనే వాళ్ళు యెక్కువగా ఉండటానికి అవకాశం వుంది! పడవ తయారుచేసుకోనే ప్రయత్నాలలో ఉన్నవాళ్ళు, ముఖ్యంగా తీరప్రాంతాల్లో వెదికితే దొరుకుతారు...."

ప్రశంసనీయంగా మారాడు సుందరరాజన్ అతడి వంక. చాలావరకూ కరక్టే అతడు చెప్పింది.

ఐదుగురూ కదిలారు. సుందరరాజన్ కుంటుతూ నడవడం మూలంగా వారి అన్వేషణ మందంగా సాగుతూంది.... దారిలో ఒకటి రెండు నీటి చెలములు తగలడంతో దాహం తీర్చుకున్నారు. మధ్యాహ్నపు ఎండ ఒంటిని చుర్రుమని కాల్చేటంత వేడెక్కే వరకూ తిరిగారు వాళ్ళు. వారి ప్రయత్నం ఫలించింది అప్పటికి....!

## 7

దూరంగా సముద్రపు ఒడ్డున ఇసుకలో కనిపించిన వ్యక్తుల్ని డేనియల్, కోదండం అని గుర్తించి టెన్షన్‌గా ఆగిపోయాడు సుందరరాజన్.

మిగతా వాళ్ళు కూడా చూస్తున్నారు వాళ్ళను. సుందరరాజన్ చెప్పకుండానే అతడి ముఖం చూసి తమ శత్రువులు వాళ్ళేనని గ్రహించారు.

"మనం అలా చెట్లలోనికి వెళదాం!" సాలోచనగా ఎదురుగా వున్న మెరక పైకి దారితీసాడతడు. ఐదుగురూ చెట్లలోపలినుండి వాళ్ళను సమీపించారు!

అప్పటివరకూ సముద్రపు ఒడ్డున తిరుగుతూ ఎండ ఉధృతాన్ని భరించిన వాళ్ళకు, ఇరవై ముప్ఫై అడుగుల ఎత్తున గూడులా అల్లుకొన్న చెట్లు చల్లదనాన్ని ఇవ్వసాగాయి. క్రింద నేలంతా ఊటపట్టి నల్లటి బురదతో కూడుకొని చిత్తడి చిత్తడిగా వుంది. దీవిలో పక్షులు, పాములు మినహా క్రూరమృగాల ఉనికి ఏ మాత్రం లేక పోవడం చూచాయగా గమనించారు వాళ్ళు.

ఆగారు వాళ్ళు! శత్రువులకు బాగా దగ్గరగా రావడంతో చెట్లచాటునుండి చూడసాగారు. అప్పటికే

డేనియల్, కోదండం పడవ ఒకటి సగం తయారు చేశారు. తేలికపాటి అడివి చెట్లను, కొమ్మలను నరికి ముక్కలు వేస్తూ తయారుచేస్తున్నారు దాన్ని!

"వాళ్ళే కదా! ఏం చేద్దాం?" అడిగాడో తెల్ల జాతీయుడు, సుందరరాజన్ వైపు చూస్తూ గుసగుసగా.

సుందరరాజన్ కాసేపు చెట్లలోంచి చూసి, చెప్పాడు తర్వాత. "వాళ్ళ దగ్గర కొన్ని ఆయుధా లున్నాయి. ముందు మనం ఒక ఆయుధం అయినా స్వాధీనం చేసుకోవాలి..అప్పుడు మెరుపుదాడి చేయాలి!"

"ఏం ఆయుధాలవి?!" కొద్దిపాటి కంగారుతో అడి గాడు తెల్లజాతీయుడు.

"రెండు స్టెన్‌గన్‌లు, పిస్టళ్ళు!" చెప్పాడు.

స్టెన్‌గన్‌లు అనగానే తనూహించినట్టుగానే, వాళ్ళ కళ్ళల్లో బెదురు దోబూచులాడడం గమనించాడు సుందరాజన్.

మళ్ళీ అన్నాడు. "మనం వాటిని స్వాధీనం చేసుకో గలిగితే వాటి ప్రమాదం మనకు తప్పుతుంది సరికదా మన పని మరింత తేలికవుతుంది...."

"కానీ వాళ్ళు చూస్తే ఆయుధాలు నిరంతరం ధరించే తిరుగుతున్నట్టున్నారే!" దూరంగా వున్న వాళ్ళను గమ నిస్తూ అడిగాడు తెల్ల జాతీయుడు.

"కాసేపు ఓపికపడదాం!" చెప్పాడు సుందరరాజన్.

చాలా సేపు ఆగారు వాళ్ళక్కడ! దూరంగా సము ద్రపు ఒడ్డున ఎర్రటి ఎండలో డేనియల్, కోదండం పడవ నిర్మించడంలో నిమగ్నమయి వున్నారు.

కాసేపు గడిచింది. డేనియల్ చెట్లదగ్గరికి రాసా గాడు! తెల్లజాతీయులు కొద్దిగా కంగారుపడ్డారు. చెట్ల

లోనికి వచ్చి ఆగిపోయాడతడు. నీడకోసం వచ్చాడతడు కాసేపు. భుజానికి తగిలించుకొన్న స్టెన్‌గన్ తీసి ఒక చెట్టుబోదెకు జారవేసాడు! ఉస్సురని నిట్టూర్చి అక్కడే కూలబడ్డాడు విశ్రాంతిగా.

సుందరరాజన్ కళ్ళు ఆత్రంగా వెదికేస్తున్నాయి అక్కడి ప్రదేశాన్నంతా. ఎక్కడయినా అందుబాటులో లెదర్ బాగ్ కనిపిస్తుందేమోనని అతడి ఆశ!

ఇంతలో కోదండాన్ని పిల్చాడు డేనియల్. "కోదండం! బాగా చల్లగా వుందిక్కడ. నువ్వు కూడా రా కూర్చుందాం కాసేపు...."

కోదండం ఒకసారి చెట్లవయిపు చూచి మళ్ళీ తన పనిలో నిమగ్నమయ్యాడు. అతడికి పని వెంటనే అయిపోవాలనుంది. అతడు రాకపోవడంతో ఐదునిమిషాలాగి డేనియల్ లేచి తిరిగి పడవ దగ్గరకు నడిచాడు.

సుందరరాజన్ ముఖం ఆనందంతో విచ్చుకొంది. ఒక తెల్లజాతీయుడివైపు చూశాడు ప్రోత్సాహంగా!

అతడు కాసేపు సంకోచించాడు. మిగతా వాళ్ళు కూడా కళ్ళతో సైగచేయడంతో, మెల్లగా ఊపిరి బిగబట్టి ముందుకు అడుగులు వేశాడతడు!

క్రింద చెమ్మగా వున్న మట్టిలో చప్పుడు గాకుండా నడుస్తూ కదిలాడు. డేనియల్ చెట్టుదగ్గర వదిలేసిన స్టెన్‌గన్ వద్దకు చేరుకొన్నాడు....!

వెనగ్గా మిగతా నలుగురూ కదలకుండా టెన్షన్‌గా చూస్తున్నారు. ఏక్షణాన్నయినా డేనియల్ వెనక్కి తిరిగి మెరుపులా పిస్టల్‌తీసి పేలుస్తాడేమోనన్న భయం సుందరరాజన్‌లో ఉంది!

తెల్లజాతీయుడు గన్ అందుకొన్నాడు! శబ్దం చేయకుండా వెనక్కి తిరిగాడు.

నలుగురూ చూస్తున్నారు. తెల్లజాతీయుడు వాళ్ళను సమీపిస్తున్నాడు. క్రింది తడి నేలలో పైనుండి రాలిన ఎండుటాకులు వున్నాయి అక్కడక్కడ!

ఇసుకలో నడుస్తూన్న డేనియల్ ఏదో చప్పుడుకి అసంకల్పితంగా వెనుదిరిగి చెట్లమధ్యనుండి జరిగేది చూశాడు....!!

(ముగింపు వచ్చేసంచికలో)

సీరియల్ -

# ఎడారి కోయిల

## బొమ్మిడి అప్పారావు

(గత సంచిక తరువాయి)

అతని వెన్నున మళ్ళీ యేదో పాకుతున్న అనుభూతి-ఒళ్ళు జలదరించింది.

ఆ గదిని దాటి వెళ్ళాడు.

అక్కడ పాలరాతితో కట్టిన స్నానాల గది కనిపించింది. మరోసారి కల మెదిలింది.

అవును, అదే గదిలో తనని పన్నీటి జలకాలాడించింది ప్రమద్వర.

వెనుతిరిగిన సిద్ధార్థ ఒంటిని మళ్ళీ చల్లటి తెమ్మెర తాకి అలనల్లన కదిలిపోయింది.

తిరిగివస్తూ ఆ గదిలోకి చూశాడు.

మరో మెరుపు మెరిసింది.

మెరుపు వెలుగులో మంచంమీద ఎవరో స్త్రీమూర్తి పవళించి వున్నట్టు లీలామాత్రంగా మెరిసింది.

సిద్ధార్థ మనసు ఇప్పుడు దృఢంగా వుంది. అక్కడి పరిస్థితికి అతను బాగా అలవాటు పడిపోయాడు ఏదానికీ చలించని స్థితికి చేరిపోయాడు.

ధైర్యంగా ఆ గదిలోకి అడుగుపెట్టాడు. బాగా చీకటిగా వుంది. లోపల ఏదో మత్తయిన వాసన. అవును, తక్కిన గదుల్లోలాగా ఆ గది మెరక వాసన కొట్టడంలేదు. ఏదో సువాసన.

చీకట్లో మంచాన్ని తడుముకుంటూ వెళ్తున్నాడు. కాళ్ళకేదో అడ్డొచ్చి ముందుకు తూలి పడబోయి నిల దొక్కుకున్నాడు. మంచంకోడు తలకి కొట్టుకుంది. నుదురు చిట్లింది. రక్తం జిగటగా చేతికి తగిలింది.

అలాగే మంచాన్ని సమీపించాడు.

బుస్‌మంటూ ఫీత్కారం వినిపించింది.

చటుక్కున వెనక్కి జరిగి వుండకపోతే తిరుగులేని కాలసర్పం కాటుకు బలైపోయుండేవాడు సిద్ధార్థ.

ఒక్క అంగలో ఆ గదినుంచి బయట కురికాడు. నడవాలో నడుస్తూ ఈసారి ఆ గదులకెదురుగా వున్న గదులవైపు కదిలాడు.

అతనికీ మహాలు విషయం చాలా గమ్మత్తుగాను, దుర్భేద్యమైన ఓ పజిల్‌లాగాను కనిపించింది. ఎలాగైనా దీన్ని భేదించితీరాలనే దృఢనిశ్చయం మనసులో వేళ్ళు పాతుకున్నది.

తన కల పదేపదే గుర్తొస్తోంది. కలలో తానీ మహల్లో సజీవమైన వ్యక్తులతో సంచరించాడు. ప్రమద్వర, ఆమె తండ్రి తప్ప తక్కిన వ్యక్తులందరు మూగజీవుల్లా మాటలురాని వాళ్ళలా కనిపించారు?

ఏది నిజం? తన కలా? ఇప్పటి ఈ పరిస్థితా?

ఆలోచిస్తూ మొదటి గదిలోకి నడిచాడు సిద్ధార్థ. మెరుపు వెలుగులో గోడకు చేరవేసి ఉన్న కత్తులు కటార్లు ఇంకా ఏవో ఆయుధాలు ఒక్కక్షణం అతని

కళ్ళబడ్డాయి.

ముందుకు కదిలాడు. పక్కనే యేదో శబ్దం! తల తిప్పాడు. సమ్మెటపోటులాంటి దెబ్బ బలంగా పడింది నెత్తిమీద.

వెంటనే స్పృహ తప్పిపోయింది సిద్ధార్థకు.

* * *

చటుక్కున మెలకువ వచ్చింది కోయిలకు.

అందుకు కారణం వెంటనే గ్రహింపుకు వచ్చిందామెకు.

హోరున వర్షం పడుతోంది.

అంతదాకా తను స్పృహలేకుండా పడివున్నానని ఆమె గ్రహించింది. తనెక్కడున్నదీ వెంటనే ఆమెకు గ్రహింపుకు రాలేదు.

అయితే తనకి స్పృహ తప్పిపోయేముందు ఇసుక తుఫాన్ రావటం, తను గాల్లోకి లేచి వేగంగా ఎటో విసిరివెయ్యబడటం, గాల్లోనే తనకి స్పృహతప్పిపోవటం ఆమెకు ఒకదాని వెంట మరొకటి గుర్తువచ్చాయి.

ఆ వెంటనే ఆమెకు సిద్ధార్థ గుర్తువచ్చాడు. ఆమె గుండె ఝల్లుమన్నది. అవును, అసలే అర్భకుడు! ఇసుక తుఫాన్ల గురించి ఏమాత్రం అనుభవంలేనివాడు.

పాపం, ఏమైపోయాడో....!? ముందు అతని గురించి వెతకాలి. తనలాగానే యెక్కడో ఈ ప్రాంతాల్లోనే దొరకవచ్చు.

చీకటి దట్టంగా పరచుకొని వుంది. కళ్ళముందున్నదేదీ కనిపించటంలేదు. చీకటికి తోడు ఎడతెరిపిలేని వర్షం! అంతకంతకు పెరిగిపోతూనే వుంది.

అయినా సరే, తను ముందుగా సిద్ధార్థ గురించి వెతికి

తీరుంది. తన ప్రతిన చెల్లించటంకోసం, తనవాళ్ళందరు వెనుకంజవేసిన క్షణాన, తనకి అండగా నిలిచి తనకోసం తన వెన్నంటి వచ్చిన ధీరోదాత్తుడు సిద్ధార! అలాంటి మంచి మనిషి ఉనికి తెల్సునని అతన్ని రక్షించవలసిన బాధ్యత తనమీద వున్నది.

ఆమె చేసిన ఓ తెలివైన పనేమిటంటే, తుఫాన్ ప్రారంభమైన వెంటనే కళ్ళు గట్టిగా మూసేసుకున్నది. అందుకే ఆమె కళ్ళలో ఇసకపడి బాధించలేదు. కళ్ళు తెరిచేముందు కనురెప్పలమీద చేరిన ఇసకను అంతక్రితమే మొదలైన వర్షం కడిగేయటంవల్ల మెలకువ వచ్చిన వెంటనే కళ్ళు అకస్మాత్తుగా తెరిచినా ఆమెకెలాంటి బాధ కలగలేదు.

ఆమె లేచి అడుగు ముందుకు వేసింది. కాళ్ళకు పచ్చిక ఒత్తుగా తగిలింది. అంటే తానో మైదానంలో వున్నట్టు అర్థంచేసుకొన్నది. మైదానమంతా పచ్చిక దట్టంగా పెరిగి చూద్దామన్నా మట్టిగాని, ఇసకగాని కలిపించటం లేదు.

అయితే అప్పటికే వర్షం బాగా పెరిగిపోయింది. పచ్చికంతా నీటితో తడిసిపోయింది. కాళ్ళు బురదలో కూరుకుపోతున్నట్టు గ్రహించింది కోయిల.

చీకటి, వర్షం, ఒంటరితనం ఏవీ ఆమెను బాధించటం లేదు. సిద్ధారకేదైనా ఆపద సంభవించి వుదిటుందనే ఆలోచనే ఆమెను బాధిస్తున్నది.

అతను....అతను....తన కన్నె హృదయాన్ని దోచు కున్నాడు. అతన్ని చూసినంతనే తన మనసు ఉరకలెత్తి అనిర్వచనీయమైన అనుభూతితో తన అణువణువు పరవ శించిపోతుంది. అయితే, అతను తనకందని చందమామని

తనకి తెలుసు!

నాగరికుడు, పెద్ద వంశంలో పుట్టినవాడు అయిన దొరబిడ్డలాంటి సిద్దార్థ ఎక్కడ? ఎడారిలో విద్యా గంధం లేకుండా నాగరికత అంటే తెలియని అజ్ఞానురాలైన తానెక్కడ?

అతన్ని తన వెంట అనవసరంగా తీసుకువచ్చానేమో నని పదేపదే తనని తాను నిందించుకున్నదామె. తన ప్రతిజ్ఞ చెల్లించుకున్నాక అతన్ని ఎడారి దాటించి పంపించివెయ్యాలనుకున్నది. కాని జరిగింది వేరు!

అనుకోకుండా ఇసుక తుఫాన్ చెలరేగి వుండకపోతే ఈపాటికి ఆ ఘోర్కా జాతి బందిపోట్లను మట్టుబెట్టి, సిద్ధార్థను ఎడారి దాటించి వుండేది తను.

ఆమె మనసులో కృతనిశ్చయం!

అయితే అంతలోనే తానున్నది ఎడారి ప్రాంతం కాదని గుర్తువచ్చిందామెకు.

చుట్టూ ఎటు చూసినా పచ్చికబయలు. అంతుదొరక నట్టున్న పెద్ద మైదానం! ఈ ప్రాంతం తనెప్పుడూ చూడనిది. తను ఎడారికి ఎంత దూరంలో వున్నదో, ఎటువైపునున్నదో ఏమీ అంతుబట్టడంలేదు.

అసలే రాత్రిసమయం, కటిక చీకటి, ఆకాశం చిల్లులుపడినట్టు ఎడతెరిపిలేని వర్షం. ఇలాంటి పరిస్థితుల్లో ఎక్కడ వెతకాలి?

ఆమెకి కంటనీరు తిరిగింది. ప్రకృతి విలయతాండవం చేస్తున్నట్టు కనిపిస్తోంది. ఒకవేళ ఎక్కడైనా స్పృహ లేని స్థితిలో పడివుంటే, ఈ వాన తాకిడికి, ధాటికి అతనికి ప్రమాదం ముంచుకొస్తుంది. అప్పటికే చూస్తూండ గానే నదిలా తయారయింది మైదానం.

"సిద్ధార్థా" అంటూ, ఎలుగెత్తి అరుస్తూ నీటిలో కాళ్ళీడ్చుకుంటూ అలా నడుస్తూనే వుంది చాలా సేపటి వరకూ.

అంతకంతకూ వర్షం ఉధృతమయ్యింది. ఉరుములు, మెరుపులు..విపరీతమైన గాలి. ఆమె అడుగుతీసి ముందుకు వెయ్యలేని పరిస్థితిలో ఎదురుగా ఏదో కోట గోడవంటిది కనిపించింది.

అది అంతక్రితం సిద్ధార్థ ప్రవేశించిన శిధిలమైన కోట వెనక భాగం. సిద్ధార్థని పేరుపెట్టి పిలుస్తూ, అటు సాగిపోయింది కోయిల. ముఖద్వారంగుండా కోట లోపలవైపుకు ప్రవేశించి వుంటే ఆమె సిద్ధార్థను కలుసుకుని వుండేది!

కాని ఆమె ఆ కోటను చుట్టివున్న గోడకు మరో పక్కనుండి వెనకవైపుకి వెళ్ళిపోయింది ఎలుగెత్తి సిద్ధార్థను పిలుస్తూ.

అయితే, అక్కడ తనకోసం ప్రమాదం పొంచివున్న విషయం ఆమెకి తెలియదు.

• • •

"హల్లో, ఊటీ ఏర్‌పోర్ట్?"

దివ్యగొంతు గుర్తుపట్టిన ఆ విమానాశ్రయాధికారి, "ఎస్...." అన్నాడు ఇబ్బందిగా.

"సర్....ఎనీ ఇన్ఫర్మేషన్ ఎబౌట్ సిద్ధార్థ?"

"లేదు మేడమ్. నిన్న వెళ్ళిన సిబ్బంది ఇంతక్రితమే ఇక్కడికి చేరుకున్నారు. వాళ్ళు ఆ స్పాట్‌ని లొకేట్ చెయ్యలేకపోయారు. మరో స్క్వాడ్‌ని పంపించే ఏర్పాట్లు చేస్తున్నాం...."

అని అతనింకా ఏదో చెపుతుండగానే దివ్య అడ్డు

తగిలింది.

"ఇంత పెద్ద ఏర్ ఫోర్స్ వుండికూడా మిస్సయిన ఓ పైలట్ని లొకేట్ చెయ్యలేకపోతున్నారంటే నమ్మశక్యం కావటంలేదు" అన్నది.

"అమ్మా, మీరింకా చిన్నవారు. లోకంపోకడ సరిగా తెలీని వయసు. ఒక్కోసారి అతిచిన్న విషయం కూడా పరిష్కరించటానికి చాలాకాలం పట్టొచ్చు. కొద్ది గంటల్లో నే సాల్వ్ చెయ్యొచ్చునూవచ్చు, చెప్పలేం."

"అయితే, నాదో చిన్న రిక్వెస్టు...."

"ఏమిటది?"

"ఈసారి మీ సిబ్బందితో నేనూ స్పాట్ కి వస్తాను."

"చూడండమ్మా. మీకిదివరకే చెప్పాను—అందుకు రూల్సు పర్మిట్ చెయ్యవని...."

"నేను పర్మిషన్ తెచ్చుకుంటే....!?"

"కష్టం—సివిలియన్స్ని అనుమతించరు."

"నేను అనుమతి సంపాదిస్తాను...."

"మేడమ్...."

"సర్, ప్లీజ్.... నేను పర్మిషన్ తెచ్చుకుంటే స్క్వాడ్ తో బాటు నన్నూ వెళ్ళనిస్తారు కదూ....!?"

"అఫ్ కోర్స్...."

"ఓ.కె, థాంక్యూ! స్క్వాడ్ ఎన్నిగంటలకు బయలుదేరుతుంది?"

"ఇప్పుడు ఉదయం ఎనిమిదన్నర కావస్తూన్నది. పది గంటలకి బయల్దేరవచ్చు. ఎందుకంటే, సిద్ధార్థ ప్లేన్ లో నించి జారిపోయినపుడున్న సీనియర్ పైలట్ సునీల్ వస్తున్నారీసారి. ఆయన మరో గంటలో ఏర్ పోర్టులో

రిపోర్టు చెయ్యవలసి వుంది."

"వెరీ గ్లాడ్ టు హియర్. నేను మరో అరగంటలో ఏర్‌పోర్టుకొస్తున్నాను. ఈ లోపల అథారిటీస్‌నించి పర్మిషన్ తెచ్చుకుంటాను...." ఫోన్ పెట్టేసి లేచి నిల్చున్నది దివ్య.

మరో గంట తర్వాత ఆమె ఏర్‌పోర్టులో వుంది, పర్మిషన్ లెటర్‌తోబాటు. ఆమె తండ్రికి సెక్రటేరియట్‌లో వున్న పలుకుబడి గురించి తెలియని అధికారులు ఆమె తెచ్చిన ప్రత్యేక అనుమతి పత్రం చూసి ఆశ్చర్యపోయారు. ఆమె పట్టుదల, స్థిరనిశ్చయం చూసి ముచ్చటపడ్డారు కూడా.

"సీనియర్ పైలట్ సునీల్ ఇంతక్రితమే రిపోర్టు చేశారు. మరో అరగంటలో ఆయన సారథ్యంలో స్పెషల్ స్క్వాడ్ ఆ స్పాట్‌కి బయల్దేరబోతోంది" చెప్పాడు ఓ సీనియర్ అధికారి.

అతనామాటలు చెప్తుండగానే సునీల్ అక్కడికొచ్చాడు. ఆ అధికారి దివ్యను అతనికి పరిచయంచేశాడు.

ఆమెను చూస్తూనే సునీల్ దిగ్భ్రమ చెందినట్టు ఆమె నుంచి దృష్టి మరల్చుకోకుండా నిల్చుండిపోయాడు.

అతనంత నిర్లజ్జగా, నిశితంగా తనని గుచ్చి గుచ్చి చూస్తూంటే సిగ్గుతో దివ్య ఒళ్ళు కుంచించుకుపోయింది. ఛీ, ఇతనికి సంస్కారం రవంతైనా లేదు—అని విసుక్కుంది మనసులోనే.

సునీల్ ఆమెను తాకేంత దగ్గరగా వచ్చి "నువ్వేనా సిద్ధార్థ గర్ల్ ఫ్రెండ్‌వి?" అన్నాడు ఆదోలా ధ్వనించే గొంతుతో.

అతని ఏకవచన ప్రయోగానికి ఒళ్ళు మండిపోయినా

తమాయించుకుంది దివ్య. మౌనంగా తలూపింది.

"అతనికోసం వెతకటం శుద్ధ దండగ. ఐ థింక్ హి ఈజ్ నో మోర్!" అన్నాడు చాలా తేలిగ్గా సునీల్.

"స్టాపిట్!" ఏర్‌పోర్ట్ ఆఫీసు ప్రతిధ్వనించింది దివ్య అరుపులకి. అందరి దృష్టి ఆమెమీదికి తిరిగింది. ఆశ్చర్యంగా ఆమెనే గమనిస్తూన్నారు.

"సారీ......ఆవేశాన్నాపుకోలేకపోయాను. సిద్దార్థ గురించి ఎలాంటి చెడువార్తనైనా భరించలేని స్థితిలో వున్నాను. ఐ హోప్ హి ఈజ్ సేఫ్!....మీరు నా ఆశలమీద కుండెడు నిప్పులు కుమ్మరించి అప్‌సెట్ చేశారు" అన్నది నీరసంగా దివ్య.

సునీల్ ముఖం అప్రసన్నంగా వుంది. కాని దివ్య ముఖంలోకి చూస్తూంటే, అది గాలికెగిరిపోయింది. ఉత్సాహం వచ్చింది.

"ఓ.కే! నువ్వు మాతో రావటానికి మాకేం అభ్యంతరంలేదు. యూ ఆర్ మోస్టు వెల్‌కం!" అన్నాడు సునీల్. ఆ మాట అతను మనస్ఫూర్తిగానే అన్నాడు. అందుకారణం దివ్య-దివ్యమంగళ స్వరూపం, మగాడ్ని పట్టి ఆపివెయ్యగల అసమాన సౌందర్యం.

ఆ మాటతో ఆమెకు ఎనలేని ఆనందం, ఉత్సాహం కలిగాయి. అప్పుడే తను సిద్దార్థని కల్సుకున్నట్టు అతనితో కబుర్లు చెప్పుకుంటున్నట్టు ఓ అందమైన దృశ్యం ఆమె మనోఫలకంమీద రూపుదిద్దుకున్నది.

ప్రత్యేక విమానం బయల్దేరటానికి సన్నాహాలు చురుగ్గా సాగుతున్నాయి. సునీల్ సారథ్యంలో మరో ఇద్దరు పైలట్స్, ఇద్దరు స్టివార్డులు, మరో యిద్దరు అధి

కారులు బయల్దేరుతున్నారు. దివ్యతో మొత్తం ఎనిమిది మంది.

దివ్య లాంజ్ లో కూచుని ఉత్కంఠతో యెదురు చూస్తోంది. అనుకోకుండా స్టీవార్డులిద్దరు మాట్లాడుకుంటున్న సంభాషణ ఆమె చెవుల బడింది.

వాళ్ళ మాటలమధ్య సిద్ధార్థ పేరు, మరో అమ్మాయి పేరు దొర్లటంతో ఆసక్తిగా చెవి ఒగ్గి విన్నది.

“....సుస్మిత కూడా సిద్ధార్థతో ఉరికేసిందని సునీల్ సాబ్ చెప్పాడు. వాళ్ళిద్దరు ఏదో ప్లాన్ మీదనే పారాచూట్స్ లో విమానంనించి ఉరికేశారట....” అన్నాడు స్టీవార్డు.

“వారిద్దరికీ ఎన్నాళ్ళుగానో సంబంధాలు సాగుతున్నాయట. సునీల్ సాబ్ సుస్మితని పెళ్ళిచేసుకోవాలనుకున్నారు. ఆమెతో చెపితే ఆయన్ని తిరస్కరించడమే కాక, తను సిద్ధార్థని పెళ్ళిచేసుకోబోతున్నట్టు తెగేసి చెప్పిందట—తన జోలికి వస్తే సిద్ధార్థతో చెప్పి దేహశుద్ధి చేయిస్తానని బెదిరించిందట....”

“ఇంత జరిగినా, సునీల్ సాబ్ వాళ్ళిద్దరి జాడ తెలుసుకోవటం కోసం స్వయంగా బయల్దేరారంటే ఆయనదెంత సంస్కార హృదయమో....”

“గట్టిగా మాట్లాడకు. అదిగో ఆ అమ్మాయి సిద్ధార్థ ప్రియురాలట. అసలు సిద్ధార్థ ఈమెనే పెళ్ళిచేసుకుంటాడని అనుకునేవారు....”

“పెళ్ళి ఒకరితో, రొమాన్స్ మరొకరితో....అప్పుడే మజా వస్తుంది.”

“ఏం మజానో?....ఆడపిల్లల జీవితాలతో ఆటలాడుకునే సిద్ధార్థలాంటి దుర్మార్గులకి అదే సరైన శిక్ష.

వాళ్ళిద్దరు ఇంకా బతికే వుంటారనుకోవటం వెర్రితనం."

"అంతే.... కాని, కనీసం వాళ్ళిద్దరి శవాలినైనా వెతికాల్సిన బాధ్యత డిపార్టుమెంట్ కుంది కదా. అందుకే ఈ ప్రయత్నమంతా...."

"అదిగో, ఆ అమ్మాయి ఇటే వస్తోంది, మన మాటలు వినెయ్యలేదు కదా ...!?"

"విన్నట్టే కనిపిస్తోంది....అయినా, నువ్వే మెల్లగా మాట్లాడమంటే విన్నావు కాదు...."

అంటుండగానే దివ్య అక్కడికి చేరుకుంది. ఆమె ముఖం అవమాన భారంతోను, ఉక్రోషంతోను, అసహాయతతోను ఎర్రబడింది.

సిద్ధార్థ గురించి తనెంతో ఉన్నతంగా ఊహించుకుంది. కాని అతనింత నమ్మకంచకుడా? అతని గురించా తానింత తాపత్రయ పడుతోంది?

ఇదివరకోసారి ఫోన్ చేసినప్పుడు ఏర్‌పోర్టు అధికారి తనకు వివరాలు చెపుతూ సుస్మిత అనే ఏర్‌హోస్టెస్ కూడా సిద్ధార్థతో బాటు విమానంనుంచి దుమికిందని చెప్పినప్పుడు తనా విషయానికి పెద్దగా ప్రాముఖ్యత నివ్వలేదు. ఆ మాట వినగానే మనసు చివుక్కుమన్నది. కాని అంతలోనే సర్దుకున్నది. కాని, వీళ్ళ మాటల్నిబట్టి విషయం చాలా దూరం వెళ్ళిందని తెలుస్తోంది.

"చూడండి.........మీరిప్పటివరకు చెప్పిందంతా నిజమేనా?" సూటిగా అడిగింది దివ్య.

వాళ్ళిద్దరు తడబడి, "మేమేమీ చెప్పలేదే!.....ఏ విషయం మీరడిగేది?" అన్నారు అమాయకంగా ఫోజు పెట్టి.

సరిగ్గా అప్పుడే సునీల్ అక్కడికొచ్చి,

"ప్లేన్ సిద్ధంగా వుంది, సిద్ధంగా వున్నారా?" అనడిగాడు దివ్యను.

"నేను రావటంలేదు. కాన్సిల్డ్" అన్నది కూల్ గా దివ్య.

సునీల్ నిర్ఘాంతపోయి, "అదేమిటి? ఎంతో దుర్లభమైన పర్మిషన్ తెచ్చుకుని రానంటారేమిటి? వాట్సద మేటర్?" అన్నాడు.

స్టివార్డ్లిద్దరు మెల్లిగా అక్కడ్నుంచి జారుకున్నారు.

దివ్యకి దుఃఖం తన్నుకొస్తోంది. కాని పరాయి మగాడి ముందు లోకువ కావటమిష్టంలేక దిగమింగుకున్నది.

"మేడమ్ ..మీరెందుకో అప్ సెట్ అయినట్టున్నారు. సిద్ధార్థ తప్పక క్షేమంగా వుంటారు. ఈ రోజు అతన్నెలాగైనా ట్రేస్ చేస్తాను. బిలీవ్ మీ...."

అప్పటికే దివ్య ముఖంలో అప్రసన్నత తొలగిపోలేదు.

"మీకింకా నమ్మకం కుదర్లేదనుకుంటాను నామీద!" అతని మాటల్లో నిజాయితీ, కొద్దిగా బాధ తొంగి చూశాయి.

చటుక్కున తలెత్తి అతని వంక చూసి, "నమ్మకం కుదరనిది మీమీద కాదు" అన్నది.

"దెన్?! ఏమిటి మీ అభ్యంతరం?"

"సిద్ధార్థ గురించి...."

"ఓహో....ఈ స్టివార్డులేమైనా అవాకులు, చెవాకులు వాగివుండాలి, అవునా?"

దివ్య మౌనంగా చూస్తోందతని వంక.

"చూడండి దివ్యా, మీరు నాకన్న చిన్నవారు, నువ్వని పిలుస్తాను, అభ్యంతరం లేదుకదా...."

తల అడ్డంగా తిప్పింది.

"గుడ్........సిద్ధార్థ మీరనుకుంటున్నట్టు నిజంగా మంచివాడే! మీరనుమానిస్తున్నట్టు, ఇక్కడి వాళ్ళు చెప్పుకుంటున్నట్టు చెడ్డవాడు కాదు........" నచ్చచెప్ప బోయాడు సునీల్.

"నాకంతా తెలిసిపోయింది. ఇన్నాళ్ళు గుడ్డిగా నమ్మాను. అందుకే....ఇంతక్రితం వరకు అతనికోసం ఆరాటపడ్డాను. ఇప్పుడిక అతని గురించి తలచటమే పాప మనిపించి, తిరిగి వెళ్ళిపోతున్నాను."

సునీల్ కి ఆమె మాటలు చాలా ఆనందాన్ని కలిగించాయి. అయితే తన భావాల్ని బయటికి ప్రకటితం కాకుండా జాగ్రత్తపడ్తున్నాడు.

"దివ్యా, మరొక్కసారి ఆలోచించు! ఆవేశంలో అలా మాట్లాడుతున్నావుగాని, ఒక్కసారి ఇంటికి వెళ్ళి ఆలోచిస్తే అతనిమీది కోపం ఇట్టే ఎగిరిపోతుంది.... కమాన్, వెళ్దాం!"

"నేను రాను, రాను, రాను....అంతేకాదు ఇక అతని గురించి ఎన్నటికీ, మరెన్నటికీ మిమ్మల్ని ఎంక్వాయిరీ చెయ్యను. అతని ఉనికి తెలిసినా నాకు ఇన్ఫార్మ్ చెయ్య వద్దు" చరచర ఏర్ పోర్టు బయటికి నడిచింది దివ్య.

•    •    •

కళ్ళు భారంగా తెరిచాడు సిద్ధార్థ.

తల పగిలిపోతున్నట్టు, కళ్ళముందు దృశ్యం అలికేసినట్టు కనిపించింది కాసేపు.

తల అప్రయత్నంగా తడుముకున్నాడు. జిగటగా తగి లింది గడ్డకడ్తున్న నెత్తురు. జరిగిందంతా అప్పుడు గుర్తు వచ్చింది.

తనా గదిలో యేవో కత్తులు, కటార్లు గుట్టగా పోసి

వుండటాన్ని మెరుపు వెలుగులో గుర్తించి గదిలోకి అడుగు పెట్టాడు. ఆ వెంటనే ఎవరో తన నెత్తిమీద గట్టిగా కొట్టారు. క్షణం తనకి స్పృహ తప్పిపోయింది.

అయితే, తనని కొట్టిందెవరు? నిర్జనంగా వున్న ఈ పాడుబడ్డ భవనంలో మనుషులు మసుల్తున్నారా? ఊహూ, మనుషులు కాదు——బహుశా యే భూతమో, దయ్యమో ....!?

తనని తాకుతూ పోయిన చల్లని గాలి తెమ్మెరలు గుర్తువచ్చి వెన్నున జరజర యేదో పాకినట్టనిపించింది. తల విదిలించాడు.

చటుక్కున లేచి నిల్చుని గదంతా ఓసారి కలియ చూశాడు సిద్ధార్థ. గదినిండా తుప్పుపట్టిన పురాతన కాలపు కత్తులు, బల్లాలు, ఇంకా అలాంటి ఆయుధాలు గుట్టలు పోసివున్నాయి. ఎక్కడినుంచో వెలుగురేఖలు లోపలికి ప్రసరిస్తూన్నాయి.

అంటే.... తెల్లవారబోతున్నదన్నమాట!

ముందుకడుగువేశాడు. కాలికి రాయిలాంటి గట్టి పదార్థం తగిలింది.

కిందికి వంగి చూశాడు. అది పైకప్పునుంచి జారిపడ్డ మట్టిపెళ్ళ!

తన తలపైన పడిన దేమిటో సిద్ధార్థకి తెలిసిపోయింది. రాయికన్న బలంగా వున్న ఆ పెళ్ళ పైనుంచి సరాసరి వచ్చి తన నెత్తిమీద పడింది. వెంటనే దాని ధాటికి తన బుర్ర పగిలి స్పృహ తప్పింది.

ఒక్కక్షణం——ఆ ఆయుధాల్లో దేనినైనా తీసుకుందా మనుకున్నాడు. కాని పదునుపోయి తుప్పుపట్టివున్న ఆయుధం తనకు ఉపయోగపడదని గ్రహించి ఆ

ప్రయత్నం విరమించుకుని గది బయటకు నడిచాడు.

భవనం చుట్టూ ఓ పెద్ద సముద్రంలా వుంది వర్షపు నీరు. అసలు తానున్నది ఓ ద్వీపకల్పంలా, అదంతా సముద్రమేనన్న భ్రమ కలిగింది కాసేపు.

కానీ నీటిని దాటుకుని కోట బయటకు వెళ్ళట మెలా? చూడబోతే నీరు చాలా ఎత్తున ప్రవహిస్తోంది. ఈ నీరంతా తీసి నేల తనకి కనిపించాలంటే కనీసం ఇరవై నాలుగ్గంటలు పడ్తుంది. అంతవరకు ఎదురు చూడటం అవివేకం. ఈదుకుంటూ పోవటం మేలు.

ఈ ఆలోచన రాగానే సిద్ధార్థ నీటిలోకి దూకి ఈదుకుంటూ కోట ముఖద్వారంవైపు సాగాడు.

కాళ్ళకు పాములు కాబోలు చుట్టుకుంటున్నాయి. ఏ బురదపాములో అయివుండాలి; కాళ్ళు విదుల్చుకుంటూ వాటిని వదిలించుకుంటూ పెద్ద బారలు వేసుకుంటూ ముఖద్వారం చేరుకున్నాడు సిద్ధార్థ.

కానీ, ఏం లాభం? అక్కడకూడా నీరు నిలువెత్తున ప్రవహిస్తూనే వుంది. నీరు....నీరు....ఎటు చూసినా నీరు. ప్రళయం వచ్చినట్టు, ప్రపంచమంతా ఆ నీటిలో కొట్టుకు పోయినట్టు, నీరు తప్ప ఇంకేమీ కనిపించని భయంకర దృశ్యం!

సిద్ధార్థ కర్తవ్యం తోచక, కొద్దిసేపు కాళ్ళు చేతులు నీటిలో ఆడిస్తూ ఆలోచనలో పడిపోయాడు.

అంతక్రితం వరకు ఎటుచూసినా ఇసకతప్ప నీటి చుక్క దొరకని ఎడారిలో మాడిపోయిన తను, ఇప్పుడు నేల కనిపించని నీటిలో పడి నానుతున్నాడు, ఎంతలో ఎంత మార్పు?

ఇంతకీ కోయిల ఏమైనట్టు?

ఆమె తప్పక బ్రతికే వుంటుంది — ఇక్కడే.... ఎక్కడో!

నలువైపులా దీక్షగా చూస్తుంటూ పెద్ద బారలు వేస్తూ ఆ నీటిలో ఈదుతుంటూ పోతున్నాడు సిద్ధార్థ.

సరిగ్గా అప్పుడే సూర్యుడు ఉదయిస్తున్నాడు.

• • •

కోయిల యిక సిద్ధార్థను చూడగలనన్న ఆశ వదిలేసు కున్నది. అంతకంతకు వర్షం ఉధృతమై ఆమె కాలంతిని ముందుకు వెయ్యలేని పరిస్థితి యెదురయ్యింది. మనసు మాత్రం అతనికోసం తపన పడుతోంది. శరీరం ప్రతి ఘటిస్తోంది.

తలదాచుకునే నీడకోసం ఆమె చుట్టూ కలియ చూసింది. కనుచూపు మేరలో ఓ పశువుల కాలవంటిది కనిపించింది. వేగంగా అటు పరుగెత్తింది.

పాక దగ్గరపడింది. అది వెదురులోను, తాటాకుల తోను వేసిన కాల. ఒక్క అంగలో దాని లోపలికి చేరుకున్నది.

లోపల కనిపించిన దృశ్యం చూసి ధైర్యవంతురాలు అయిన కోయిల కూడా ఓ అడుగు వెనక్కు వేసింది.

ఆ పాక చాలా ఎత్తయిన ప్రదేశంలో వుండటంవల్ల అక్కడ వర్షపునీటి ప్రభావంలేదు. లోపలంతా పొడిగా వెచ్చగా వుంది.

వెచ్చగా వుండటాని క్కారణం అక్కడ ఓ నెగడు మండుతోంది. నెగడు చుట్టూ ముగ్గురు వ్యక్తులు కూచుని వున్నారు. నెగడు మంటలో ఏదో జంతు మాంసాన్ని కాల్చుకుంటున్నారు.

వాళ్ళు ముగ్గురు చూడటానికి మనుషుల్లా లేరు. కొరివి

దయ్యాల్లా వున్నారు. రాక్షసుల్లా వున్నారు. నర మాంసాన్ని పీక్కుతినే రాబందుల్లా వున్నారు. మంట వెలుగు వాళ్ళ ముఖాలమీద భయంకరంగా ప్రతిఫలిస్తోంది. వాళ్ళ కళ్ళు రక్తాన్ని కరిస్తున్నట్టున్నాయి.

అయితే ఇవేవీ ఆమెను భయపెట్టలేదు.

వాళ్ళు కాల్చుకుతింటున్నది జంతువుని కాదని మనిషినని గుర్తించి అదిరిపడింది. వాళ్ళలో ఒకడు కాల్తున్న మాంసఖండాన్ని పైకి తీసి పచనమయిందో లేదో చూస్తున్న సమయంలో మాంసఖండం కాలును చూసి అది మనిషి కాలని గ్రహించింది కోయిల.

ఆమెకు తెలియకుండానే సన్నని కేక ఆమె నోటి నుంచి వెలువడింది. ఆమె మనసులో ముందుగా మెదిలిన మనిషి—సిద్ధార.

సిద్ధారని చంపివెయ్యలేదుగదా వీళ్ళు!?

ఆ ఆలోచననే భరించలేకపోయింది కోయిల.

అప్పటికే ఆమెను చూసేశారు వాళ్ళు. ఆమె వెను తిరిగేటంతలో ముగ్గురు ఆమెను ఒడిసి పట్టుకున్నారు.

కోయిల వాళ్ళకి చిక్కదలుచుకోలేదు. మెరుపు వేగంతో మండుతున్న నెగడులోనించి కట్టెల్ని చెరో చేత ధరించి వాళ్ళ ముఖాలకేసి కొట్టింది. ఇద్దరు కళ్ళు పోయి నేల కూలిపోగా మూడోవాడు ఆమె చేతుల్ని విరిచి పట్టుకుని బలంగా సందిట బిగించాడు.

కోయిల ఆ వ్యక్తి ఊహించనంత వేగంగా విల్లులా ముందుకి వంగి, ఆ వ్యక్తిని అమాంతం తన తలమీదుగా వేగంగా విసిరేసింది.

ఆ ఊపుకు పొకబయటకు దూసుకుపోయి నదిలా ప్రవహిస్తున్న నీటిలో పడిపోయాడా వ్యక్తి. ఈలోపల

కిందపడ్డ ఇద్దర్ని కట్టెలతో ఇష్టమొచ్చినట్టు బాది, వాళ్ళ ఒంటినిండా వాతలు పెట్టింది కోయిల. ఆ తర్వాత వాళ్ళని కూడా నీళ్ళలోకి విసిరేసింది.

తను ఈ వర్షం తగ్గేవరకు తలదాచుకోవటానికి ప్రస్తుతం ఈ పాక తప్ప మరో ఆశ్రయం లేదు. వాళ్ళు ముగ్గుర్లో ఇద్దరు అప్పటికే గుడ్డివాళ్లయిపోయారు. మూడో వాడు ఈపాటికే ముక్కుల్లోకి నోటిలోకి నీరు పోయి ఉక్కిరిబిక్కిరై అపస్మారక స్థితిలో వుంటాడు.

కోయిల చకచక ఆ పాకలో సిద్ధార్థకి సంబంధించిన ఆనవాళ్ళకోసం వెతికింది. కనీసం అతను ధరించిన దుస్తులైనా అక్కడ కనిపిస్తే ఆ శవం అతనిదేననుకోవటానికి ఆధారముంటుంది.

అయితే అక్కడ సిద్ధార్థకి సంబంధించిన గుర్తులేవీ కనిపించకపోవటంతో తేలిగ్గా హాయిగా ఊపిరిపీల్చుకున్నది.

బయట భూమ్యాకాశాలను ఏకంచేస్తూ వర్షం ఏకధాటిగా కురుస్తూనే వుంది.

కోయిల ఆ పాకలో ఒంటరిగా తెల్లవారేవరకు గడిపింది. ఆ ముగ్గురు నరమాంస భక్షకులు మళ్ళీ ఆ పాకలోకి అడుగుపెట్టలేదు. వాళ్ళేమయ్యారో జాడ కూడా తెలియలేదు.

తెల్లవార్తూనే పాకలోనించి బయటికి వచ్చింది కోయిల. కనుచూపుమేరలో ఎటుచూసినా ఉరకలెత్తి పారుతున్న మహాజల ప్రవాహం.

ఆమె కళ్ళు అప్పుడు కూడా, ఆర్తిగా, ఆత్రుతగా సిద్ధార్థకోసం వెతకటం మానలేదు. అతనెక్కడున్నా క్షేమంగా వుండాలని, అతనికేలాంటి అపదా కలగ

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 30/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

కూడదని కనిపించని దేవుడికి మనసారా మొక్కుకున్నది.

దగ్గర్లోనే ఎత్తయిన కొండప్రదేశం కనిపించిందామెకు. ఆ కొండెక్కి చూస్తే కొన్ని మైళ్ళదూరం వరకు నలువైపులా ఏమున్నదీ కనిపిస్తుంది. ఆ ఆలోచన రాగానే కోయిల నీటిలోకి ఉరికింది.

కాళ్ళు చేతులు వేగంగా నీటిలో కదిలిస్తూ మహా వేగంగా ముందుకి కొండవైపు ఈదుకుంటూ పోయింది కోయిల.

* * *

కాసేపు ఈదాక నిస్త్రాణ, నీరసం ఆవరించుకున్నాయి సిద్ధార్థలో.

కొద్దిక్షణాలు ఈదటం ఆపి, నీటి లోతును చూడటానికి నీటిలో నుంచున్నాడు. ఇప్పుడు నేల అందుతోంది కాళ్ళకు. అయితే నీటిమట్టం గడ్డందాకా వచ్చింది నించుని వుండగా. నోటిలోకి నీరుపోయే అవకాశాలు యెక్కువ. నోరు తెరవకుండా బాలెన్స్ చేసుకుంటూ నడిస్తే ఫరవాలేదు.

జాగ్రత్తగా నీటిలో నడుస్తున్నాడు. కింద పచ్చిక ఒత్తుగా తగుల్తోంది కాళ్ళకి. మధ్య మధ్య కాళ్ళకి తీగెలు లతలు వంటి వేవో తగుల్తున్నాయి. బహుశా అవి నీటిపాములయి వుండాలి! ఒక్కోసారి అతిమెత్తగా స్పృశిస్తున్నాయి.

వీటికితోడు నీటిమీద తేలివస్తున్న విషసర్పాలు! ఒకటీ, రెండూ కాదు—పదుల సంఖ్యలో కొట్టుకొని వస్తున్నాయి. కొన్ని చనిపోయున్నాయి, మరికొన్ని ప్రాణభయంతో గిలగిల్లాడుతున్నాయి. వాటిని చూస్తూంటే ఇప్పుడు సిద్ధార్థకి భయమనిపించటంలేదు.

అవి ప్రస్తుతం తమ ప్రాణాలు నిలబడితే చాలుననే తాపత్రయంతో వున్నాయి. అయితే ఆ ఆందోళనలో మరింత పిచ్చిగా కాటువేసే ప్రమాదముంది.

అందుకే సిద్ధార్థ వాటిబారినుంచి లాఘవంగా తప్పించుకుంటూ నడుస్తూన్నాడు. మరీ లోతుగా వున్నచోట నేల అందటంలేదు. అప్పుడు ఈదక తప్పటంలేదు. మరో అరగంటలో సూర్యుడు పైపైకి పొడుచుకొచ్చాక నీటి మట్టం త్వరగా తగ్గటం మొదలెట్టింది.

అయితే ఎటుచూసినా ఒకేలా వుంది. సూర్యుడ్ని బట్టి దిక్కులు నాలుగింటిని గుర్తించగలిగినా, ఏ దిక్కుగా వెళ్తే ఏ ప్రాంతానికి చేర్తుందో, జనావాసప్రాంత మెక్కడుందో తెలిసే అవకాశంలేదు.

ఎడారిలో కనీసం ఏదో లక్ష్యమైనా వుండేది, యిప్పుడదీ లేదు.

మరోగంట గడిచాక ఎత్తయిన ప్రదేశం కనిపించింది. ప్రాణం లేచివచ్చింది సిద్ధార్థకు. అప్పటికే దుస్తులు బాగా తడిసి ఒంటికి అతుక్కుపోయి, చాలా అసౌకర్యంగా వుంది.

గట్టెక్కగానే దుస్తులు విప్పేశాడు. గట్టిగా పిండేసి ఎండకి ఆరవేశాడు. సూర్యుడి తీక్షణతకు అతని ఒళ్లు క్షణాల్లో ఆరిపోయింది. వెచ్చగా హాయిగా అనిపించింది. సూర్యుడినుంచి తన శరీరానికి ప్రాణవాయువు అందినట్టనిపించింది. సూర్యుడ్ని పెద్దవాళ్ళు భగవంతుడిగా ఎందుకు కొలుస్తారో అప్పుడర్థమయింది.

పదినిమిషాల్లో గుడ్డలు ఆరిపోయాయి. అక్కడక్కడ నిగిపోయినా గుడ్డలు ధరించగానే తేలిగ్గా అనిపించింది.

అక్కడ నీరు ఒక్కసారిగా కిందనున్న లోయలో పెద్ద శబ్దంచేస్తూ పడుతోంది. చూడటానకి చిన్నసైజు జలపాతంలా వుందక్కడ. ఎక్కడెక్కడినుంచో నీరంతా అక్కడికే చేరి లోయలో వేగంగా పడిపోతోంది.

తను ఈదుకుంటూ గుడ్డిగా వచ్చివుంటే ఈ గట్టు చేరకముందే సరాసరి ఆ లోయలో పడిపోయుండేవాడు. నిజంగా పెద్ద గండం గట్టెక్కింది.

అతనూహించినట్టు నిజంగా గండం గట్టెక్కలేదు. ఆశర్వాత కొద్దిక్షణాల్లో మరో రూపంలో అతన్నిగు రొక్కన్నది.

సిద్దార్థ గట్టు పొడవునా ఏదో రహదారి వున్నట్టు గుర్తించాడు. రహదారి వుందనగానే ఆ పరిసరాల్లో ప్రజలు నివసిస్తున్నారనే అర్థం! అతని ముఖంలో కాంతి రేఖ వెలిగింది.

హుషారుగా ఆ గట్టు వెంబడి ముందుకు నడిచాడు సిద్దార్థ.

అక్కడనేల బాగా దిగువ మట్టంలో వుంది. అయితే అటు ఇటు బండరాళ్ళ మధ్యగా రహదారి కనిపించింది.

సిద్దార్థ ఆ రహదారి గుండా ముందుకి నడిచాడు. అది సరాసరి ఓ మైదానంలోకి దారి తీసింది. మైదానంలో వరసగా కనిపించిన రాతి గుహల్ని చూడగానే విస్తు పోయాడు సిద్దార్థ.

ఒకటి, రెండు కాదు—పదుల సంఖ్యలో ఉన్నాయవి. దూరానిక గుడిసెల్లా కనిపించాయి. దగ్గరకొచ్చాక గాని అవి గుహాలుగా గుర్తించలేదతను.

(ఇంకా వుంది)

